# కాళేశ్వరం ప్రాజెక్టు :

## ప్రశ్నలు - విమర్శలు - వక్రీకరణలు - వివరణలు


**శ్రీధర్‌రావు దేశ్పాండే,**

సూపరింటెండింగ్ ఇంజనీర్ (రిటైర్డ్)
సాగునీరు & ఆయకట్టు అభివృద్ధి శాఖ






ప్రచురణ :

**తెలంగాణ వికాస సమితి**

మార్చి, 2025

# కాశేశ్వరం ప్రాజెక్టు :

## ప్రశ్నలు-విమర్శలు-వక్రీకరణలు-వివరణలు

**శ్రీధర్‌రావు దేశ్‌పాండే**
ఇం.నెం. 7-126,
శ్రీశ్రీ ఎవెన్యూ, గుర్రం గూడ,
బాలాపూర్ (మం), రంగారెడ్డి జిల్లా,
తెలంగాణ, PIN : 501510.
9491060585
Email : deshpandesri@gmail.com

**మొదటి ప్రచురణ :** మార్చి 2025

**వెల :** 100/-

పుస్తకాలు దొరుకుచోటు:
నవోదయ బుక్ హౌజ్
కాచిగూడ, హైదరాబాద్.
ఫోన్ : 040-24652387, 9247471361

**ప్రచురణ :**
తెలంగాణ వికాస సమితి
హైదరాబాద్.
సెల్ 9700302973



**ప్రింటింగ్ :**
**శ్రీ దత్తసాయి గ్రాఫిక్స్ ,**
1-1-651/8, గాంధీనగర్,
హైదరాబాద్-500 080.
సెల్: 9866381116

# కాళేశ్వరంపై విమర్శలను సాధికారికంగా తిప్పికొట్టిన పుస్తకం



**- వి. ప్రకాశ్,** మాజీ చైర్మన్
తెలంగాణ జలవనరుల అభివృద్ధి సంస్థ

2024 ఏప్రిల్‌లో తెలంగాణ ప్రభుత్వ నీటి పారుదల శాఖలో సూపరింటెండింగ్ ఇంజనీర్‌గా రిటైర్ అయిన శ్రీ శ్రీధర్‌రావు దేశ్‌పాండే తెలంగాణ ఉద్యమంలో తెలంగాణ విద్యావంతుల వేదిక, ఉద్యోగుల సంఘం, తెలంగాణ రచయితల వేదిక నాయకునిగా చురుకైన పాత్ర నిర్వహించారు. అదే సమయంలో తెలంగాణ చరిత్ర, సాహిత్య రంగాలలో కూడా విశేషమైన కృషి చేసారు. ఇంజినీర్‌గా క్షణం తీరిక లేని జీవితం గడుపుతూనే తెలంగాణకు సమైక్య రాష్ట్రంలో నీటి పారుదల రంగంలో ఉద్యోగ నియామకాల్లో జరిగిన, జరుగుతున్న అన్యాయాలపై అనేక వ్యాసాలను పత్రికల్లో రాసి ప్రజల్లో, విద్యావంతుల్లో చైతన్యాన్ని, ఉద్యమ సోయిని కలిగించారు. చంద్రబాబు నాయుడు, వై.ఎస్. రాజశేఖర్ రెడ్డి పాలనా కాలంలో ఎవరైనా ఉద్యోగి 'తెలంగాణ' అంటే అనేక ఇబ్బందులను పై అధికారుల నుండి ఎదుర్కోవలసి వచ్చేది. ఎక్కువ మంది ముందుకు వచ్చేవారు కాదు. అయినా తెలంగాణ ఇంజనీర్లు రాష్ట్ర సాధన కోసం త్యాగాలకు సిద్ధపడి ఇంజనీర్ తన్నీరు వెంకటేశం నాయకత్వంలో 'ఇంజనీర్ల జాయింట్ యాక్షన్ కమిటీ' ప్రారంభించి పలు కార్యక్రమాలు నిర్వహించిన సందర్భాలలో దేశ్‌పాండే చురుగ్గా పాల్గొన్నారు.

నిజాం పరిపాలనా కాలం నుండి కూడా నదీ జలాల వినియోగం పట్ల తెలంగాణ రాజకీయ నాయకులకు గానీ, విద్యావంతులకు గాని అవగాహన పెద్దగా లేదు. హైదరాబాద్ రాష్ట్రంలో, తెలంగాణ ప్రాంతంలో కృష్ణా, గోదావరి నదీ జలాల వినియోగం గురించి 'ప్రణాళికలు సిద్ధం చేసిన అప్పటి ఛీఫ్ ఇంజనీర్ నవాబ్ అలీ నవాజ్ జంగ్ బహదూర్. అవి ఆచరణకు నోచుకోక ముందే బహదూర్ 1949 లో మరణించారు. ఆయన నిర్మించాలనుకున్న పది భారీ ప్రాజెక్టుల గురించి, అనేక మీడియం ప్రాజెక్టుల గురించి ఆయనకు, ఆఖరి నిజాంకు, కొందరు అప్పటి తెలుగేతర ఇంజనీర్లకు తప్ప మరెవరికీ అవగాహన లేదు. ఎందుకంటే శతాబ్దాల నుండి తెలంగాణ వ్యవసాయం ఏనాడూ నదీ జలాలపై ఆధారపడి లేకుండె. మెదక్ జిల్లాలో ఘన్‌పూర్ ఆనకట్ట మొదటిది కాగా నిజాంసాగర్ రెండో ప్రాజెక్టు. మంజీరా నదిపై ఈ రెండు ప్రాజెక్టులను నిర్మించారు. వీటి క్రింద తప్ప మిగిలిన సాగంతా బావులు, వందలాది ఏళ్ళనాటి చెరువులపై ఆధారపడి వుండడం వల్లనే నదీ జలాల గురించి ఎవ్వరూ ఆలోచించ లేదు. ఆంధ్రలో సర్ ఆర్థర్ కాటన్ నిర్మించిన గోదావరి ఆనకట్ట 1852 నాటికే పూర్తవడం, తదనంతరం కెసి కెనాల్, సంగం ఆనికట్, కృష్ణా బ్యారేజీ వంటివి నిర్మించడం, వీటి ద్వారా లక్షలాది ఎకరాల్లో నదీ జలాలతో పంటలు పండి మిగులు ధనాన్ని సృష్టించడం, ఈ ధనాన్ని వివిధ వ్యాపారాల్లో పెట్టుబడులు పెట్టి ఆంధ్రులు సంపన్నులు కావడం, తమ పిల్లల్ని విదేశాల్లో పెద్ద చదువులు చదివించడం... ఈ పరిణామాల వల్ల నదీ జలాల వినియోగం పట్ల ఆంధ్ర ప్రజలకు, విద్యావంతులకు, రాజకీయ నాయకులకు సంపూర్ణ అవగాహన వుండేది. వారి దృష్టిలో నదీ జలాలంటే ప్రవహించే బంగారమే!

తెలంగాణ వారికి నదీజలాల వినియోగం పట్ల అవగాహన లేకపోవడం వల్ల నిజాం అలీ నవాజ్ జంగ్ సహాయంతో నిర్మించాలనుకున్న పది ప్రాజెక్టులలో ఏడు భారీ ప్రాక్టులను సమైక్యాంధ్రప్రదేశ్ పాలకులు వదిలేసారు. తదనంతరం నిర్మించిన కడెం, నాగార్జునసాగర్, శ్రీరామ్‌సాగర్ (పోచంపాడు) ప్రాజెక్టుల క్రింది ఆయకట్టును బాగా తగ్గించారు. అయినా శ్రీ. జయశంకర్ గారు అప్పటికే నిర్మాణంలో వున్న పోచంపాడు, నాగార్జునసాగర్‌లో జరుగుతున్న జాప్యాన్ని నిధుల కెటాంపును ప్రశ్నించారు తప్ప వదిలేసిన "ఏడు ప్రాజెక్టుల గురించి వారికీ అవగాహన లేకుండె.

1954 లోనే ప్రత్యేక తెలంగాణను డిమాండ్ చేసిన పూర్వ మంత్రులు – కొండా వెంకట రంగారెడ్డి, మర్రి చెన్నారెడ్డి వంటి నాయకులకు ఈ ఏడు ప్రాజెక్టుల గురించి తెలియదు. 1969 తెలంగాణ ఉద్యమాన్ని ప్రారంభించి నడిపించిన ఉద్యమ నేతలకూ తెలియదు. అదీ మన దౌర్భాగ్యం, భావ దారిద్ర్యం. ఇదే పరిస్థితి వెంగళరావు సి.ఎం అయ్యేంత వరకూ కొనసాగింది. ఆయన పాలనలోనే తెలంగాణ నీటి పారుదల ప్రాజెక్టులపై శ్వేత పత్రాన్ని ప్రకటించారు. బచావత్ ట్రిబ్యునల్ కృష్ణా నదీ జలాలను కేటాయిస్తూ తీర్పు నిచ్చింది, గోదావరి జలాలు పంపకానికి సంబంధిత రాష్ట్రాల మధ్య ఒప్పందాలు కుదిరినవి. వెంగళరావుకు కూడా ఏడు ప్రాజెక్టుల గురించి తెలిసినట్లు లేదు. స్టేట్స్ రీ ఆర్గనైజేషన్ చట్టంలోని నదీ జలాలకు సంబంధించి పేర్కొన్న రక్షణల గురించి (సెక్షన్ 107, 108) ప్రభుత్వ పెద్దలకు, విద్యావంతులకు తెలియదు. ఇవన్నీ తెలిసే 'నీలం సంజీవరెడ్డి, బ్రహ్మానందరెడ్డి మన ఏడు ప్రాజెక్టులను వదిలేసారు. భాషా ప్రాతిపదికన ఆంధ్ర – తెలంగాణలను ఒక్కటి చేయాలని విశాలాంధ్ర నినాదాన్ని బలపర్చిన కమ్యూనిస్టులు కూడా ఏనాడు తెలంగాణకు సాగునీటి రంగంలో జరుగుతున్న వివక్ష గురించి, ఏడు ప్రాజెక్టులను వదిలేసిన సంగతి కానీ అసెంబ్లీ, పార్లమెంటుల్లో ప్రశ్నించలేదు. నల్గొండలో దుశ్చర్ల సత్యనారాయణ నడిపిన జలసాధన ఉద్యమం కేవలం ఆ జిల్లాకు కృష్ణా జలాల సాధన కోసమే దృష్టి పెట్టింది. వదిలేసిన ఏడు ప్రాజెక్టుల సంగతి ఆ ఉద్యమకారులకు తెలియదు.

తొలిసారి ఈ ఏడు ప్రాజెక్టుల (అప్పర్ క్రిష్ణా, భీమా, తుంగభద్ర దిగువ కాల్వ, గోదావరి బహుళార్థసాధక ప్రాజెక్టు, దేవునూరు, లోయర్ పెన్‌గంగ, ప్రాణహిత, ఇచ్చంపల్లి ప్రాజెక్టులు) గురించి తెలంగాణా సమాజానికి తన వ్యాసం ద్వారా తెలిపిన వ్యక్తి రిటైర్డ్ ఇంజనీర్ ఇన్ ఛీఫ్ ప్రభాకర్ రావు గారు. ఈ వ్యాసాన్ని మొదటిసారి నా సంపాదకత్వంలో వచ్చిన 'తెలంగాణ మహాసభ' పత్రికలో ప్రచురించడంతో యావత్తు తెలంగాణ నెవ్వెరపోయింది (ఆగస్టు–1997లో).

తెలంగాణ రైతుల ఆత్మహత్యలకు నదీజలాల వినియోగంలో వివక్ష, నిర్లక్ష్యమే కారణమని గ్రహించిన ప్రొ॥ జయశంకర్ ఈ రంగంపై అవగాహన పెంచుకోడానికి (నన్ను వెంట బెట్టుకొని) ప్రభాకర్ రావు ఇంటికి వెళ్ళడం జరిగింది. ఆయన కల్పించిన అవగాహనతోనే 2002 వరకు వివిధ దిన పత్రికల్లో వందకు పైగా వ్యాసాలు రాసి ప్రజల్లో అవగాహన పెంచడం జరిగింది. 2002 లో నా ద్వారా ఆర్. విద్యాసాగర్ రావు (రిటైర్డ్ సి. ఇ. జలకేంద్ర సంఘం) తెలంగాణ ఉద్యమంలోకి ప్రవేశించినారు. ఆయన మరణం వరకు వందలాది వ్యాసాల ద్వారా, పుస్తకాల ద్వారా సాగునీటి సోయి కల్పించారు.

ఇదంతా ఒక ఎత్తయితే నీటి పారుదల ప్రాజెక్టులకు సంబంధించి పైన తెలిపిన మాకెవ్వరికీ తెలియని సమాచారాన్ని గణాంకాలను సేకరించి మాకందించి, తన వ్యాసాల ద్వారా జనబాహుళ్యానికి మరింత

అవగాహన పెంచిన ఇంజనీర్ శ్రీధర్ రావు దేశ్ పాండే. ఆర్. విద్యాసాగర్ రావు "జల విజ్ఞానం' శీర్షికతో వార్తలో, వివిధ పత్రికల్లో రాసిన వ్యాసాలను 'నీళ్ళు – నిజాలు' పేరుతో మూడు సంకలనాలు ప్రచురణ వెనుక వున్న వ్యక్తి కూడా శ్రీధర్ దేశ్ పాండే గారే. ఈ సంకలనాల వల్ల విద్యాసాగర్ రావు వ్యాసాలను ఒకే దగ్గర చదివే వీలు కలిగింది. తెలంగాణ ఉద్యమకారులకు జలసోయి కలిగించి ఉద్యమోన్ముఖులను చేయడానికి ఇవెంతో తోడ్పడినాయి. తెలంగాణ ఉద్యమ సారథి కెసిఆర్ పలుమార్లు అన్నట్లు ఈనాటి తెలంగాణ ఎడ్డి గుడ్డి తెలంగాణ కాదు–ఎంతో తెలివైన తెలంగాణ" అన్న నిజాన్ని నిరూపించడానికి శ్రీధర్ కృషి ఎంతో నిజాన్ని వున్నది. ఇంతకు ముందు ప్రస్తావించిన ఇంజనీర్ నవాబ్ అలీ నవాబ్ జంగ్ బహదూర్ జీవిత చరిత్రను రాసి ఆయన జీవితకాలపు కృషిని ప్రపంచానికి తెలియజేసింది కూడా దేశ్‌పాండేనే. తెలంగాణ రాష్ట్ర సమితి జస్టిస్ శ్రీకృష్ణ కమిటీకి 2010 లో ఇచ్చిన నీటిపారుదల డాక్యుమెంట్ రూపకల్పనలో కూడా శ్రీధర్ పాత్ర ఉన్నది.

'ఇవన్నీ ఉద్యమ ప్రస్థానానికి సంబంధించిన వైతే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తర్వాత శ్రీధర్ నిర్వహించిన పాత్ర అనితర సాధ్యమైనది. సాగునీటి శాఖలో డిప్యూటీ చీఫ్ ఇంజనీర్‌గా బాధ్యతలు నిర్వహిస్తున్న ఆయనను అప్పటి నీటి పారుదల శాఖా మంత్రి శ్రీ తన్నీరు హరీశ్ రావు తన ఓ.ఎస్.డిగా నియమించుకున్నారు. తెరాస రెండవ టర్మ్ పాలనలో స్వయంగా సి.ఎం. కెసిఆర్ నీటిపారుదల శాఖను తన వద్దే వుంచుకొని శ్రీధర్‌ను ఓ.ఎస్.డి గా కొనసాగించారు. వీరిరువురికీ తెలంగాణ సాగునీటి ప్రాజెక్టుల రీ–డిజైనింగ్ లో, పెండింగ్ ప్రాజెక్టులను సత్వరమే పూర్తి చేయడంలో, వివిధ జిల్లాల అవసరాలకు తగినట్లు క్రొత్త ప్రాజెక్టుల రూపకల్పన, పాత ప్రాజెక్టుల క్రింది ఆయకట్టు పెంచడం వంటి విషయాల్లో నీటిపారుదల శాఖకు, సిఎంఓకు సమన్వయం సాధించడంలో శ్రీధర్ సలహాలు, సూచనలు ఎంతో ఉపయోగపడినాయి.

తెలంగాణ గత ప్రభుత్వం ఎంతో ప్రతిష్టాత్మకంగా నిర్మించిన కాళేశ్వరం ప్రాజెక్టుకు సంబంధించిన పలు అంశాలను 'తెలంగాణ జీవధార కాళేశ్వరం ప్రాజెక్టు' పేరుతో తెలంగా విశ్రాంత ఇంజనీర్ల సంఘం ప్రచురించిన (2018) పుస్తకంలో శ్రీధర్ రాసారు. సీనియర్ ఇంజనీర్‌లతో రాయించారు. తానే స్వయంగా 2019 లో "కాళేశ్వరం ప్రాజెక్టు – తెలంగాణ ప్రగతి రథం" పుస్తకాన్ని వెలువరించారు. వీటితో బాటు తెలంగాణ ఆవిర్భావం తర్వాత కావాలని పలువురు విమర్శకులు, రాజకీయ దురుద్దేశంతో చేసిన విమర్శలకు ధీటైన జవాబిచారు శ్రీధర్ దేశ్‌పాండే. పలు జటిలమైన అంతర్ రాష్ట్ర జలవివాదాలకు సంబంధించిన అంశాల్లో తెలంగాణ హక్కుల కోసం కృష్ణా, గోదావరి రివర్ మేనేజ్ మెంట్ బోర్డుల సమావేశాల్లో అధికార హోదాలో హాజరై బలమైన వాదనలు వినిపించారు. అప్పటికే పదోన్నతి పొందిన శ్రీధర్ దేశ్‌పాండే 2014–23 మధ్య కాలంలో సాగునీటి శాఖ ప్రిన్సిపల్ కార్యదర్శులు, కార్యదర్శులకు, ఇంజనీర్ ఇన్–చీఫ్ లకు కూడా మార్గ నిర్దేశనం చేసే వారంటే అతిశయోక్తి కాదు.

తన సహజర ఇంజనీర్ సల్లా విజయకుమార్ (ఆర్. విద్యాసాగర్ రావు కు ఒ.ఎస్.డి) తో కలిసి ఆంగ్ల పత్రికల్లో 'పలు వ్యాసాలు రాసారు. పోతిరెడ్డిపాడు వివాదాల మీద మంచి, సాధికారకమైన పుస్తకం రాశారు.

ప్రస్తుత రచన కాళేశ్వరం ప్రాజెక్టుకు సంబంధించి జస్టిస్ పి.సి. ఘోష్ కమీషన్ ముందు వివిధ సంఘాలు, వ్యక్తులు, ఇంజినీర్లు తెచ్చిన అనేక ప్రశ్నలకు ఎంతో ఓపికతో నిజాలను వివరించే సమాధానాల సంకలనం. కాగ్ లేవనెత్తిన ఆర్థిక అంశాలకు సంబంధించిన విషయాలు, అభ్యంతరాలను కూడా ఈ పుస్తకంలో చర్చకు

పెట్టాడు రచయిత. అన్ని కోణాల నుండి అత్యంత వివాదాస్పదం చేయబడ్డ కాళేశ్వరం ప్రాజెక్టుపై తన సమాధానాల్లో విశ్లేషించారు శ్రీధర్ దేశ్‌పాండే. ఈ పుస్తకాన్ని చదివిన వారికి కాళేశ్వరం ఎలా తెలంగాణకు జీవధార కాగలదో, ప్రపంచంలోనే ఏ విధంగా భిన్నమైన గొప్ప ప్రాజెక్టో అర్థం కాగలదు. సహేతుకమైన విమర్శలు చేయకుండా కెసిఆర్ పై కోపంతో కాళేశ్వరంపై విషం చిమ్ముతున్న కుహనా మేధావులకు చెంపపెట్టు శ్రీధర్ దేశపాండే రాసిన ఈ పుస్తకం.

ప్రభుత్వంలో భాగంగా ఉన్నందున తనకున్న పరిమితులను దృష్టిలో పెట్టుకొని నాకు సమాచారాన్ని అందించి వెదిరె శ్రీరాం రాసిన వ్యాసాలుకు దీటైన జవాబులను రాయడంలో, అల్దాస్ జానయ్య చేసిన కుహనా విమర్శలను పూర్వపక్షం చేయడంలో, జస్టిస్ పినాకి చంద్ర ఘోష్ కమీషన్‌కు నేనిచ్చిన 17 అంశాల అఫిడవిట్ రూపకల్పనలో శ్రీధర్ దేశ్‌పాండే అందించిన సహకారం నేనెప్పటికీ మరువలేను. గత ఏడేళ్ళ కాలంలో కెసిఆర్ ప్రభుత్వం సాగునీటి రంగంలో చేపట్టిన ప్రాజెక్టుల గురించి సమగ్ర సమాచారాన్ని 'సాగునీటి రంగంలో పగతి ప్రవాహం' శీర్షికతో పుస్తక రూపంలో తెచ్చింది శ్రీధర్ దేశ్‌పాండే గారే. తెలంగాణ గర్వించదగ్గ తనయుడు శ్రీధర్‌రావు దేశ్‌పాండే. ఈ పుస్తకం రాసినందుకు రచయితకు హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాం.

(20.02.2025)

* * * * *

# తెలంగాణ జీవధార కాళేశ్వరంపై కుట్రలను తిప్పికొట్టిన పుస్తకం



**– డా॥ ఎర్రోజు శ్రీనివాస్**
అధ్యక్షులు, తెలంగాణ వికాస సమితి

తెలంగాణ జీవధార కాళేశ్వరం. ఉమ్మడి రాష్ట్రంలో నీళ్ల గోసతో అల్లాడిన తెలంగాణకు ప్రత్యేక రాష్ట్రంలో తమ సాగు, తాగు నీటి కష్టాలు తీరుతాయని ఉద్యమించారు. ప్రజల కష్టాలు తీర్చి, సాగు, తాగు నీటిని అందించాలని ఆకాంక్ష, అకుంఠిత దీక్షతో పని చేసిన బృందంలో కీలకంగా వ్యవహరించిన దేశ్‌పాండే కాళేశ్వరం ప్రాజెక్టుపై పుస్తకం తీసుకురావడం నేటి సామాజిక అవసరం. నీళ్లలో పుట్టిన నిప్పుగా సాగిన తెలంగాణ ఉద్యమంలో పని చేసిన ఉద్యమకారుడుగా తెలంగాణ ఇంజనీర్‌గా సుపరిచితమైన వారు దేశ్‌పాండే. తెలంగాణ పునర్నిర్మాణంలో ప్రజల సాగు, తాగునీటి కష్టాలు తీర్చే బృహత్ కార్యక్రమంలో పాలుపంచుకున్నారు. వారి కృషిని అభినందిస్తున్నాం.

కాళేశ్వరం ప్రాజెక్టుపై సాగిన దుష్ప్రచారం గోబెల్స్ ప్రచారం వంటిది. అధికార మార్పిడే లక్ష్యంగా లక్ష్యంగా సాగిన తప్పుడు ప్రచారాల పరంపరలో తెలంగాణ జీవధార అయినా తాగునీటి, సాగునీటి ప్రాజెక్టును వాడుకోక పోవడం రాష్ట్ర ప్రజల దురదృష్టం. దురదృష్టం అని ఎందుకు అంటున్నామంటే, గత వేసవిలో ప్రజలు ఎదుర్కొన్న నీటి ఎద్దడి, తాగునీటి సమస్య ప్రజలను మళ్లీ పదేళ్ల కిందటి బాధలకు నెట్టి వేసింది. ఈ వేసవిలో కూడా అదే పరిస్థితి పునరావృతం అయ్యింది. ఉద్యమ సమయంలో ఆంధ్రులు ఇతరులు మన ప్రాజెక్టులను అడ్డుకోవడానికి తయారు చేసిన తప్పుడు తడక విశ్లేషణలు అన్నింటినీ ఉద్యమకారులు తిప్పికొట్టారు.

ప్రత్యేక రాష్ట్రం ఏర్పడిన తర్వాత కాళేశ్వరం ప్రాజెక్టు ప్రారంభించగానే ఆంధ్ర ప్రేరేపిత మీడియా, మేధావులు, రాజకీయ నాయకులు దుష్ప్రచారం మొదలుపెట్టారు. తెలంగాణ ప్రజల సర్వతో ముఖాభివృద్ధి లక్ష్యంగా పనిచేస్తున్న మేము అప్పుడు మా బాధ్యత నిర్వహించవలసి వచ్చింది. తెలంగాణ వికాస సమితి ఆధ్వర్యంలో కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం జరుగుతున్న ప్రాంతమంతా పర్యటించాం. ప్రజలతో మాట్లాడినం. ప్రాజెక్టు నిర్మాణంలో పాల్గొంటున్న అధికారులతో చర్చించాం. మునిగిపోయే భూమి, నిల్వచేసే నీటి సామర్థ్యం, గోదావరి నదిని ఏడాది పాటు సజీవంగా ఉంచే ప్రణాళికను అధ్యయనం చేసిన తర్వాత వాస్తవాలను ప్రజల ముందు పెట్టడం జరిగింది. అప్పుడు పర్యావరణ, జనహిత ప్రాజెక్టుగా కాళేశ్వరం ఉన్నదని నిజ నిజాలను ప్రజల ముందుకు తీసుకొచ్చాం.

మల్లన్న సాగర్ బాధిత గ్రామాలలో పర్యటించి వారికి తగిన న్యాయం చేయాలని నష్టపరిహారం ఇవ్వాలని ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశాం. వారి సమస్యలను పరిష్కరించడానికి మా మా శక్తి మేరకు పని చేయడం జరిగింది. ఇదంతా తెలంగాణ ప్రజల వికాసం కోసమే తెలంగాణ వికాస సమితి చేసిన కృషి.

అయితే ఇక్కడ మనం ఒక విషయాన్ని మననం చేసుకోవాలి. ఉమ్మడి రాష్ట్రంలో ఎత్తిపోతల తప్ప మరో మార్గం లేదని మన పంటలు ఎండబెట్టారు. తాగునీటికీ గోస పెట్టారు. మళ్లీ కాళేశ్వరం ప్రాజెక్టు ప్రతిపాదన

దశలోనే మన ప్రాజెక్టులపై విషం చిమ్మడం మొదలైంది. ప్రాజెక్టును అడ్డుకోవడానికి అబద్ధపు రాతలు తప్పుడు ప్రచారాలు చలామణి చేశారు. అంతర్రాష్ట్ర జగడాలు దాటి, ప్రాజెక్టును పూర్తి చేసుకొని ముందుకు సాగుతుంటే మళ్లీ కక్ష పూరిత దాడి మొదలుపెట్టారు. మన బీడు భూముల్లో కన్నీళ్లకు బదులు గోదారి నీళ్లు పారుతుంటే ఓర్వలేకపోయారు. ప్రాజెక్టు పూర్తయ్యాక తెలంగాణ వ్యతిరేకుల ప్రచారం కుట్ర స్థాయికి చేరింది. ఆ ప్రాజెక్టు అసలు పనికిరాదని విష ప్రచారం, ప్రాజెక్టు నడపడమే సాధ్యం కాదని కుట్రపూరిత విశ్లేషణతో ప్రజలను తప్పుదోవ పట్టించారు. ఈ ప్రచారం ఏ స్థాయికి వెళ్ళింది అంటే సాధారణ ప్రజల నుంచి చదువుకున్న వాళ్ళు కూడా నిజమేమో అనుకునే స్థాయిలో గ్యాస్ లైటింగ్ చేశారు. ఆంధ్రాలో మాత్రం ఎత్తిపోతల ద్వారా గోదావరి కృష్ణా నదులను అనుసంధానం చేసుకున్నారు. సుదూరంగా ఉన్న పెన్నా బేసిన్‌కు పెద్ద ఎత్తున కృష్ణా, గోదావరి జలాలను తరలిస్తున్నారు.

రాజకీయాలు ఎలా ఉన్నా ప్రజల ప్రయోజనాలను పణంగా పెట్టకూడదనేది మా అభిమతం. గత వేసవిలో, ఇప్పుడు వేసవిలో ప్రజలు నీటి కష్టాలు ఎదుర్కొనే పరిస్థితి రావడం బాధాకరం. అందుకోసమే ప్రజలకు ఈ పుస్తకం ద్వారా వాస్తవాలు తెలియజేసే ప్రయత్నం చేస్తున్నాం. నిజాలు తెలిసిన తర్వాత ప్రజలు తమ నీటి హక్కులను వాళ్లే కాపాడుకుంటారు. మన ప్రాంత నీటి అవసరాలు, హక్కులను తెలంగాణ పౌరులందరికీ అవగాహన కల్పించే ఉద్దేశంతో ఈ పుస్తకాన్ని తీసుకొస్తున్నాం. కాళేశ్వరం ప్రాజెక్టుపై తొలినాళ్ల నుంచి ఇప్పటి వరకు వచ్చిన ప్రశ్నలకు, విమర్శలకు, వక్రీకరణలకు వివరణలను ఈ పుస్తకంలో సమగ్రంగా మీ ముందు ఉంచుతున్నాం. జటిలమైన సాంకేతికాంశాలను అందరికీ అల్కగా అర్థమయ్యేలా రాసిన దేశ్‌పాండేకు మరోసారి అభినందనలు.

(22.02.2025)

* * * * *

# నా మాట...

కాళేశ్వరం ప్రాజెక్టుపై రూపకల్పన దశ నుండే మన మేధావులు అనేక విమర్శలు చేస్తూ పోయారు. నిర్మాణ సమయంలో చేశారు. ఇప్పుడూ చేస్తున్నారు. నిర్మాణ కాలంలో తెలంగాణ జెఏసి "కాళేశ్వరం లిఫ్ట్ ఇరిగేషన్ ప్రాజెక్టు – తెలంగాణ రాష్ట్రానికి ప్రయోజనమా?" శీర్షికతో ఒక పుస్తకాన్ని వెలువరించారు. ఆ పుస్తకంలో లేవనెత్తిన అన్ని అంశాలకు వివరణలు ఇస్తూ తెలంగాణ విశ్రాంత ఇంజనీర్ల సంఘం తరపున "తెలంగాణ జీవధార – కాళేశ్వరం ప్రాజెక్టు" శీర్షికతో పుస్తకాన్ని వెలువరించాము. "కాళేశ్వరం ప్రాజెక్టు – కళ్ళు తిరిగే వాస్తవాలు " అనే శీర్షికతో మరొక పత్రాన్ని కూడా రచయిత ఎవరో పేర్కొనకుండా సోషల్ మీడియా ద్వారా ప్రచారంలో పెట్టారు. అందులో ప్రస్తావించిన అంశాలన్నిటికీ ఆనాడే వివరణలు ఇచ్చి ఉన్నాను. "కాళేశ్వరం ప్రాజెక్టు – తెలంగాణ ప్రగతి రథం" శీర్షికతో పుస్తకాన్ని కూడా ప్రచురించాను. తెలంగాణ జెఏసి ఛైర్మన్‌గా ఉద్యమాన్ని నడిపించడంలో కీలక పాత్ర పోషించిన ప్రొ. కోదండరాం గారు, విద్యుత్ సంస్థలో ఇంజనీర్‌గా, ఉద్యమ కాలంలో విద్యుత్ ఉద్యోగుల జెఏసి నాయకుడిగా ఉన్న కె రఘు గారు, అంతర్జాతీయ నీటి నిపుణుడుగా తనని తాను ప్రకటించుకున్న గుజ్జా బిక్షం గారు, రైతు స్వరాజ్య వేదిక నాయకుడు కన్నెగంటి రవి గారు, వ్యవసాయ ఆర్థికవేత్త, ఇప్పుడు వ్యవసాయ విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ అల్దాస్ జానయ్య గారు, కేంద్ర జల్ శక్తి మంత్రి సలహాదారులు వెదిరే శ్రీరాం గారు, ఇంజనీరు, ఇప్పుడు తెలంగాణ రాష్ట్ర విద్యా కమిషన్ ఛైర్మన్ ఆకునూరి మురళి గారు, నైనాల గోవర్ధన్ గారు, ఆంధ్రా పత్రికల్లో పని చేసే తెలంగాణ జర్నలిస్టులు.. ఇట్లా అనేక మంది కాళేశ్వరం ప్రాజెక్టుపై నిరంతరం దాడి చేస్తూనే ఉన్నారు. మేడిగడ్డ బ్యారేజి కుంగుబాటు తర్వాత, తెలంగాణలో అధికార మార్పిడి తర్వాత మరింత ఉధృతంగా ఈ విమర్శల దాడి కొనసాగింది. జాతీయ, అంతర్జాతీయ వేదికల మీద ప్రాజెక్టుపై విషం చిమ్ముతూనే ఉన్నారు.

ఇటీవల సీనియర్ జర్నలిస్టు రేమిల్ల అవధాని గారు 'The Kaleshwaram Fiasco - A Tale of Greed and Negligence' శీర్షికతో ఇంగ్లీష్ లో ఒక పుస్తకాన్ని వెలువరించినారు. అంతా రాసి 'నేను ఒక జర్నలిస్టును, ఇంజనీర్‌ను కాను, ఇరిగేషన్ ఎక్స్పర్ట్ ను కాను, ఇంజనీరింగ్ పరిభాషను అర్థం చేసుకోవడం నాకు ఇబ్బందిగా ఉండింది. ఇందులో పొరపాట్లు ఏవైనా ఉన్నట్టైతే అందుకు నా అవగాహనా లేమి కారణం. నేను ఒక సాధారణ వ్యక్తిగా విషయాలను వివరించే ప్రయత్నం చేశాను' అని ఒక డిస్క్లెమర్ (Disclaimer) ద్వారా తనను తాను విమర్శల నుంచి తప్పించుకునే ప్రయత్నం చేశాడు. అబద్దాలు, తప్పుడు వివరణలు, తప్పుడు అన్వయాలు, పైన పేర్కొన్న వారి అభిప్రాయాలతో ప్రభావితం అయి, అవే నిజమని నమ్మి, తన ఆంధ్రా హృదయంతో పుస్తకం శీర్షిక సహా లోపల ఛాప్టర్లకు కూడా వ్యంగాత్మక శీర్షికలు పెట్టి పుస్తకాన్ని వండి వార్చారు. తన వైపు నుంచి ఏ విశ్లేషణ లేకుండా బోలెడంత సమాచారాన్ని గుప్పించి జనం మీదకు వదిలాడు. ఆయనే డిస్క్లెమర్ ప్రచురించాడు కాబట్టి ఆ పుస్తకాన్ని పాఠకులు సీరియస్ గా పట్టించుకునే అవసరం లేదని నా భావన. ఇందులో ఏదైనా నిజం ఉన్నదంటె ఈ డిస్‌క్లెయిమర్ మాత్రమే.

**కాళేశ్వరం ప్రాజెక్టు విమర్శకుల వ్యక్తం చేసిన ప్రధాన అభ్యంతరాలు ఏమంటే ..**

1) గ్రావిటీ ప్రాజెక్టు అయిన ప్రాణహిత – చేవెళ్ళ సుజల స్రవంతిని వదిలేసి మేడిగడ్డ నుంచి భారీ ఖర్చుతో ఎత్తిపోతల పథకాన్ని కమీషన్ల కోసం చేపట్టారు.

2) నదులు లేని చోట, అవసరం లేకపోయినా భారీ జలాశయాలను నిర్మించి వేలాది కుటుంబాలను నిర్వాసితులను చేశారు.

3) డిపిఆర్ లేకుండానే, అవసరమైన భూభౌతిక పరీక్షలు జరపకుండానే, సాంకేతిక అధ్యయనాలు జరపకుండానే బ్యారేజీల నిర్మాణం చేశారు. అందుకే అవి కూలిపోయాయి.

4) మళ్లింపు నిర్మాణాలుగా (Diversion Structures) ఉండవలసిన బ్యారేజీలను నీటి నిల్వ నిర్మాణాలుగా (Storage Structures) మార్చివేసినారు. అందుకే నీటి బరువును తట్టుకోలేక కుంగిపోయినాయి.

5) ఇంజనీరింగ్ పరిజ్ఞానం లేని వాళ్ళు అడుగుతున్న మరొక ప్రశ్న.. బ్యారేజీలను ఇసుక పునాదుల మీద నిర్మిస్తారా ?

వీటికి గతంలోనే అనేకసార్లు వ్యాసాల ద్వారా పూర్వపక్షం చేసి ఉన్నాను. అయినా అవే విమర్శలు పదేపదే చెప్పి అవి నిజాలని ప్రజలను నమ్మించే ప్రయత్నం చేశారు. చేస్తున్నారు. ప్రకృతి ప్రకోపం వలన పంప్ హౌజ్‌ల మునక, నాలుగు భారీ వరుస వరదల కారణంగా మేడిగడ్డ బ్యారేజీలో మూడు పిల్లర్ల కుంగుబాటు వారి విమర్శలకు బలం చేకూర్చినాయి. అందువలన చాలా మంది బుద్ధిజీవులు.. అవధాని లాగా.. వారి విమర్శల వెల్లువలో కొట్టుకుపోయారు. ప్రొ.కోదండరాం, కె.రఘు, వెదిరే శ్రీరాం గారలు జస్టిస్ పి సి ఘోష్ కమిషన్ ముందు కూడా ఇవే విమర్శలతో ఆఫిడవిట్లు సమర్పించి వాంగ్మూలం ఇచ్చారు. ఆ తర్వాత పత్రికల వారితో మాట్లాడినారు. ఆ అంశాలు మళ్ళీ ప్రజల్లో చర్చనీయాంశాలుగా మారినాయి. అందుకే మరొకసారి వారి విమర్శలను పూర్వపక్షం చేయవలసిన అవసరం ఏర్పడింది.

ప్రాజెక్టుకు అనుకూలంగా కమిషన్‌కు అఫిడవిట్ సమర్పించి, వాంగ్మూలం ఇచ్చిన ఉద్యమ మేధావుల్లో తెలంగాణ జలవనరుల అభివృద్ధి సంస్థ మాజీ ఛైర్మన్, తొలినాళ్ళలో అంటే 1990 వ దశకంలోనే సాగునీటి రంగంలో తెలంగాణకు జరిగిన వివక్షను, నదీ జలాల స్థితిగతులను అధ్యయనం చేసి విస్తృతంగా వ్యాసాలు రాసి, పుస్తకాలు ప్రచురించి నాలాంటి ఇంజనీర్లను, బుద్ధి జీవులను జాగృతం చేసిన వ్యక్తి శ్రీ వీరమళ్ళ ప్రకాష్ గారు ఒకరు. ఆయన టివి చానళ్లలో కూడా కాళేశ్వరంపై వ్యక్తం అవుతున్న విమర్శలకు మూతోడ్ సమాధానాలు ఇచ్చినారు. ప్రాజెక్టుకు అనుకూలంగా కమీషన్‌కు నివేదికలు సమర్పించిన తెలంగాణ ఉద్యమ మేధావుల్లో ప్రొ సీతారామారావు, ప్రొ. రాఘవరెడ్డి, తెలంగాణ వికాస సమితి అధ్యక్షులు శ్రీనివాస్ గారలు కూడా ఉన్నారు. అయితే వారికి కమిషన్ ముందు వాంగ్మూలం ఇవ్వడానికి పిలుపు రాలేదు.

తెలంగాణ జాగృతి వారు జనవరి 31 న ఏర్పాటు చేసిన 'నీళ్ళు – నిజాలు' రౌండ్ టేబుల్ సమావేశంలో పై అంశాలపై క్లుప్తంగా ప్రసంగించాను. సభలో పాల్గొన్న మిత్రులు చాలా మంది ప్రసంగాన్ని పుస్తక రూపంలో అందించమని కోరినారు. వారి కోరిక మేరకు కూడా ఈ పుస్తక రచనకు పూనుకున్నాను. ఈ పుస్తకాన్ని చదివి తమ అమూల్యమైన అభిప్రాయాలను పంచుకున్న మిత్రులు, సీనియర్ చీఫ్ ఇంజనీర్ (రి) శ్రీ

కొండపల్లి వేణుగోపాలరావు గారికి, ఇంజనీర్ ఇన్ చీఫ్ (రిటైర్డ్) శ్రీ విజయ్ ప్రకాశ్ గారికి ఇతర మిత్రులకు ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

పుస్తకాన్ని చదివి ఆత్మీయమైన ముందుమాటను రాసి ఇచ్చిన తెలంగాణ జలవనరుల అభివృద్ధి సంస్థ మాజీ చైర్మన్, నా ఉద్యమ సహచరులు శ్రీ వి. ప్రకాశ్ గార్కి ప్రత్యేక ధన్యవాదాలు.

పుస్తకాన్ని తెలంగాణ వికాస సమితి' తరపున ప్రచురిస్తామని, పుస్తకాన్ని రాయమని ప్రోత్సహించిన ప్రస్తుత అధ్యక్షులు ఎ. శ్రీనివాస్, సంస్థ గౌరవాధ్యక్షులు, ఎమ్మెల్సీ దేశపతి శ్రీనివాస్ గార్లకు ధన్యవాదాలు తెలియజేస్తున్నాను.

పుస్తకాన్ని రాస్తున్నానని తెలిసి అనేక మంది ఇంజనీర్లు, జర్నలిస్టులు, మిత్రులు అభినందించారు. శుభాకాంక్షలు తెలియజేసారు. వారందరికి పేరుపేరున ధన్యవాదాలు.

ఈ పుస్తకంపై నిర్మాణాత్మక చర్చను ఆహ్వానిస్తున్నాను.

**- శ్రీధరరావు దేశ్‌పాండే**

(27.02.2025)

* * * * *

కాళేశ్వరం ప్రాజక్టు నిర్మాణంలో
కుటుంబాలను, వ్యక్తిగత జీవితాలను వదిలి
అకుంఠిత దీక్షతో రేయింబవళ్లు పనిచేసిన

- ఇంజనీర్లు,
- వివిధ శాఖల అధికారులు
- టెక్నీషియన్లు
- స్కిల్డ్ వర్కర్స్
- అస్సాం, వెస్ట్ బెంగాల్, బీహార్, ఝార్ఖండ్,
- చత్తీస్‌ఘర్, ఒడిషా, ఉత్తర్‌ప్రదేశ్ తదితర రాష్ట్రాల నుంచి తరలివచ్చిన వేలాది మంది కార్మికులకు
- ప్రాజెక్టు కోసం భూములను, గ్రామాలను త్యాగం చేసిన ప్రజలకు

గౌరవపూరితంగా శిరస్సు వంచి నమస్కరిస్తూ ఈ పుస్తకాన్ని అంకితం చేస్తున్నాను.

- రచయిత

# ఇందులో ...

# 1

# తెలంగాణకు గోదావరి జలాలే ఎందుకు కావాలి ? తెలంగాణ రాష్ట్రం ఏర్పడక ముందు గోదావరి జలాల సద్వినియోగానికి జరిగిన కృషి ఏమైనా ఉందా ?

కాళేశ్వరం ప్రాజెక్టుపై వెల్లువెత్తిన విమర్శలను పూర్వపక్షం చేసే ముందు ఉమ్మడి రాష్ట్రంలో గోదావరి జలాల వినియోగానికి సంబందించి కొన్ని ప్రాథమిక విషయాలను తెలుసుకుందాము.

**గోదావరి ప్రవాహాలు :** గోదావరి నది భారత దేశంలో రెండవ అతి పెద్ద నది. ఈ నదిని దక్షిణ గంగ అని ప్రజలు పిలుచుకుంటారు. మహారాష్ట్రాలోని నాసిక్ – త్రియంబకేశ్వర్ పశ్చిమ కనుమల్లో పుట్టి బాసరకు ఎగువన నిజామాబాద్ జిల్లాలో కందకుర్తి వద్ద తెలంగాణలో అడుగుపెట్టి భద్రాద్రి కొత్తగూడెం జిల్లాలో దుమ్ముగూడెం ఆనకట్ట దాటిన తర్వాత ఆంధ్రలో ప్రవేశించి పోలవరం డ్యాంను, ధవళేశ్వరం వద్ద నిర్మించిన ఆర్థర్ కాటన్ బ్యారేజిని దాటుకొని బంగాళాఖాతంలో కలిసిపోతుంది. 1465 కిలోమీటర్ల ఈ ప్రయాణంలో గోదావరి నది పూర్ణా, ప్రవర, పెన్‌గంగ, మంజీరా, వార్ధా, వెయిన్ గంగ, ప్రాణహిత, ఇంద్రావతి, శబరీ, కిన్నెరసాని, మానేరు, కడెం, పెద్దవాగు, స్వర్ణ, సుద్దవాగు లాంటి అనేక చిన్నా పెద్ద నదులను, వాగులను తనలో కలుపుకుంటూ తెలంగాణలో సుమారు 500 కిలోమీటర్లు ప్రవహిస్తుంది. గోదావరి నదీ బేసిన్ 7 రాష్ట్రాల్లో పరివాహక ప్రాంతం కలిగి ఉన్నది. మహారాష్ట్రాలో 48.60%, తెలంగాణలో 19.18%, ఛత్తీస్ ఘర్‌లో 12.30 %, మధ్యప్రదేశ్‌లో 8.60%, ఒడిశాలో 5.70%, ఆంధ్ర ప్రదేశ్‌లో 4.22%, కర్ణాటకలో 1.40 % పరివాహక ప్రాంతాలు ఉన్నాయి. ఇక ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో గోదావరి పరీవాహక ప్రాంతాన్ని గనుక చూస్తే .. విభజనకు పూర్వం గోదావరి పరీవాహక ప్రాంతం తెలంగాణలో 79 శాతం, ఆంధ్రాలో 21 శాతం పరీవాహక ప్రాంతం కలిగి ఉండేది. విభజన తర్వాత ఖమ్మం జిల్లాలో 7 మండలాలను ఏకపక్షంగా ఆంధ్రాకు బదిలీ చేసిన కారణంగా గోదావరి పరీవాహక ప్రాంతం తెలంగాణలో 76 శాతం, ఆంధ్రాలో 24 శాతంగా మార్పు జరిగింది. కేంద్ర జల సంఘం 3,12,812 చదరపు కిలోమీటర్ల పరివాహక ప్రాంతం కలిగిన గోదావరి నది బేసిన్‌ని మొత్తం 12 సబ్ బెసిన్లుగా విభజించారు. ఎగువ గోదావరి (జి–1), ప్రవర (జి–2), పూర్ణా (జి–3), మంజీరా (జి–4), మధ్య గోదావరి (జి–5), మానేరు (జి–6), పెన్‌గంగ (జి–7), వార్ధా (జి–8), ప్రాణహిత (జి–9), దిగువ గోదావరి (జి–10), ఇంద్రావతి (జి–11), శబరి (జి–12). వంద శాతం మహారాష్ట్రాలో ఉన్న ఎగువ గోదావరి, ప్రవర, పూర్ణా సబ్ బేసిన్ల నుంచి కర్నాటక, మహారాష్ట్రాలో ఎక్కువ పరీవాహక ప్రాంతం ఉన్న మంజీరా సబ్ బెసిన్ నుండి నీరు గోదావరిలోకి రావడం లేదు. ఆ రెండు రాష్ట్రాలు పైననే అనేక మేజర్, మీడియం ప్రాజెక్టులు, బ్యారేజిలు, ఆనకట్టలు, చెక్ డ్యాంలు కట్టుకున్నందు వలన గడచిన 30 ఏండ్లుగా శ్రీరాంసాగర్, నిజాంసాగర్, సింగూరు ప్రాజెక్టుల్లోకి నీటి ప్రవాహాలు గణనీయంగా తగ్గిపోయినాయి. వంద శాతం తెలంగాణలో ఉన్న మధ్య గోదావరి సబ్ బేసిన్‌లో ఉన్న కడెం, స్వర్ణ నదులు శ్రీరాంసాగర్ ప్రాజెక్టుకు దిగువన గోదావరిలో కలుస్తాయి. వీటి ద్వారా వచ్చే నీరు ఎల్లంపల్లి బ్యారేజిలోకి చేరుతాయి. మానేరు సబ్ బేసిన్లో నీటి ప్రవాహాలు చాలా తక్కువనే చెప్పాలి. భారీ వర్షపాతాలు నమోదు అయిన సంవత్సరాలలో మాత్రమే మానేరు నుంచి గోదావరిలోకి నీరు వస్తుంది.

ఇకపోతే ప్రతీ సంవత్సరం 1500 – 3000 టిఎంసిల గోదావరి నీరు వృధాగా, నిరుపయోగంగా సముద్రంలో కలిసిపోతున్నాయని అంటున్న ఈ నీరంతా కూడా గోదావరిలో ప్రాణహిత, ఇంద్రావతి, శబరీ నదులు కలిసిన తర్వాతనే అన్న విషయం గమనార్హం. అంటే గోదావరిలో భారీ ప్రవాహాలు అన్నీ కూడా పెన్గంగ, ప్రాణహిత, ఇంద్రావతి, శబరీ సబ్ బేసిన్ల నుంచి దిగువ గోదావరి సబ్ బేసిన్ లోకి వస్తున్న నీరే. గోదావరిలో నీరు లభ్యం అయ్యేది ప్రాణహిత గోదావరి సంగమ ప్రాంతమైన కాళేశ్వరం తర్వాతనే. దిగువ గోదావరి సబ్ బేసిన్లో కాళేశ్వరం వద్ద ప్రాణహిత కలిసిన తర్వాత కేంద్ర జల సంఘం (CWC) వారు నమోదు చేసిన 40 ఏండ్ల ప్రవాహాలను గమనిస్తే ప్రతీ ఏటా సగటున 1651 టిఎంసిల ప్రవాహాలు ఉంటాయని తెలుతున్నది. నెల వారీగా చూస్తే.. జూన్‌లో 50.90 టిఎంసిలు, జూలైలో 299.90 టిఎంసిలు, ఆగస్టులో 607.10 టిఎంసిలు, సెప్టెంబర్‌లో 423.80 టిఎంసిలు, అక్టోబర్‌లో 176.20 టిఎంసిలు, నవంబర్‌లో 38.70 టిఎంసిలు, డిసెంబర్‌లో 17.00 టిఎంసిలు, జనవరిలో 11.90 టిఎంసిలు, ఫిబ్రవరిలో 10.90 టిఎంసిలు, మార్చ్‌లో 7.40 టిఎంసిలు, ఏప్రిల్ లో 4.20 టిఎంసిలు, మేలో 3.10 టిఎంసిలు ఉంటాయని తెలుతున్నది. ఈ ప్రవాహాలను గమనిస్తే దిగువ గోదావరిలో పుష్కలంగా నీటి లభ్యత ఉన్నదని తెలుతున్నది. అయితే ఈ ప్రవాహాలను ఉమ్మడి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం నిరుపయోగంగా సముద్రంలోకి వదిలేసింది. ఈ నీరు తెలంగాణా, ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రాలు తమ అవసరాలకు వినియోగించుకునే అవకాశం ఉండింది. ఉమ్మడి రాష్ట్రంలో 750 కిలోమీటర్ల నదీ ప్రయాణంలో తల వద్ద శ్రీరాంసాగర్ డ్యాం, తోక వద్ద కాటన్ బ్యారేజి తప్ప మరొక అడ్డుకట్ట నిర్మించలేదు ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వాలు.

ఇంత విస్తారంగా నీటి లభ్యత ఉన్నా వీటిని వినియోగించుకోవడానికి ప్రభుత్వాలు ఎందుకు ప్రయత్నించలేదు అన్న ప్రశ్న సహజంగానే కలుగుతుంది. ఈ అంశం పై పరిశోధన చేసినప్పుడు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఏర్పాటుకు ముందే ఆనాటి హైదరబాద్ రాష్ట్రం గోదావరి జలాల సమగ్ర వినియోగానికి "గోదావరి వ్యాలీ అభివృద్ధి పథకాన్ని", ప్రాణహిత జలాల వినియోగానికి బహుళ ప్రయోజనాల "ప్రాణహిత ప్రాజెక్టు" ను రూప కల్పన చేసిందని తెలిసింది.

**గోదావరి వ్యాలీ అభివృద్ధి పథకం (Godavari Valley Development Plan) :**

దేశ స్వాతంత్ర్యానికి పూర్వమే హైదరాబాద్ రాజ్యం ఒక సమగ్రమైన గోదావరి వ్యాలీ అభివృద్ధి పథకాన్ని(Godavari Valley Development Plan) తయారు చేసింది. అమెరికాలోని టెన్నెసి వ్యాలీ అథారిటీ వారి అభివృద్ధి నమూనా ఈ అభివృద్ధి ప్లాన్‌కు స్ఫూర్తిగా నిలచింది. ఈ పథకంలో డ్యాంలు, జలాశయాలు, కాలువల వ్యవస్థ, జల విద్యుత్ మరియు థర్మల్ విద్యుత్ ఉత్పత్తి కేంద్రాలు నిర్మించాలని సంకల్పించారు. ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్ జిల్లాల్లో లక్షలాది ఎకరాలకు సాగునీరు, పరిశ్రమల స్థాపనకు నీరు అందించాలని భావించారు. 1951 లో హైదరాబాద్ రాష్ట్ర ప్రభుత్వం ప్రచురించిన" Projects For Prosperity : The Story of Hyderabads Bid For Self-sufficiency through Irrigation and Power Projects" అన్న పుస్తకంలో రచయిత శ్రీ సాదత్ అలీ ఖాన్ గోదావరి వ్యాలీ అభివృద్ధి ప్లాన్ ప్రతిపాదనల్ని సమగ్రంగా చర్చించారు. ఈ ప్లాన్ ను రూపొందించడంలో ఆనాటి ప్రజా పనుల శాఖా మంత్రి నవాబ్ జైన్ యార్ జంగ్ బహాదూర్, సెక్రెటరి నవాబ్ అలీ నవాజ్ జంగ్ బహాదూర్ కీలక పాత్ర పోషించారు. 1956 లో తెలంగాణా, ఆంధ్ర ప్రాంతాల విలీనం అనంతరం తెలంగాణా సాగునీటి రంగం సంక్షోభంలోకి నెట్టబడింది. కొత్తగా ఏర్పడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రాధాన్యతలు మారిపోయినాయి. ఆ క్రమంలో హైదరాబాద్ రాష్ట్రం రూపొందించిన గోదావరి వ్యాలీ అభివృద్ధి ప్లాన్ బుట్ట దాఖలు అయ్యింది. ఇప్పుడు 70 ఏండ్ల తర్వాత కాళేశ్వరం ప్రాజెక్టు మరో రూపంలో " సమీకృత గోదావరి వ్యాలీ అభివృద్ధి పథకం (Integrated Godavari

Valley Development Plan)" గా మన ముందుకు వచ్చింది. వ్యవసాయం, తాగునీరు, పరిశ్రమలు, మత్స్య పరిశ్రమ, టూరిజం, పట్టాణాభివృద్ధి, పర్యావరణం, దేశీయ జల రవాణా తదితర రంగాలను ప్రభావితం చేసి తెలంగాణా సమగ్ర వికాసానికి దోహదం చేసే ఒక ప్రగతి రథంగా (Growth Engine) మారబోతున్నది. కాళేశ్వరం ప్రాజెక్టు తెలంగాణా ప్రజల సాగునీటి ఆకాంక్షలను నెరవేర్చేందుకు సిద్ధం అయ్యింది. ఇదంతా తెలంగాణా ఒక రాష్ట్రంగా ఏర్పడినందు వల్లనే సాధ్యం అయిందనేది నిర్వివాదాంశం.

**ప్రాణహిత ప్రాజెక్టు :**

హైదరాబాద్ రాష్ట్రం రూపకల్పన చేసిన ఈ ప్రాజెక్టు వివరాలను కృష్ణా, గోదావరి కమీషన్ (KG Commission) 1962 లో రూపొందించిన నివేదికలో పొందుపరిచింది. ప్రాణహిత నదిపై తాబి మరియు వార్రా గ్రామాల వద్ద 4,300 అడుగుల పొడవు, 140 అడుగుల ఎత్తు, 475 అడుగుల ఎఫ్.ఆర్.ఎల్. కలిగిన డ్యాంని నిర్మించి 143 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాన్ని ఏర్పాటు చేయడం, కుడి వైపున 3,450 క్యూసెక్కుల ప్రవాహ సామర్థ్యంతో 87 మైళ్ళ కాలువను తవ్వి ఆదిలాబాద్ జిల్లాలో ఖరీఫ్‌లో 1,50,000 ఎకరాల ఆయకట్టు, రబీలో 1,00,000 ఎకరాల ఆయకట్టుకు, ప్రతీ ఏటా రెండు పంటలకు సాగునీరు అందించడం, 300 మెగావాట్ల స్థాపిత సామర్థ్యం కలిగిన జల విద్యుత్ కేంద్రాన్ని నిర్మించడం, ఆయకట్టు పరిధిలో ఉన్న 85 చెరువులను నింపి వాటి కింద సాగులో ఉన్న 2,726 ఎకరాలను స్థిరీకరించడం.. తదితర లక్ష్యాలతో ప్రాణహిత ప్రాజెక్టు రూపకల్పన జరిగినట్టుగా కె.జి. కమీషన్ నివేదిక ద్వారా స్పష్టం అవుతున్నది. ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు తర్వాత ఉమ్మడి ప్రభుత్వం బుట్టదాఖలు చేసిన ప్రాజెక్టుల్లో ప్రాణహిత ప్రాజెక్టు కూడా చేరిపోయింది. 1975 లో ప్రాణహితపై మహారాష్ట్రతో అంతర్రాష్ట్ర ప్రాజెక్టు నిర్మాణానికి ఒక ఒప్పందంపై సంతకాలు జరిగినప్పటికి ఆ తర్వాత కాలంలో ఈ ప్రాజెక్టు వలన తమకు పెద్దగా ప్రయోజనాలు లేవన్న సాకుతో మహారాష్ట్ర తప్పుకున్నది. ఆ తర్వాత ప్రాణహిత ప్రాజెక్టుపై ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు మహారాష్ట్రతో ఏ చర్చలు జరిపిన దాఖలాలు లేవు. ఆనాటి నుంచి తెలంగాణ ఉద్యమ సమయంలో తెలంగాణ రిటైర్డ్ ఇంజనీర్లు ప్రాణహిత – చేవెళ్ళ ప్రాజెక్టు రూపకల్పన చేసే దాకా ప్రాణహిత జలాల వినియోగానికి ఉమ్మడి ప్రభుత్వాలు ఆలోచన చేయనేలేదు. 1969 లో తెలంగాణ ఉద్యమ ఒత్తిడికి శ్రీరాంసాగర్ ప్రాజెక్టు వస్తే, వర్తమాన ఉద్యమ ఒత్తిడికి దేవాదుల, ప్రాణహిత చేవెళ్ళ, కాంతనపల్లి ప్రాజెక్టులను, ఆదిలాబాద్ జిల్లాలో కొమురం భీం, నీల్వాయి, గొల్లవాగు, మత్తడివాగు, సుద్దవాగు, ర్యాలివాగు, జగన్నాథపూర్ లాంటి కొన్ని మీడియం ప్రాజెక్టులను కూడా ఉమ్మడి ప్రభుత్వాలు ప్రతిపాదించినాయి. అవి కూడా రాష్ట్రం ఏర్పడక ముందు పదేళ్ళ కాలంలో అనేక సమస్యల్లో కూరుకుపోయి పెండింగ్ ప్రాజెక్టులుగానే మిగిలిపోయాయి.

**గోదావరి ట్రిబ్యునల్ అవార్డు :**

1956 లో రాష్ట్రాల పునర్విభజన జరిగిన తర్వాత హైదరాబాద్ రాష్ట్రంలో భాగంగా ఉన్న మరాఠీ మాట్లాడే మరాఠ్వాడ జిల్లాలు మహారాష్ట్రాకు, కన్నడ మాట్లాడే జిల్లాలు కర్ణాటక రాష్ట్రానికి బదిలీ అయినాయి. సెంట్రల్ ప్రావిన్స్ లో భాగంగా ఉన్న విదర్భను మహారాష్ట్రాలో కలపడం జరిగింది. ఈ విభజనల కారణంగా గోదావరి, కృష్ణా పరీవాహక ప్రాంతంలో చాలా మార్పులు సంభవించినాయి. గోదావరి, కృష్ణ జలాల వినియోగానికి సంబందించి కొత్త రాష్ట్రాల మధ్య అంతర్రాష్ట్ర సమస్యలు ఉత్పన్నం అయినాయి. వీటి పరిష్కారం కోసం రాష్ట్రాల అభ్యర్థన మేరకు ఏప్రిల్ 1969 లో కేంద్ర ప్రభుత్వం అంతర్రాష్ట్ర నదీ జలాల వివాదాల పరిష్కార చట్టం, 1956, సెక్షన్ 3 కింద సుప్రీం కోర్టు విశ్రాంత న్యాయమూర్తి ఆర్ ఎస్ బచావత్ అధ్యక్షతన గోదావరి ట్రిబ్యునల్ (GWDT) ని, కృష్ణా ట్రిబ్యునల్ (KWDT) ఏర్పాటు చేసింది. గోదావరి

జలాలపై హక్కులు కలిగిన రాష్ట్రాలుగా (Riparian States) ఉన్న మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒడిషా రాష్ట్రాలు గోదావరి ట్రిబ్యునల్ విచారణలో పాల్గొన్నాయి. అట్లాగే మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు కృష్ణా ట్రిబ్యునల్ విచారణలో పాల్గొన్నాయి. తెలంగాణ ఒక రాష్ట్రంగా లేకపోవడం చేత ఈ విచారణలో భాగస్వామి కాలేకపోయింది.

అన్ని రాష్ట్రాలు అంగీకరించిన పిదప బచావత్ మొదట మూడు రాష్ట్రాల మధ్య కృష్ణా జలాల పునర్ పంపిణీపై విచారణను చేపట్టారు. కృష్ణా జలాల పంపిణీ విచారణను పూర్తి చేసి మే 1976 లో కృష్ణా ట్రిబ్యునల్ తుది నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించింది. 75 శాతం విశ్వసనీయత కలిగిన 2060 టిఎంసిల కృష్ణా జలాలను మహారాష్ట్రకు 560 టిఎంసిలు, కర్ణాటకకు 700 టిఎంసిలు, ఆంధ్రప్రదేశ్ కు 800 టిఎంసిలు కేటాయించింది. దీనికి అదనంగా 70 టిఎంసిల రిటర్న్ ఫ్లోస్‌ను మహారాష్ట్రకు 25 టిఎంసిలు, కర్ణాటకకు 34 టిఎంసిలు, ఆంధ్రప్రదేశ్ కు 11 టిఎంసిలు కేటాయించింది. దీనితో కృష్ణా నికర జలాల్లో ఆంధ్రప్రదేశ్ కు దక్కిన వాటా 811 టిఎంసిలు. కృష్ణా ట్రిబ్యునల్ విచారణ కొనసాగుతుండగానే 1975 - 1980 మధ్య కాలంలో మహారాష్ట్ర, కర్ణాటక, ఆంధ్రప్రదేశ్, మధ్యప్రదేశ్, ఒడిషా రాష్ట్రాలు గోదావరి జలాల వినియోగానికి సంబందించి తమలో తాము 10 ఒప్పందాలు చేసుకున్నాయి. ఈ ఒప్పందాల కారణంగా బచావత్ కూడా కృష్ణా జలాల పంపిణీ విషయంలో జరిపినటువంటి సమగ్ర విచారణ జరపకుండా రాష్ట్రాల మధ్య కుదిరిన ఒప్పందాలనే క్రోడీకరించి, వాటికి చట్టబద్ధత కల్పిస్తూ 1980 లో గోదావరి ట్రిబ్యునల్ అవార్డుగా నివేదికను కేంద్ర ప్రభుత్వానికి సమర్పించారు.

రెండు ట్రిబ్యునళ్ళకు ఛైర్మన్‌గా వ్యవహరించిన బచావత్ కృష్ణాలో చేసినట్టు ఖచ్చితమైన పరిమాణంలో గోదావరి జలాలను రాష్ట్రాల మధ్య పంపిణీ చేయలేదు. ఒక నిర్దేశిత స్థలానికి పైన ఉన్న జలాలన్నీ (All Waters) పై రాష్ట్రానికి, ఆ తర్వాత లభ్యమయ్యే జలాలన్నీ కింద రాష్ట్రానికి చెందాలన్న భావనతోనే రాష్ట్రాల మధ్య కుదిరిన ఒప్పందాల్లో రాసుకున్నారు. ఉదాహరణకు ఎగువ గోదావరి (జి-1) సబ్ బేసిన్లో పైఠాన్ డ్యాం వరకు లభ్యమయ్యే జలాలన్నీ మహారాష్ట్ర వినియోగించుకోవచ్చు. పైఠాన్ డ్యాం నుంచి శ్రీరాంసాగర్ వరకు లభ్యమయ్యే నీటిలో 60 టిఎంసిలు మహారాష్ట్ర వాడుకోగా మిగిలిన జలాలన్నీ ఆంధ్రప్రదేశ్ వినియోగించుకోవచ్చు. పెన్‌గంగ సబ్ బేసిన్లో (జి-7) లోయర్ పెన్గంగ డ్యాం వరకు లభ్యమయ్యే జలాలన్నీ మహారాష్ట్రకు చెందుతాయి. పెన్గంగ డ్యాం కింద లభ్యమయ్యే నీటిలో 9 టిఎంసిలు మహారాష్ట్ర వాడుకోగా మిగిలిన జలాలన్నీ ఆంధ్రప్రదేశ్ కు చెందుతాయి. ఈ రకమైన పరిభాషలో రాష్ట్రాల మధ్య ఒప్పందాలు కుదిరినాయి.

మరి గోదావరి జలాల్లో ఆంధ్రప్రదేశ్ వాటా 1486 టిఎంసిలని లెక్క గట్టిందెవరు ? ఈ 10 ఒప్పందాల ఆధారంగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఇంజనీర్లే గోదావరిలో 75 శాతం విశ్వసనీయత కలిగిన జలాలు 1486 టిఎంసిలని లెక్కగట్టినారు. దీనికి గోదావరి ట్రిబ్యూనల్ గాని, ఇతర రాష్ట్రాలు గాని, కేంద్ర ప్రభుత్వం గాని ఆమోదం తెలుపలేదు. అయితే 1486 టిఎంసిల గోదావరి జలాల్లో ఉమ్మడి ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం వివిధ సందర్భాలలో జి ఒ ల ద్వారా తెలంగాణ ప్రాంతంలో ఉన్న చిన్ననీటి పథకాలు, మధ్యతరహా ప్రాజెక్టులు, భారీ ప్రాజెక్టులకు 968 టిఎంసిల నీటిని కేటాయించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర విభజన బిల్లు ఫిబ్రవరి 2014 లో రాష్ట్ర అసెంబ్లీలో చర్చకు వచ్చినప్పుడు శాసన సభ్యులకు ప్రభుత్వం అధికారికంగా అందిన సమాచారంలో కృష్ణా, గోదావరి జలాల్లో ప్రాజెక్టుల వారీ కేటాయింపులు చేసిన వివరాలు ఉన్నాయి.

**గోదావరి జలాల సమగ్ర వినియోగం :**

ఉమ్మడి రాష్ట్రం తెలంగాణ ప్రాజెక్టులకు గోదావరి జలాల్లో 968 టిఎంసి కేటాయింపులు చేసినప్పటికీ ప్రాజెక్టులు పూర్తి కాకపోవడం చేత అవన్నీ కాగితాలకే పరిమితం అయినాయి. వాస్తవ వినియోగం ఏనాడూ 200 టిఎంసిలకు మించలేదు. తెలంగాణా ప్రభుత్వం ఈ అంశాలను కూలంకషంగా మథించి గోదావరి జలాల గరిష్ట వినియోగం కాళేశ్వరం ప్రాజెక్టు, సమ్మక్కసాగర్ (కాంతనపల్లికి బదులుగా), సీతమ్మసాగర్ ప్రాజెక్టుల (దుమ్ముగూడెం, ఇందిరాసాగర్ ఎత్తిపోతలను కలిపి) నిర్మాణం, పెండింగ్ ప్రాజెక్టులను పూర్తి చేయడంతోనే సాధ్యం అవుతుందని భావించి ప్రణాళికలు సిద్దం చేసింది. ఈ మూడింటిలో కాళేశ్వరం, సమ్మక్కసాగర్ పూర్తి అయినాయి. సీతమ్మసాగర్ చివరి దశలో ఉన్నది. గోదావరి బేసిన్లో ఉన్న అన్ని పెండింగ్ ప్రాజెక్టులను తెలంగాణ ప్రభుత్వం పూర్తి చేసి గోదావరి జలాల్లో తెలంగాణ వాటాను సంపూర్ణంగా వినియోగించడానికి కృషి చేసింది. ఉమ్మడి రాష్ట్రంలో గోదావరి జలాల వినియోగానికి దేవాదుల ప్రాజెక్టును 2005 చంద్రబాబు ప్రభుత్వం హడావిడిగా ప్రారంభించినప్పటికి అనేక బాలారిష్టాలతో ప్రాజెక్టు పురోగతి నత్తనడకన సాగింది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడే నాటికి 38 టిఎంసిల కేటాయింపులతో ప్రాజెక్టు రెండు ఫేజ్ లు పూర్తి చేసి కేవలం 8 టిఎంసిల లిఫ్ట్ సామర్థ్యాన్ని సాధించడం జరిగింది. భూసేకరణ జరగక కాలువలు తవ్వకపోవడంతో ఆయకట్టు సాధించలేక ప్రతిపాదిత లక్ష్యాలను అందుకోలేకపోయింది. పంప్ హౌజ్‌కు దిగువన నీటి నిల్వకు బ్యారేజి లేకపోవడంతో సంవత్సరానికి 90 –110 రోజులకు మించి గోదావరి జలాల పంపింగ్ సాధ్యం కాలేదు. తెలంగాణ రాష్ట్రంలో సమ్మక్కసాగర్ బ్యారేజి నిర్మాణంతో దేవాదుల ప్రాజెక్టు నుంచి ఏటా 200 రోజుల పంపింగ్ సాధ్యం అవుతున్నది. ఫేజ్ 3 పూర్తి కావస్తుండడంతో మరో 25 టిఎంసిల లిఫ్ట్ సామర్థ్యం పెరగనున్నది.

* * * * *

# 2

## తెలంగాణ రాష్ట్రం ఏర్పడగానే ప్రాజెక్టుల రీ డిజైనింగ్ కు ఎందుకు ప్రాధాన్యత ఇవ్వాల్సి వచ్చింది ?

కెసిఆర్ ప్రభుత్వం 152 మీటర్లతో తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజి నిర్మాణానికి మహారాష్ట్రా ప్రభుత్వాన్ని ఒప్పించలేకపోయింది. ఇది కెసిఆర్ ప్రభుత్వ వైఫల్యమే అని కొందరు మేధావులు విమర్శలు ఎక్కుపెడుతున్నారు. కెసిఆర్ ప్రభుత్వం మహారాష్ట్రాను ఒప్పించడానికి ఏ ప్రయత్నం చేయలేదని చెప్పడం పచ్చి అబద్ధం తప్ప వాస్తవం కాదు. వాస్తవంగా ఈ విషయంలో ఘోరంగా విఫలం అయ్యింది ఉమ్మడి రాష్ట్రంలో 2004 నుంచి 2014 వరకు పదేళ్ళు అధికారంలో ఉన్న కాంగ్రెస్ ప్రభుత్వమే. కేంద్రంలో కాంగ్రెస్, మహారాష్ట్రాలో కాంగ్రెస్, ఆంధ్రప్రదేశ్ లో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఉన్న అత్యంత అనుకూల కాలంలో వారు 152 మీటర్ల ఎఫ్ఆర్ఎల్ తో తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజి నిర్మాణానికి మహారాష్ట్రాను ఒప్పించలేకపోయారు. వైఫల్యం ఎవరిది ? ఉమ్మడి రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వానిదా? ఒప్పించడానికి చిత్తశుద్ధితో ప్రయత్నించిన కెసిఆర్ ప్రభుత్వానిదా? మహారాష్ట్రా ప్రభుత్వం తొలి నుంచి కూడా మొండి వైఖరిని ప్రదర్శిస్తే అది మన తెలంగాణ ప్రభుత్వ వైఫల్యం ఎట్లా అవుతుంది?

నిజానికి కెసిఆర్ ప్రభుత్వం ఏర్పడిన వెంటనే తుమ్మిడిహట్టి వద్ద 152 మీటర్ల ఎఫ్ఆర్ఎల్ తో తుమ్మడిహట్టి బ్యారేజి నిర్మాణానికి మహారాష్ట్రా ప్రభుత్వాన్ని ఒప్పించడానికి చిత్తశుద్ధితో ప్రయత్నం చేసింది. రాష్ట్రం ఏర్పడగానే అప్పటి సాగునీటి మంత్రి శ్రీ హరీష్ రావు గారు 2014 జూలైలో ముంబాయి వెళ్ళి కాంగ్రెస్ ప్రభుత్వంలో సాగునీటి మంత్రిగా ఉన్న శ్రీ ముష్రిఫ్ గారితో సమావేశం అయినారు. హరీష్ రావు గారితో నేనూ ముంబాయి వెళ్ళాను. ఆ సమావేశంలో మహారాష్ట్రా మంత్రి గారు.. 'కొద్ది నెలల్లోనే మా రాష్ట్రంలో ఎన్నికలు జరగబోతున్నాయి. ఈ సమయంలో తుమ్మిడిహట్టిపై మేము ఏ నిర్ణయం తీసుకోలేము. ఎన్నికలు అయిన తర్వాత ఏర్పడే కొత్త ప్రభుత్వాన్ని సంప్రదించండి' అని సలహా ఇచ్చాడు. ఇక చేసేది ఏమి లేక మహారాష్ట్రాలో ఎన్నికలు జరిగి కొత్త ప్రభుత్వం ఏర్పడేదాకా వేచి చూడక తప్పలేదు. ఈ లోపల ఇంజనీర్ల స్థాయిలో చర్చలు జరుగుతూనే ఉన్నాయి. ఆగస్ట్, 2014 లో  రెండు రాష్ట్రాల చీఫ్ ఇంజనీర్ల స్థాయి సమావేశం హైదరాబాద్ లో జరిగినప్పుడు 148 మీ కంటె ఒక్క సెంటీమీటర్ ను కూడా అనుమతించేది లేదని కుండ బద్దలు కొట్టినట్టు మహారాష్ట్ర అధికారులు చెప్పినారు. వారు కూడా తమ ప్రభుత్వ వైఖరినే పునరుద్ఘాటించారు తప్ప సడలింపు కనబరచలేదు. ఎన్నికల తర్వాత మహారాష్ట్రాలో దేవేంద్ర ఫడ్నవీస్ ముఖ్యమంత్రిగా బిజెపి ప్రభుత్వం ఏర్పాటు అయ్యింది. అప్పుడు అక్కడ మన తెలంగాణ బిడ్డ శ్రీ చెన్నమనేని విద్యాసాగర్ రావు గారు గవర్నర్‌గా ఉన్నారు. తొలుత హరీష్ రావు గారు మహారాష్ట్రా సాగునీటి మంత్రి గిరీష్ మహాజన్ గారితో చర్చించడానికి 2014 డిసెంబర్‌లో ముంబాయి, నాగ్‌పూర్‌కు పోయారు. ఆయన వెంట నేనూ వెళ్ళాను. అయితే.. 'ఇది నా స్థాయిలో తీసుకునే నిర్ణయం కాదు ముఖ్యమంత్రుల స్థాయిలో జరగవలసిన నిర్ణయం' అని గిరీష్ మహాజన్ గారు సెలవిచ్చారు. 2015, ఫిబ్రవరి 17 న కెసిఆర్ తన పుట్టిన రోజు వేడుకలను కూడా వదిలేసి మహారాష్ట్రా ముఖ్యమంత్రి ఫడ్నవీస్ తో చర్చలకు ముంబాయి

వెళ్లారు. ఆ సమావేశం గవర్నర్ గారి నివాసం రాజ్ భవన్‌లో ఆయన సమక్షంలోనే జరిగింది. ఆ సమావేశంలో పాల్గొనడానికి మంత్రి హరీష్ రావు గారితో నేను కూడా ముంబాయి వెళ్ళాను. తుమ్మిడిహట్టి వద్ద 152 మీటర్ల ఎఫ్ఆర్ఎల్ వద్ద బ్యారేజి నిర్మాణానికి ఆమోదం తెలుపమని కెసిఆర్ ప్రార్థించారు. మహారాష్ట్రాలో ముంపుకు గురి అవుతున్న భూములకు మహారాష్ట్రా నిర్ధారించిన పరిహారాన్ని చెల్లిస్తామని అన్నారు. జవాబుగా ఫడ్నవీస్ స్పష్టంగా అన్నమాట ఏమిటంటే.. 'కేంద్రంలో కాంగ్రెస్, మహారాష్ట్రాలో కాంగ్రెస్, ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెస్ ప్రభుత్వం ఉన్నప్పుడే మహారాష్ట్రా ప్రభుత్వం 152 మీటర్ల ఎత్తుకు బ్యారేజి నిర్మాణానికి అనుమతించ లేదు. ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఉద్యమించి అరెస్ట్ అయిన నేను అనుమతి ఎట్లా ఇస్తాను? బ్యారేజి ఎత్తును 4 మీటర్లు తగ్గించి 148 మీటర్ల వద్ద కట్టుకోండి. గోదావరి అవార్డు ప్రకారం మీరు ఎన్ని నీళ్ళు తీసుకుపోయినా మాకు అభ్యంతరం లేదు.' ఇదీ గవర్నర్ సమక్షంలో మహారాష్ట్రా ముఖ్యమంత్రి అన్న మాటలు. ఇక వారితో సంప్రదింపులు అంటే కాలాయాపన తప్ప మరేమీ ఉండదని కెసిఆర్ నిర్ధారణకు వచ్చారు.

ఇదిలా ఉండగా మార్చ్ 2015 లో సిడబ్ల్యుసి తుమ్మిడిహట్టి వద్ద నీటి లభ్యతపై కాళేశ్వరం చీఫ్ ఇంజనీర్‌కు ఒక లేఖ రాసింది. అందులో తుమ్మిడిహట్టి వద్ద 165 టిఎంసిల నీటి లభ్యత ఉందని పేర్కొన్న మాట వాస్తవమే. వారు అక్కడితో ఆగిపోలేదు. అందులో 63 టిఎంసిలు పై రాష్ట్రాల వాటా కలిసి ఉందని కూడా పేర్కొన్నారు. ఈ వివరాలను మరో చోట ప్రస్తావించాను. ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు అవసరాలను తగినన్ని నీళ్ళు విశ్వసనీయంగా భవిష్యత్తులో లభ్యం కాకపోవచ్చునని స్పష్టంగా చెప్పిన తర్వాత 148 మీటర్ల వద్ద తుమ్మిడిహట్టి వద్ద లభ్యమయ్యే కొద్దిపాటి నీళ్ళను ఆదిలాబాద్ జిల్లా అవసరాలకు వినియోగించుకొని మిగతా జిల్లాల అవసరాల కోసం ప్రత్యామ్నాయాలను వెతకడం అనివార్యం అని తేటతెల్లం అయ్యింది. అందుకే రీ ఇంజనీరింగ్ జరిగింది.

### పెండింగ్ ప్రాజెక్టులను రన్నింగ్ ప్రాజెక్టులుగా మార్చడానికే రీ-ఇంజనీరింగ్ :

ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2005 లో జలయజ్ఞంలో భాగంగా తెలంగాణలో గోదావరి, కృష్ణా బేసిన్లలో 19 భారీ ప్రాజెక్టులని, 12 మధ్యతరహా ప్రాజెక్టులని, 2 ప్రాజెక్టుల అధునీకీకరణ (నిజాంసాగర్ & నాగార్జున సాగర్), వరంగల్, ఖమ్మం జిల్లాల్లో గోదావరి కరకట్టల నిర్మాణం ప్రాజెక్టులను ప్రతిపాదించి ప్రారంభించడం జరిగింది. ఈ పనులన్నిటిని ఇపిసి కాంట్రాక్టు పద్ధతిలో టెండర్లు పిలవడం జరిగింది. కాంట్రాక్టర్లకు మొబిలైజేషన్ అడ్వాన్సులు, డిజైన్ అడ్వాన్సులు, సర్వే అడ్వాన్సులు భారీగా చెల్లించడం జరిగింది. పనులు మాత్రం పెండింగ్‌లో ఉండిపోయాయి. వీటిల్లో రెండే ప్రాజెక్టులు పూర్తి అయినాయి. అవి నిజామాబాద్ జిల్లాలో చేపట్టిన అలిసాగర్ ఎత్తిపొతల పథకం, అర్గుల రాజారాం గుత్పా ఎత్తిపోతల పథకం. ఇక మిగతా ప్రాజెక్టులు 10 సంవత్సారాలు గడిచినా అనేక సమస్యల్లో కూరుకుపోయి నత్తనడక నడిచినాయి. భూసేకరణ జరగక, అటవీ అనుమతులు పొందక, రైల్వే, రోడ్డు క్రాసింగులను సమన్వయం చేయక, అంతర్ రాష్ట్ర సమస్యలను పరిష్కరించక, కాంట్రాక్టు చేపట్టిన ఏజెన్సీల ఒప్పంద సమస్యలు, బిల్లుల చెల్లింపులు, కేంద్ర జల సంఘం లేవనెత్తిన సాంకేతిక అంశాలపై నివేదికలు సమర్పించక, ప్రాజెక్టుల డిజైన్లను సకాలంలో పూర్తి చేయక ప్రాజెక్టులు ముందుకు సాగలేదు. జలయజ్ఞం ప్రతిపాదిత లక్ష్యాలను అందుకోలేకపోయింది. వేల కోట్ల రూపాయలు ఖర్చు అయినా ప్రాజెక్టులు ఆయకట్టుకు నీరిచ్చే దశకు చేరుకోలేకపోయినాయి. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత ప్రభుత్వం ప్రాజెక్టుల స్థితిగతులను ఇంజనీరింగ్ నిపుణులతో కూలంకషంగా సమీక్షించింది. పైన పేర్కొన్న సమస్యలను పరిష్కరించేందుకు అన్ని చర్యలు తీసుకున్నది.

ముఖ్యమంత్రి స్థాయిలో ప్రాజెక్టులపై సమీక్షలు జరుపుతున్న క్రమంలో జలయజ్ఞంలో చేపట్టిన కొన్ని

ప్రాజెక్టుల్లో సాంకేతిక అపసవ్యతలు, మరికొన్ని డిజైన్ల లోపాలు, నీటి లభ్యత, అమలులో ఎదురవుతున్న సమస్యలు, అంతర్ రాష్ట్ర సమస్యలు, వన్యప్రాణి కేంద్రాలు, బొగ్గు గనులు ప్రాజెక్టులకు అవరోధాలుగా మారనున్నాయని ప్రభుత్వం గ్రహించింది. వీటిని రీ ఇంజనీరింగ్ చేస్తే తప్ప ఈ ప్రాజెక్టుల ద్వారా నీటిని అందించలేమని ప్రభుత్వం నిర్ధారణకు వచ్చింది. గంటల తరబడి కొన్ని నెలల పాటు ఆనాటి ముఖ్యమంత్రి కెసిఆర్ ఇంజనీరింగ్ నిపుణులతో, రిటైర్డ్ ఇంజనీర్లతో సమావేశమై సర్వే ఆఫ్ ఇండియా వారి మ్యాపులు, గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్ సహాయంతో మధించిన అనంతరం ప్రాణహిత – చేవెళ్ళ సుజల స్రవంతి, శ్రీరాంసాగర్ వరద కాలువ, దేవాదుల, కంతనపల్లి, ఖమ్మం జిల్లాలో చేపట్టిన రాజీవ్ దుమ్ముగూడెం, ఇందిరా సాగర్ ప్రాజెక్టులను రీ ఇంజనీరింగ్ చేసి కొత్త ప్రతిపాదనలని సిద్ధం చేయడం జరిగింది.

2016 మార్చ్ లో సాగునీటి మంత్రి శ్రీ హరీశ్ రావు గారి అధ్యక్షతన, మంత్రులు ఈటెల రాజేందర్, తుమ్మల నాగేశ్వరరావు గార్లు సభ్యులుగా నియమించిన క్యాబినెట్ సబ్ కమిటీకి రీ–ఇంజనీరింగ్ అంశాన్ని అధ్యయనం చేసి సిఫారసులతో కూడిన నివేదికను సమర్పించమని ప్రభుత్వం నివేదించింది. సంబంధిత అన్ని వర్గాలతో చర్చించిన అనంతరం ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్ లో భాగంగా కొత్త బ్యారేజీలు, జలాశయాలు, పంపుహౌజ్ లు, టన్నెళ్ళు, కాలువలు నిర్మాణం చేయాలని, ఆన్ లైన్ జలాశయాల నిల్వసామర్థ్యం పెంచడం, పంపుల సామర్థ్యం పెంచడం, రీ ఇంజనీరింగ్ వలన ఎదురయ్యే పలు సమస్యలని కూలంకషంగా చర్చించి ఎటువంటి న్యాయపరమైన వివాదాలకు తావు లేకుండా రీ ఇంజనీరింగ్ ప్రతిపాదనలని అమలు చెయ్యడానికి ప్రణాళిక సిద్ధం చేసి 2016 ఏప్రిల్ లో నివేదికను మంత్రివర్గానికి నివేదించింది. ఈ ప్రతిపాదనలకు మంత్రివర్గం ఆమోదం తెలిపింది.

## ప్రాణహిత – చేవెళ్ల ప్రాజెక్టు కాళేశ్వరం ప్రాజెక్టుగా ఎందుకు రూపాంతరం చెందింది?

ప్రాణహిత – చేవెళ్ళ రీ డిజైన్ ఎందుకు అవసరమైయ్యింది? నాలుగు కారణాల వలన ప్రాణహిత రీ డిజైనింగ్ ని చేపట్టవలసి వచ్చింది.

1) తుమ్మిడిహట్టి వద్ద నీటి లభ్యతపై కేంద్ర జల సంఘం హైడ్రాలజీ విభాగం వారు కట్టిన లెక్కల ప్రకారం తుమ్మిడిహట్టి వద్ద ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు అవసరాలకు తగినన్ని నికర జలాలు లేవని, కాబట్టి రాష్ట్ర ప్రభుత్వం ప్రాజెక్టు ద్వారా తరలించే నీటి పరిమాణంపై పునరాలోచన చేసుకోవాలని సూచించింది.

2) ప్రాజెక్టులో ప్రతిపాదించిన జలాశయాల సామర్థ్యం ప్రాజెక్టు నుంచి మళ్లించే నీటి పరిమాణానికి తగినంతగా లేవు కాబట్టి ప్రాజెక్టు అవసరాలకు సరిపడినంతగా ఆన్ లైన్ జలాశయాల సామర్థ్యాన్ని పెంచుకోవాలని, కొత్త కృత్రిమ జలాశయాలు నిర్మించుకోవాలని కేంద్ర జల సంఘం ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వానికే సూచనలు చేసింది

3) తమ భూభాగంలో ముంపుని అనుమతించే ప్రశ్నే లేదని, బ్యారేజి ఎత్తును 152 మీ నుంచి 148 మీ తగ్గించుకోవాలని మహారాష్ట్ర ప్రభుత్వం పదేపదే అనేక సందర్భాలలో ప్రకటించింది

4) మహారాష్ట్ర, కర్నాటక రాష్ట్రాలు తమ భూభాగంలో గోదావరి దాని ఉపనదులపై లెక్కకు మించి ప్రాజెక్టులు, బ్యారేజీలు కట్టినందున ఎగువ గోదావరి వట్టిపోయింది. ఉత్తర తెలంగాణకు ప్రాణాధారంగా ఉన్న శ్రీరాంసాగర్, ఒకప్పుడు నిజామాబాద్ జిల్లా సంపద్వంతమైన జిల్లాగా మారడానికి కారణమైన

నిజాంసాగర్, మెదక్ జిల్లా సాగునీటి అవసరాలను, హైదరాబాద్ తాగునీటి అవసరాలను తీర్చే సింగూరు జలాశయాలు నీరు రాక ఎండిపోయే పరిస్థితి ఏర్పడింది. ఈ జలాశయాలను దిగువ గోదావరిలో పుష్కలంగా లభ్యమయ్యే నీటితో తిరిగి పునర్జీవింపజెయ్యడం, తద్వారా ఆయకట్టును స్థిరీకరించడం.

పై కారణాల రీత్యా ప్రాణహిత-చేవెళ్ళ ప్రాజెక్టును రీ ఇంజనీరింగ్ చేయవలసి వచ్చింది.

**తుమ్మిడిహట్టి వద్ద 152 మీ ఎఫ్ఆర్ఎల్ కు ఒప్పందం కుదిరిందా ?**

ఇది చాలా కీలకమైన ప్రశ్న. 152 మీ ఎత్తుకు ఉన్న ప్రామాణికత ఏమిటి? 2012 లో ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వం కుదుర్చుకున్న ఒప్పందం వల్ల తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజీ నిర్మాణం జరగడానికి దోహదం చేసిందా? ఉమ్మడి రాష్ట్రంలో ఎనిమిదేండ్లుగా తుమ్మిడిహట్టి బ్యారేజీ నిర్మాణం ఒక్క అంగుళం కూడా ముందుకు సాగలేదెందుకు ? కేంద్రంలో కాంగ్రేస్ ప్రభుత్వమే, మహారాష్ట్రలో కాంగ్రేస్ ప్రభుత్వమే, ఇక్కడా కాంగ్రేస్ ప్రభుత్వమే అధికారంలో ఉన్న కాలం అది. ఇంత అనుకూల పరిస్థితులు ఉన్నా కూడా తుమ్మిడిహట్టి బ్యారేజీ నిర్మాణం ఎందుకు ఆగిపోయింది? 152 మీటర్ల ఎఫ్ఆర్ఎల్ వద్ద బ్యారేజీ నిర్మాణానికి మహరాష్ట్ర ప్రభుత్వాన్ని ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వాధినేతలు ఎందుకు ఒప్పించలేకపోయినారు? 152 మీ ఎఫ్ఆర్ఎల్ తో కాలువల డిజైన్లు పూర్తి చేసి టెండర్లు పిలిచి గుత్తేదారులకు పనులు అప్పగించిన ప్రభుత్వ పెద్దలు ఎఫ్ఆర్ఎల్ పై మహారాష్ట్రను ఒప్పించాల్సిన అవసరాన్ని ఎందుకు మర్చిపోయినారు? ఆనాటి మహారాష్ట్ర కాంగ్రేస్ ముఖ్యమంత్రి పృథ్వీరాజ్ చవాన్ ప్రాణహిత పనులపై తీవ్ర అభ్యంతరాలను వ్యక్తం చేస్తూ లేఖ రాసిన సంగతి అబద్ధమా? అప్పటి కాంగ్రేస్ ముఖ్యమంత్రి ఇంత తీవ్రంగా అభ్యంతరాలను వ్యక్తం చేసినా నిమ్మకు నీరెత్తినట్లు కూర్చొని కాలక్షేపం చేసిన ప్రభుత్వ పెద్దలు ఇవ్వాళ్ళ కెసిఆర్ ప్రభుత్వం రీ ఇంజనీరింగ్ పేరు మీద గ్రావిటీ ప్రాజెక్టును వదిలేసి భారీ ఎత్తిపోతలను చేపట్టింది అని విమర్శలు చెయ్యడం సమంజసమా? అందుకు కొందరు మేధావులు వంత పాడుతున్నారు.

**తుమ్మిడిహట్టి వద్ద నీటి లభ్యతపై కేంద్ర జల సంఘం ఏమి చెప్పింది ? :**

తొలుత ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం పంపిన ప్రాణహిత-చేవెళ్ళ ప్రాజెక్టు డిపిఆర్ని కేంద్ర జల సంఘం లోని హైడ్రాలజీ డైరెక్టోరేట్ వారు పరిశీలించి తుమ్మిడిహట్టి వద్ద నీటి లభ్యతపై తమ పరిశీలనలను 4.3.2015 న ప్రాణహిత చెవెళ్ల ప్రాజెక్టు చీఫ్ ఇంజనీర్కు రాసిన లేఖలో స్పష్టంగా పేర్కొన్నారు. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సిడబ్ల్యూసీకి పంపిన డిపిఆర్లో తుమ్మిడిహట్టి వద్ద పైన ప్రాజెక్టుల అవసరాలు పోను లభ్యమయ్యే నీటి పరిమాణం 273.14 టిఎంసిలు ఉంటాయని పేర్కొన్నది. కాని సిడబ్ల్యూసీ వారి పరిశీలనలో అది 165 టిఎంసిలుగా మాత్రమే తేలింది. ఆ 165 టిఎంసిల్లో కూడా పై రాష్ట్రాల 63 టిఎంసిల జలాల వాటా కూడా కలిసి ఉన్నాయని పేర్కొన్నారు. భవిష్యత్తులో 165 టిఎంసిల నీరు నికరంగా లభ్యం కాకపోవచ్చునని, కాబట్టి ప్రాజెక్టు నుంచి మళ్లించే నీటి పరిమాణాన్ని పున:సమీక్షించుకోమని హెచ్చరించారు. సిడబ్ల్యూసి వారు లేఖలో ప్రస్తావించిన వాక్యాలను యధాథతంగా ఉటంకిస్తున్నాను.

“As evident from detailed water availability studies carried out by project authorities and this office in last few years , the net water availability at the barrage location is about 165 TMC at 75 % dependability which includes perceived surpluses from the share of u/s states (i.e assuming the utilization of u/s states limited to 75 % dependability of 63 TMC)”.

ఈ మాటలు రాస్తూ ప్రాజెక్ట్ అధికారులకు నీటిని తరలించే పరిమాణాన్ని పున: పరిశీలించమని హెచ్చరించింది. “As such the availability of surpluses from the u/s states as estimated at barrage site may not be reliably available in future. The project authorities are advised to review the quantum of divertible flows from Pranahita barrage site considering the overall availability at the location, requirement of environmental flows, capacity of pumping, storage of barrage, en-route and command area storages.”

తుమ్మిడిహట్టి వద్ద 75 % విశ్వసనీయత కలిగిన నీటి పరిమాణమే 165 టిఎంసిలు అయినప్పుడు తరలించే నీటి పరిమాణం తప్పనిసరిగా తగ్గుతుంది. అన్ని పరిస్థితులని బేరీజు వేసుకొని ఆ లెక్కలు కడితే తుమ్మిడిహట్టి నుంచి తరలించగలిగే నీటి పరిమాణం 102 టిఎంసి లకు మించి కుదరదని తేలింది. ఇది బ్యారేజీని 152 మీటర్ల ఎఫ్ఆర్ఎల్ వద్ద నిర్మించినప్పుడు మాత్రమే సాధ్యం. మహారాష్ట్ర తుమ్మిడిహట్టి బ్యారేజీ ఎఫ్ఆర్ఎల్ ని 148 మీటర్లకు తగ్గించమని పట్టుబడుతున్నది. 148 మీ ఎత్తు వద్ద తరలించే నీటి పరిమాణం 44 టిఎంసిలకు మించే అవకాశం లేదు అని ప్రాజెక్టు సిమ్యులేషన్ స్టడీస్ లో తేలింది. అవి ఆదిలాబాద్ జిల్లా అవసరాలకే సరిపోతాయి. కాబట్టి మిగతా జిల్లాల అవసరాల కోసం, ప్రాజెక్టు మొత్తం 160 టిఎంసిల నీటి తరలింపుకు రూపకల్పన చేసి పనులు ప్రారంభించినందున అంతే లేదా అంత కంటే ఎక్కువ నీరు లభ్యమయ్యే చోట బ్యారేజిని నిర్మించవలసి అగత్యం ఏర్పడింది.

**ప్రాజెక్టులో ప్రతిపాదించిన జలాశయాల సామర్థ్యంపై సిడబ్ల్యూసి సూచనలు ఏమిటి ?**

పాణహిత చేవెళ్ళ ప్రాజెక్టులో మల్లన్నసాగర్ జలాశయం నిల్వ సామర్థ్యం 1.50 టిఎంసిలుగా ఉండేది. రీ ఇంజనీరింగ్‌లో భాగంగా మల్లన్నసాగర్ జలాశయం నిల్వ సామర్థ్యాన్ని 50 టిఎంసిలకు పెంచడం జరిగింది. మల్లన్నసాగర్ నిల్వ సామర్థ్యమే కాదు అన్ని ఆన్‌లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని పెంచడం జరిగింది. ప్రాణహిత – చేవెళ్ళ ప్రాజెక్టులో ఆన్‌లైన్ జలాశయాల సామర్థ్యమే 11.43 టిఎంసిలు ఉండేది. (తుమ్మిడిహట్టి జలాశయం 5 టిఎంసిలు కలిపితే 16.43 టిఎంసిలు) ఈ అంశాన్ని కేంద్ర జల సంఘం తీవ్రంగా ఆక్షేపించింది. 160 టిఎంసిల నీటిని ఎత్తిపోసుకొని నిల్వ చేసుకోవడానికి తగినంత సామర్థ్యం ఆన్ లైన్ జలాశయాలకు లేదు అని ఎత్తి చూపింది. తగినంత నిల్వ సామర్థ్యం కలిగిన కృత్రిమ జలాశయాలని (Artificial Reservoirs) నిర్మించుకోండి లేదా ఆన్ లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోండి అని వారు సాగునీటి శాఖకు రాసిన లేఖలో సూచించినారు. 22.07.2008 న రాసిన సిడబ్ల్యూసి వారి లేఖలోని వాక్యాలు యథాతథంగా ఉటంకిస్తున్నాను. “There are 23 major online reservoirs and 1096 minor tanks within the command and in vicinity. Besides these tanks, there is requirement of artificial reservoirs also for creating within and around the project area either by increasing the capacity of existing reservoirs, tanks and / or creating additional new tanks”.

ఇది కాక సిడబ్ల్యుసి తాజాగా 2015 ఫిబ్రవరిలో కూడా ప్రాణహిత – చేవెళ్ళ ప్రాజెక్టులో ఆన్‌లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యం చాలా తక్కువగా ఉన్నదని ఎత్తి చూపుతూ లేఖ రాయడం గమనార్హం. రీ ఇంజనీరింగ్ లో కేంద్ర జల సంఘం వారి సూచనని పరిగణలోకి తీసుకునే ఆన్ లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని 11.43 టిఎంసిల నుంచి 141 టిఎంసిలకు పెంచుకోవడం జరిగింది. మల్లన్నసాగర్ (గతంలో తడ్కపల్లి) జలాశయం నిల్వ సామర్థ్యాన్ని 1.5 టిఎంసిల నుంచి 50 టిఎంసి పెంచడం వివాదాలకు దారి

తీసింది. (మల్లన్నసాగర్ వివాదాలను చాప్టర్–7లో వివరంగా చర్చించాను) కాళేశ్వరం ప్రాజెక్ట్ లో ప్రతిపాదించిన అన్ని ఆన్ లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యం సిడబ్ల్యూసి సూచనల మేరకే పెంచడం జరిగింది.

2008 లో ప్రాజెక్టు రిపోర్టుపై అధ్యయనం చేసిన నిపుణుల కమిటీ కూడా 160 టిఎంసీలను వాడుకోవాలంటే నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవాలని చెప్పింది. బ్రిజేష్ కుమార్ ట్రిబ్యునల్ కూడా నీటి నిల్వ మరియు నీటి వినియోగం నిష్పత్తి 1:1.40 నుండి 1:1.50 వరకు ఉండాలని అభిప్రాయపడింది. కాళేశ్వరం ప్రాజెక్టులో 141 టిఎంసీల నిల్వ సామర్థ్యం ఉంటే నీటి వినియోగం దాదాపుగా 237 టిఎంసీలు (18.25 లక్షల ఎకరాలకు కొత్త ఆయకట్టు, 4,70,000 ఎకరాల స్థిరీకరణలకు ఒక టీఎంసీకి 13,500 ఎకరాల చొప్పున ఇతర అవసరాలకు). కాబట్టి ఇక్కడ నీటి నిల్వ మరియు వినియోగం నిష్పత్తి 1:1.68 గా ఉంది. కేంద్ర జల సంఘం సూచించిన నిష్పత్తికి దగ్గరలోనే ఉన్నది. అదే ప్రాణహిత – చేవెళ్ల లో అయితే ఈ నిష్పత్తి 1 : 10.95. డిమాండ్ & సప్లై సిద్ధాంతం ప్రకారం జలశయాల నిల్వ సామర్థ్యం వినియోగానికి కనీసం 75% అయినా ఉండాలి. ఈ లెక్కన ఎల్లంపల్లి (20 టిఎంసిలు), మిడ్‌మానేరు (25 టిఎంసిలు) జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని కలుపుకుంటె కాళేశ్వరం ప్రాజెక్టులో లభ్యమయ్యే నిల్వ సామర్థ్యం 141 + 45 = 186 టిఎంసిలు. వినియోగం 237 టిఎంసిలు. వినియోగంలో 75% అనగా 178 టిఎంసిలు. ఈ సూత్రం ప్రకారం కూడా కాళేశ్వరం ప్రాజెక్టులో నిల్వసామర్థ్యం తగినంతగా ఉందని తేలుతున్నది. కాళేశ్వరం లాంటి భారీ ఎత్తిపోతల పథకాల విషయంలో అనేక గరిష్ఠ దుష్పరిణామాలను అంచనా వేసి నీటి నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవలసి ఉంటుంది. అవి 1) వచ్చే రెండు మూడేండ్ల వరుస వర్షాభావ పరిస్థితి 2) విద్యుత్ సరఫరాలో అనుకోని అవాంతరాలు 3) పంపులు, మోటార్లు మొరాయించి సహకరించకపోవడం. ఇవి గాక ప్రాజెక్టు నిర్వహణలో అనుకోని సమస్యలు ముందుకొచ్చినప్పుడు జలాశయాల్లో నీటి నిల్వ రైతులను ఆదుకొంటుంది. కరువు పరిస్థితుల్లో ప్రజలు, పశువుల తాగునీటి అవసరాలు తీర్చవచ్చు. అందుచేత దీపం ఉండగానే ఇల్లు చక్కబెట్టుకోవాలన్న సామెత ఎలానో నీళ్ళు ఉన్నప్పుడే ఒడిసి పట్టుకొని నిల్వ చేసుకోవడం విజ్ఞత అనిపించుకుంటుంది.

* * * * *

# 3

## రీ ఇంజనీరింగ్ తర్వాత కాళేశ్వరం ప్రాజెక్టు ప్రతిపాదనలు :

ప్రాణహిత – చేవెళ్ళ ప్రాజెక్టుని రీఇంజినీరింగ్ చేసిన తర్వాత ప్రాజెక్టుని రెండు భాగాలుగా విభజించడం జరిగింది.

**1. బి ఆర్ అంబేడ్కర్ ప్రాణహిత ప్రాజెక్టు :**

వైన్ గంగ, వార్ధా నదుల సంగమ ప్రాంతం తమ్మిడిహట్టి గ్రామం వద్ద ప్రాణహిత నదిపై 148 మీటర్ల ఎఫ్ ఆర్ ఎల్ వద్ద బ్యారేజీ నిర్మించి 20 టిఎంసిల నీటిని తరలించి ఆసిఫాబాద్, మంచిర్యాల జిల్లాల్లో 2 లక్షల ఎకరాలకు సాగునీరు అందించడానికి ప్రతిపాదించడమైనది. ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టులో కేవలం 56,500 ఎకరాలకు మాత్రమే నీరివ్వాలని ప్రతిపాదించినారు.

**2. కాళేశ్వరం ప్రాజెక్టు :**

కాళేశ్వరం తీర్థ క్షేత్రానికి దిగువన మేడిగడ్డ వద్ద 100 మీటర్ల ఎఫ్ ఆర్ ఎల్ తో ఒక బ్యారేజీ నిర్మించడం, ఆ బ్యారేజీకి ఎగువన గోదావరిపై అన్నారం , సుందిళ్ళ గ్రామాల వద్ద మరో రెండు బ్యారేజీలను నిర్మించి 190 టిఎంసిల నీటిని మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లి దాకా రోజుకు 2 టిఎంసిలు ఎత్తిపోసి 13 జిల్లాల్లో విస్తరించి ఉన్న 18.25 లక్షల ఎకరాల ఆయకట్టుకు సాగునీరు అందించడానికి జలాశయాలు, ప్రధాన కాలువలు, ఉప కాలువలు, టన్నెళ్ళు, పంపు హౌజ్ లు, విద్యుత్ సబ్ స్టేషన్లు, ఇతర అవసరమైన నిర్మాణాలు చేపట్టడం. దీనితో పాటూ దారి పొడుగునా ఉన్న గ్రామాలకు, హైదరాబాద్ నగరానికి తాగునీరు, పారిశ్రామిక అవసరాలకు నీరు సరఫరా చేయడం కాళేశ్వరం ప్రాజెక్టులో ప్రధాన అంశాలు. శ్రీరాంసాగర్, నిజాంసాగర్, సింగూరు, వరదకాలువ కింద ఉన్న 18.82 లక్షల ఎకరాల ఆయకట్టులో 25% ఆయకట్టు స్థిరీకరణ కూడా ప్రాజెక్టులో ప్రతిపాదించడమైనది.

**కాళేశ్వరం ప్రాజెక్టు విశేషాలు :**

- ఒకే ప్రాజెక్టులో బ్యారేజిలు, గ్రావిటి కాలువలు, సొరంగాలు, భూగర్భ పంప్ హౌజ్ లు, సర్జ్‌పూల్, విద్యుత్ సబ్ స్టేషన్లు ఉండటం
- ప్రాజెక్టు ప్రయోజనాలు 20 జిల్లాల్లో విస్తరించి ఉండటం, కొత్త ఆయకట్టు, స్థిరీకరణతో మొత్తం 38 లక్షల ఎకరాలకు సాగునీరు అందించడం
- తాగునీటి కోసం 40 టిఎంసిలు, పారిశ్రామిక అవసరాల కోసం 16 టిఎంసిలు సరఫరా

| | | |
|---|---|---|
| 1 | నీటిని సరఫరా చేసే మార్గం పొడవు<br>a గ్రావిటి కాలువ పొడవు<br>b గావిటి టన్నల్ పొడవు<br>c ప్రెషర్ పైపు లైన్ పొడవు | 1832 కి మీ<br>1531 కి మీ<br>203 కి మీ<br>98 కి మీ |
| 2 | లిఫ్టులు | 22 |
| 3 | పంపు హౌజ్ లు | 21 |
| 4 | అవసరమయ్యే విద్యుత్తు | 4627.24 మె వా |
| 5 | అవసరమయ్యే శక్తి (energy) | 13558 మి యూ |
| 6 | వాస్తవ విద్యుత్ వినియోగం (75%) | 10150 మి.యూ |
| 7 | విద్యుత్ సబ్ స్టేషన్లు | 400 KV-6, 220 KV-8,<br>132 KV-4, 33 KV-3,<br>మొత్తం–21, ఇందులో ఒక<br>Insulated substation<br>కూడా ఉన్నది. |
| 8 | పాత ఆన్ లైన్ జలాశయాలు | 5 |
| 9 | కొత్తగా నిర్మిస్తున్న జలాశయాలు(Reservoirs) | 19 |
| 10 | జలాశయాల నిల్వ సామర్థ్యం (New) | 141 టిఎంసి against 16 TMC in PCLIS proposal |

- ప్రపంచంలోనే అతి పెద్ద 139 మెగావాట్ల సామర్థ్యం కలిగిన పంపులు, మోటార్లు బిగించడం, ఒక్కొక్క పంపు లిఫ్ట్ సామర్థ్యం 3200 క్యూసెక్కులు
- గోదావరి నీటిని 100 మీ ఎత్తు నుంచి 620 మీ ఎత్తు వరకు పంప్ చెయ్యడం. అంటే 520 మీ ఎత్తుకు నీటిని తరలించడం
- రోజుకు 2 టిఎంసి ల నీటిని ఎత్తిపోసే పంప్ హౌజ్ ల నిర్మాణం, 3 టిఎంసి లను ఎత్తిపోయడానికి సివిల్ నిర్మాణాలు
- మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లి వరకు 170 కి మీ గోదావరి నది పునర్జీవనం, నదిలో 56 టిఎంసిల నీటి నిల్వ. మొత్తం ప్రాజెక్టులో నీటి నిల్వ 141 టిఎంసి లు
- ఆస్ట్రియా , ఫిన్ ల్యాండ్, జర్మనీ, చైనా , జపాన్ , ఇండియా దేశాల నుంచి ఆండ్రిజ్, ABB, జైలమ్, KBL, WPIL, ఫ్లోమోర్, BHEL, సీమెన్స్ కంపెనీల ద్వారా పంపులు, మోటార్లు , SFC పరికరాల సరఫరా
- పూర్తిగా స్థానిక పరిజ్ఞానంతో డిజైన్ల రూపకల్పన

- ప్రాజెక్టు నిర్మాణానికి రాష్ట రెవెన్యూ , అటవీ , పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్, ట్రాన్స్‌కో, జెన్‌కో, గనులు & భూగర్భశాఖ, న్యాయ శాఖ, రైల్వే శాఖ, పోలీస్ శాఖ, రోడ్డు భవనాల శాఖ, రిజిస్ట్రేషన్ శాఖ, వ్యవసాయ శాఖ, EPTRI లతో సమన్వయం
- కేంద్ర ప్రభుత్వ సంస్థలైన కేంద్ర జల వనరుల మంత్రిత్వ శాఖ, కేంద్ర అటవీ పర్యావరణ మంత్రిత్వ శాఖ, జాతీయ వన్య ప్రాణి బోర్డు, NGRI, NIRM, IIT, GSI, NHAI తదితర సంస్థలతో సమన్వయం
- మహారాష్ట్రా ప్రభుత్వ జల వనరులు, రెవెన్యూ, అటవీ, మైన్స్, పోలీస్, రిజిస్ట్రేషన్, ల్యాండ్ సర్వే & రికార్డ్స్ శాఖలు, PCBలతో సమన్వయం
- ప్రాజెక్టు పనులు 7 లింకులుగా, 28 ప్యాకేజీలుగా విభజించి పనులను కొనసాగిస్తున్నారు.

| **లింక్ నం** | **వివరాలు** | **ఆయకట్టు** | |
|---|---|---|---|
| | | **హెక్టార్లు** | **ఎకరాలు** |
| లింక్ – I | గోదావరిపై మేడిగడ్డ నుంచి శ్రీపాద ఎల్లంపల్లి జలాశయం వరకు (3 బ్యారేజీలు,3 పంప హౌజ్ లు ) | 12141 | 30000 |
| లింక్ – II | ఎల్లంపల్లి జలాశయం నుంచి మిడ్ మానేరు జలాశయం వరకు (ప్యాకేజీ 6,7,8 పనులు ) | – | – |
| లింక్ –III | మిడ్ మానేరు జలాశయం నుంచి అప్పర్ మానేరు జలాశయం వరకు (ప్యాకేజీ 9 పనులు) | 34864 | 86150 |
| లింక్ –IV | మిడ్ మానేరు జలాశయం నుంచి కొండ పోచమ్మ జలాశయం వరకు (ప్యాకేజీ 10,11,12,13 &14 పనులు | 241098 | 595754 |
| లింక్ –V | మల్లన్నసాగర్ నుంచి యాదాద్రి, నల్లగొండ జిల్లాలకు (ప్యాకేజీ 15 & 16) | 98543 | 243500 |
| లింక్ –VI | కొమురవెల్లి మల్లన్నసాగర్ నుంచి సింగూరు జలాశయం వరకు (ప్యాకేజీ 17,18,19,23,24,25,26 పనులు ) | 113434 | 280296 |
| లింక్ – VII | శ్రీరాంసాగర్ జలాశయం నుంచి భూంపల్లి చెరువు దాకా (ప్యాకేజీ 20,21 & 22 )పనులు, శ్రీరాంసాగర్ జలాశయం నుంచి నిర్మల్ నియోజకవర్గంలో దిలావర్ పూర్ దాకా (ప్యాకేజీ 27 పనులు), శ్రీరాంసాగర్ జలాశయం నుంచి ముధోల్ నియోజకవర్గంలో హంగారా వరకు (ప్యాకేజీ 28 పనులు) | 238770 | 590000 |
| | మొత్తం ఆయకట్టు | 7,38,851 | 18,25,700 |

**కొత్త జిల్లాల వారీగా ప్రతిపాదిత ఆయకట్టు వివరాలు**

| క్ర.సం | జిల్లా | ఆయకట్టు (ఎకరాలు) |
|---|---|---|
| 1 | కరీంనగర్ | 800 |
| 2 | రాజన్న సిరిసిల్లా | 141205 |
| 3 | సిద్ధిపేట | 380399 |
| 4 | మెదక్ | 259808 |
| 5 | యాదాద్రి | 232993 |
| 6 | నల్లగొండ | 29169 |
| 7 | సంగారెడ్డి | 180026 |
| 8 | నిజామాబాద్ | 167800 |
| 9 | జగిత్యాల | 19500 |
| 10 | కామారెడ్డి | 234000 |
| 11 | నిర్మల్ | 100000 |
| 12 | మేడ్చల్ | 50000 |
| 13 | పెద్దపల్లి | 30000 |
| | మొత్తం | 18,25,700 |
| | ఎస్ ఆర్ ఎస్ పి స్టేజ్ I &II, నిజాంసాగర్ , సింగూరు ప్రాజెక్టుల కింద ఆయకట్టు స్థిరీకరణ | 18,82,970 |
| | కొత్త ఆయకట్టు + స్థిరీకరణ మొత్తం | 37,08,670 |

## ప్రతిపాదిత ఆన్ లైన్ జలాశయాలు, వాటి నిల్వ సామర్థ్యం

| క్ర.సం | జలాశయం | ప్రదేశం | నీటి నిల్వ సామర్థ్యం టి ఎం సి |
|---|---|---|---|
| 1 | 100 మీ ఎఫ్ ఆర్ ఎల్ తో మేడి గడ్డ బ్యారేజీ | అమబటిపల్లి( గ్రా), మహాదేవపూర్(మం), జయశంకర్ భూపాలపల్లి జిల్లా | 16.17 |
| 2 | 119 మీ ఎఫ్ ఆర్ ఎల్ తో అన్నారం బ్యారేజీ | అనారం(గ్రా), మహాదేవపూర్(మం), జయశంకర్ భూపాలపల్లి జిల్లా | 10.87 |
| 3 | 130 మీ ఎఫ్ ఆర్ ఎల్ తో సుందిళ్ళ బ్యారేజీ | సుందిళ్ళ(గ్రా), కమాన్ పూర్(మం) , పెద్దపల్లి జిల్లా | 8.83 |
| 4 | మేడారం జలాశయం | నంది మేడారం(గ్రా), ధర్మారం(మం), పెద్దపల్లి జిల్లా | 0.78 |
| 5 | అనంతగిరి జలాశయం | అనంతగిరి(గ్రా), ఇల్లంతకుంట(మం), సిరిసిల్ల జిల్లా | 3.50 |
| 6 | శ్రీ రంగనాయక సాగార్ జలాశయం(ఇమాంబాద్) | చంద్లాపూర్(గ్రా), చిన్న కోడూర్(మం), సిద్ధిపేట జిల్లా | 3.00 |
| 7 | శ్రీ కొమురవెల్లి మల్లన్న సాగర్ జలాశయమ (తడ్కపెల్లి) | తొగుట(గ్రా&మం), సిద్ధిపేట జిల్లా | 50.00 |
| 8 | మల్కపేట జలాశయం | మలక్ పెట్ (గ్రా), కోనరావుపేట(మం), సిరిసిల్ల జిల్లా | 3.00 |
| 9 | కొండ పోచమ్మ సాగర్ (పాములపర్తి) | పాములపర్తి(గ్రా), మర్క్యూక్(మం), సిద్ధిపేట జిల్లా | 15.00 |
| 10 | గంధమల్ల జలాశయం | గంధమల్ల(గ్రా), ఎం.తుర్కపల్లి(మం), యాదాద్రి జిల్లా | 9.87 |

| | | | |
|---|---|---|---|
| 11 | బస్వాపురం జలాశయం | బస్వాపూర్(గ్రా),భోనగిరి(మం), యాదాద్రి జిల్లా | 11.39 |
| 12 | భూంపల్లి జలాశయం | భూంపల్లి(గ్రా),సదాశివనగర్(మం), కామారెడ్డి జిల్లా | 0.09 |
| 13 | కొండెం చెరువు | బాడ్సి(గ్రా),నిజామాబాద్(మం), నిజామాబాద్ జిల్లా | 3.50 |
| 14 | తిమ్మక్కపల్లి జలాశయం | తిమ్మక్కపల్లి(గ్రా), దౌలతాబాద్(మం), సిద్ధిపేట జిల్లా | 1.50 |
| 15 | దంతెపల్లి జలాశయం | దంతెపల్లి(గ్రా), రామాయంపేట(మం), మెదక్ జిల్లా | 1.00 |
| 16 | ధర్మారావు పేట చెరువు | ధర్మారావుపేట(గ్రా), సదాశివనగర్(మం), కామారెడ్డి జిల్లా | 0.50 |
| 17 | ముద్దోజివాడి చెరువు | ముద్దోజివాడి(గ్రా), సదాశివనగర్(మం), కామారెడ్డి జిలా | 0.50 |
| 18 | కాటేవాడి చెరువు | కాటేవాడి(గ్రా),గాంధారి)మం), కామారెడ్డి జిల్లా | 0.50 |
| 19 | మోతే జలాశయం | మోతే(గ్రా),జగిత్యాల(మం), జగిత్యాల జిల్లా | 1.00 |
| | | మొత్తం | 141.00 |

**ప్రాజెక్టులో నీటి లభ్యత:**

| క్ర.సం | వివరాలు | టి ఎం సి |
|---|---|---|
| 1 | గోదావరి నీరు | 195 |
| 2 | ఎల్లంపల్లి ప్రాజెక్టులో లభ్యమయ్యే నీరు | 20 |
| A | ఎల్లంపల్లి వద్ద మొత్తం నీటి లభ్యత | 215 |
| 3 | ఆన్ లైన్ చెరువుల పరివాహక ప్రాంత నీటి లభ్యత | 10 |
| 4 | ఆయకట్టు ప్రాంతంలో భూగర్భజలాల రీచార్జ్ | 25 |
| 5 | ఆవిరి నష్టాలు | −10 |
| | ప్రాజెక్టు వినియోగానికి నికరంగా నీటి లభ్యత (A+3+4-5) | 240 |

**ప్రాజెక్టులో నీటి వినియోగం :**

| క.సం | వివరాలు | టి ఎం సి |
|---|---|---|
| 1 | కొత్త ఆయకట్టుకు సాగునీరు | 134.5 |
| 2 | శ్రీరాంసాగర్, నిజాంసాగర్, సింగూర్ ఆయకట్టు స్థిరీకరణ (18.82 లక్షల ఎకరాల్లో మొత్తంగా 25% నీటి కొరతను పరిగణించి) | 34.5 |
| 3 | హైదరాబాద్ నగరానికి నీటి సరఫరా | 30 |
| 4 | దారిపొడుగునా గ్రామాలకు తాగునీరు | 10 |
| 5 | పారిశ్రామిక అవసరాలకు | 16 |
| 6 | ఆవిరి నష్టాలు | 12 |
| | ప్రాజెక్టులో మొత్తం నీటి వినియోగం | 237 |

పై ప్రతిపాదనలతో కేంద్ర ప్రభుత్వ సంస్థ వాప్కోస్ తయారు చేసిన డిపిఆర్ ని ప్రభుత్వం కేంద్ర ప్రభుత్వానికి అనుమతుల కోసం సమర్పించింది. 80,190 కోట్లకు ప్రాజెక్టు అంచనాను కేంద్ర జల సంఘం ఆమోదించింది. మొత్తం ప్రాజెక్టుని 7 లింకులుగా , 28 ప్యాకేజీలుగా పనులు పురోగతిలో ఉన్నాయి. మేడిగడ్డ నుంచి కొండపోచమ్మసాగర్ దాకా హెడ్‌వర్క్ వందశాతం పూర్తి అయినాయి.

**ప్రాజెక్టుకు నిధుల సమీకరణ :**

ప్రాజెక్టులోఅత్యంత ముఖ్యమైన లింకు 1, 2 & 4 లో హెడ్‌వర్క్స్ పనులని త్వరితగతిన పూర్తి చేయడానికి ప్రభుత్వం బడ్జెట్ ద్వారా కేటాయించే నిధులకు అదనంగా ప్రత్యామ్నాయ ఆర్థిక వనరులను సమకూర్చింది. అందుకు 'కాళేశ్వరం ఇరిగేషన్ ప్రాజెక్టు కార్పొరేషన్' పేరుతో ఒక స్పెషల్ పర్పస్ వెహికిల్ (SPV) ను ఏర్పాటు చేసింది. ఆంధ్రా బ్యాంక్ Consortium, పంజాబ్ నేషనల్ బ్యాంక్ Consortium, పవర్ ఫైనాన్స్ కార్పోరేషన్, రూరల్ ఎలెక్ట్రిఫికేషన్ కార్పొరేషన్, నాబార్డ్ సంస్థల ద్వారా నిధులు సమకూర్చింది. మిగతా ప్యాకేజీ పనుల కోసం రాష్ట్ర బడ్జెట్ నుండి నిధులు సమకూరుస్తున్నది రాష్ట్ర ప్రభుత్వం.

# 4

## గ్రావిటీ ప్రాజెక్టును వదిలేసి భారీ ఎత్తిపోతలకు వెళ్లారు. బ్యారేజీని తుమ్మిడిహట్టి నుంచి మేడిగడ్డకు ఎందుకు మార్చాల్సి వచ్చింది ?

తుమ్మిడి హట్టి వద్ద ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు ప్రతిపాదిత ఆయకట్టుకు, తాగునీరు, పారిశ్రామిక అవసరాలకు సరిపడా 160 టిఎంసిల నికరజలాలు భవిష్యత్తులో నికరంగా లభ్యం కాకపోవచ్చునని, ప్రభుత్వం ప్రాజెక్టు నుంచి మళ్లించే నీటి పరిమాణంపై పునరాలోచన చేయాలని కేంద్ర జల సంఘం సూచించిందని ఇంతకు ముందు 2వ అధ్యాయంలో ప్రస్తావించాను. ఈ కారణంగా ప్రభుత్వం ప్రత్యామ్నాయ స్థలం కోసం అన్వేషణ చేసింది. దానికి తోడు ముంపుపై మహారాష్ట్ర తీవ్రమైన అభ్యంతరాలు వ్యక్తం చేయడంతో ముంపు లేని ప్రత్యామ్నాయాన్ని ఆలోచించవలసి వచ్చింది. ఈ అన్వేషణంలో ప్రాణహిత, గోదావరి నదుల సంగమానికి సుమారు 20 కిలోమీటర్ల దిగువన మేడిగడ్డ అనువైన స్థలమని కేంద్ర ప్రభుత్వ సంస్థ వాప్కోస్ అధునాతన లిడార్ సర్వే ద్వారా నిర్ధారించింది.

1990 వ దశకంలో ఐక్యరాజ్య సమితికి సలహాదారుగా వ్యవహరించిన ప్రముఖ ఇంజనీర్ దివంగత శ్రీ టి హనుమంతరావు గారు గోదావరి జలాల వినియోగం కోసం తాను రూపొందించిన అంచెల వారీ బ్యారేజీల నిర్మాణానికి Step Ladder Technology లో భాగంగా 7 వరుస బ్యారేజీలను ప్రతిపాదించినారు. అందులో ఒకటి మేడిగడ్డ వద్ద కూడా ప్రతిపాదించినారు. కేంద్ర జల సంఘం కూడా మేడిగడ్డ వద్ద 284.30 టిఎంసిల నికర జలాలు లభ్యం అవుతాయని, ఇందులో నుంచి 240 టిఎంసిలను వినియోగించుకోవచ్చునని హైడ్రాలజీ అనుమతిలో పేర్కొన్నది. తమ భూభాగంలో ముంపు గణనీయంగా తగ్గిపోయిన కారణంగా మేడిగడ్డ వద్ద 100 మీ ఎఫ్ ఆర్ ఏల్ తో బ్యారేజి నిర్మాణానికి మహారాష్ట్రా ప్రభుత్వం కూడా అంగీకరించింది. కాబట్టి తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజి తక్కువ ఎత్తులో నిర్మించి ఆ నీటిని ఆదిలాబాద్ జిల్లాకు పరిమితం చేసి, మిగతా ప్రాజెక్టు అవసరాల కోసం మేడిగడ్డ వద్ద బ్యారేజీని నిర్మించాలని ప్రభుత్వం నిర్ణయించింది. మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లి జలాశయానికి నీటిని నదీ మార్గంగానే తరలించాలని ప్రతిపాదించి అన్నారం, సుందిళ్ళ బ్యారేజీలు, అనుబంధ పంప్ హవుజ్ లను కూడా నిర్మించింది. మహారాష్ట్రా మేడిగడ్డ వద్ద 100 మీటర్ల ఎఫ్ ఆర్ ఏల్ కు బ్యారేజి నిర్మాణాన్ని ఒప్పుకోవడం చారిత్రాత్మకమైనది. గోదావరి ట్రిబ్యునల్ ముందు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం పోలవరం ప్రాజెక్టు ఎఫ్ ఆర్ ఏల్ పై పట్టుబట్టి 45 మీటర్ల ఎఫ్ ఆర్ ఏల్ వద్ద నిర్మించడానికి ఒప్పించింది. అదే సమయంలో 112.77 మీటర్ల ఎఫ్ ఆర్ ఏల్ వద్ద 366 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో నిర్మించాలనుకున్న ఇచ్చంపల్లి ప్రాజెక్టు విషయంలో మాత్రం ఎఫ్ ఆర్ ఏల్ కు పట్టుబట్టలేదు. అందువలన ఇచ్చంపల్లి ప్రాజెక్టు అంతర్రాష్ట్ర వివాదాల్లో దశాబ్దాల తరబడి కూరుకుపోయింది. పర్యావరణ చట్టాలు ఇప్పుడు ఉన్నంత కఠినంగా లేని కాలంలో ఇచ్చంపల్లి ప్రాజెక్టు ఎఫ్ ఆర్ ఏల్ పై ఉమ్మడి

రాష్ట్ర ప్రభుత్వం పట్టుబట్టి ఉంటే తెలంగాణలో 366 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో ఇచ్చంపల్లి ప్రాజెక్టు నిర్మాణం జరిగి ఉండేది. కాని ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి తెలంగాణలో గోదావరిపై ఎటువంటి అడ్డుకట్ట నిర్మించడానికి సమ్మతించలేదు.

### ప్రాణహిత - చేవెళ్ల ప్రాజెక్టు గ్రావిటీ ప్రాజెక్టా ? :

ప్రాణహిత – చేవెళ్ళ ప్రాజెక్టు గ్రావిటీ ప్రాజెక్టు అని తప్పుడు ప్రచారం చేస్తున్నారు. తుమ్మిడిహట్టి నుంచి ఎల్లంపల్లి మార్గాన కూడా 40 మీటర్ల లిఫ్ట్ ఉంటుందన్న వాస్తవాన్ని కప్పిపుచ్చి గ్రావిటీ ప్రాజెక్టు అని ప్రచారం చేస్తున్నారు. నిజానికి ప్రాణహిత – చేవెళ్ళ కూడా ఎత్తిపోతల పథకమే. ఎల్లంపల్లి నుంచి ప్రాణహిత ప్రాజెక్టులో ప్రతిపాదించిన మార్గాన్నే కాళేశ్వరంలో కూడా అనుసరించారు. కాకపోతే సిడబ్ల్యూసి సూచనల మేరకు జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని పెంచుకోవడం, పంప్ హౌజ్‌ల లిఫ్ట్ సామర్థ్యాన్ని రోజుకు 2 టిఎంసిలకు పెంచుకోవడం జరిగింది. కాబట్టి రెండూ కూడా స్వభావరీత్యానే బహుళ అంచెల ఎత్తిపోతల పథకాలే (Multi Stage Lift Schemes).

### మేడిగడ్డ బ్యారేజీని రిటైర్డ్ ఇంజనీర్లు వ్యతిరేకించారా ? :

మేడిగడ్డ బ్యారేజిను రిటైర్డ్ ఇంజనీర్లు వ్యతిరేకించారని, వారు వద్దన్నా మేడిగడ్డ వద్ద బ్యారేజీని నిర్మించిందని ప్రభుత్వ వర్గాలు విస్తృతంగా ప్రచారం చేస్తున్నారు. మేడిగడ్డ బ్యారేజిపై రిటైర్డ్ ఇంజనీర్లు ఏమి చెప్పారు ? వారు వ్యతిరేకించిన అంశం ఏమిటి అన్నది వారి నివేదికలోని వాక్యాలను చదివితే అర్థం అవుతుంది. తొలుత మేడిగడ్డ నుంచి నేరుగా మిడ్ మానేరు జలాశయానికి గోదావరి నీటిని ఎత్తిపోయాలని ప్రతిపాదించడం జరిగింది. ఈ మార్గం సాధ్యాసాధ్యాలను అధ్యయనం చేయడానికి ప్రభుత్వం రిటైర్డ్ ఇంజనీర్ల కమిటీని ఏర్పాటు చేసింది

ఆ కమిటి క్షేత్ర స్థాయిలో పర్యటించి, సర్వే ఆఫ్ ఇండియా మ్యాప్‌లను కూలంకషంగా పరిశీలించి బ్యారేజి నిర్మాణానికి మేడిగడ్డ స్థలం అనువైనదని, అయితే మేడిగడ్డ నుంచి నేరుగా మిడ్ మానేరు జలాశయానికి నీటిని తరలించడం మాత్రం వీలుకాదని పేర్కొంది. ఆ మార్గంలో తాడిచర్ల బొగ్గు గనులు, సింగరేణి ఓపెన్ కాస్ట్ గనులు అందుకు అవరోధంగా ఉన్నాయని రిటైర్డ్ ఇంజనీర్లు తమ నివేదికలో పేర్కొన్నారు. వారు తమ నివేదికలో పేజీ 7 లో రాసిన వాక్యాలను యధాతథంగా ఉటంకిస్తున్నాను. “The site of barrage was examined during the Ariel survey and proposed site for construction is feasible in view of less width of Godavari river. As per topo sheet study the FRL of the barrage can be fixed at about +105 m without submerging patta lands in Maharashtra state”.

మేడిగడ్డ బ్యారేజి నుంచి నేరుగా మీడ్ మానేరు జలాశయానికి నీటిని తరలించే ప్రతిపాదనపై వారి అభిప్రాయాన్ని పేజీ 8 లో ఇట్లా వ్యక్తం చేశారు. “The proposed alignments of tunnels and gravity canals are passing through the coal belt area i.e Tadicherla coal block and Singareni open cast mines. Due to the presence of coal belt area in the alignment, the execution of Tunnels and gravity canal may not be feasible.”

నివేదిక చివరలో కూడా పేజీ 13లో కూడా ఇదే అంశాన్ని పొందుపరచినారు. అంతే తప్ప వారు మేడిగడ్డ వద్ద బ్యారేజి నిర్మాణాన్ని వ్యతిరేకించలేదు.

ఆ తర్వాత రిటైర్డ్ ఇంజనీర్ల సూచన మేరకు మేడిగడ్డ – మిడ్ మానేరు మార్గాన్ని త్యజించి మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లి బ్యారేజీకి నీటిని గోదావరి నదీ మార్గం ద్వారానే తరలించాలని ప్రభుత్వం నిర్ణయించింది. అందుకు వీలుగా అన్నారం, సుందిళ్ళ బ్యారేజీలు, వాటి అనుబంధ పంప్ హౌజ్ లను,13 కిలోమీటర్ల గ్రావిటీ కాలువను కూడా ప్రభుత్వం నిర్మించింది.మేడిగడ్డ – మిడ్‌మానేరు మార్గాన్ని త్యజించడానికి మరో కారణం ఏమిటంటె... ఈ మార్గంలో శ్రీరాంసాగర్ ప్రాజెక్టు డిస్ట్రిబ్యూటరీలు డి. 83, డి 86 కింద అభివృద్ధి చెందిన ఆయకట్టు కూడా ఉంది.

* * * * *

# 5

## డిపిఆర్ లేకుండా ఏటువంటి భూభౌతిక పరిశోధనలు జరపకుండానే బ్యారేజీలను నిర్మించారా ?

డిపిఆర్ లేకుండానే బ్యారేజీలను నిర్మించారని, పరిశోధన ఒక చోట.. నిర్మాణం మరో చోట' అనే ఆరోపణ కూడా కాళేశ్వరం బ్యారేజీల మీద వచ్చాయి. అన్నారం, సుందిళ్ళ బ్యారేజీల నిర్మాణం కోసం ఎంపిక చేసిన స్థలాల్లో భూభౌతిక పరిశోధనలు జరిపి నిర్మాణ సమయంలో వాటిని మరో చోటకి మార్చి ఎటువంటి భూభౌతిక పరిశోధనలు చేయకుండానే నిర్మాణం చేసినారని మన ఇంజనీర్ల తీవ్రమైన ఆరోపణలు చేసినారు కొందరు పెద్ద మనుషులు. తొలుత ఎంపిక చేసిన స్థలంలో కాకుండా కొన్ని కిలోమీటర్ల దిగువన అన్నారం, సుందిళ్ళ బ్యారేజీల నిర్మాణం జరిగిన మాట వాస్తవమే. ఇటువంటి మార్పులు ఇంజనీర్లకు కొత్తదేమి కాదు. రకరకాల కారణాల వలన నిర్మాణ స్థలాన్ని మార్చే పరిస్థితులు ఏర్పడతాయి. అయితే మార్చిన ఆ స్థలంలో ఎటువంటి భూభౌతిక పరిశోధనలు జరపకుండానే బ్యారేజీలను నిర్మించారనడం పూర్తిగా అబద్ధం. అట్లా ఇంజనీర్లు ఎవరైనా చేస్తారా? అక్కడ కూడా భూభౌతిక పరిశోధనలు చేసి వాటి ఫలితాలను CDOకి పంపించడం జరిగింది. ఈ విషయాన్ని సుందిళ్ళ బ్యారేజి నిర్మాణాన్ని ప్రత్యక్షంగా ఏజెన్సీ తరపున పర్యవేక్షించిన రిటైర్డ్ చీఫ్ ఇంజనీర్ శ్రీ పి వెంకటరామారావు గారు ధ్రువీకరించారు. వాటి ఆధారంగానే CDO డిజైన్లను రూపొందించింది. Design of Barrages on Permeable Foundations పై సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఇరిగేషన్ & పవర్ (CBIP), సిడబ్ల్యుసి వారు జారీ చేసిన డిజైన్ మాన్యువల్స్, బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్ (BIS) వారు జారీ చేసిన కోడ్స్ ను తూచా తప్పకుండా పాటించి డిజైన్లను రూపొందించినారు. దేశంలో ఎవరైనా వీటి ఆధారంగానే బ్యారేజీల డిజైన్లు చేయడం జరుగుతుంది. ఇటువంటి దారుణమైన తప్పులను ఏ ఇంజనీర్ కూడా చేయలేదు. మార్చిన స్థలాల్లో భూభౌతిక పరిశోధనలు జరపలేదని ఏ ఆధారాలతో వారు ఆరోపణ చేసినారో వారికే తెలియాలి. ఇది చాలా తీవ్రమైన, నిరాధారమైన ఆరోపణ. తెలంగాణ ఇంజనీర్ల ఇంజనీరింగ్ పరిజ్ఞానం మీద, వారి ఇంటిగ్రిటీ మీద దారుణమైన అపహాస్యానికి వారు పాల్పడినారు. అదే విధంగా బ్యారేజీల నిర్మాణానికి ముందు హిమాయత్ సాగర్ లో ఉన్న తెలంగాణ ఇంజనీరింగ్ రీసర్చ్ లాబొరేటరీస్ (TSERL) ద్వారా మోడల్ స్టడీస్ చేయించలేదని, ల్యాబ్స్‌లో అటువంటి అధ్యయనాలను చేపట్టడానికి వసతులు లేవని మరొక ఆరోపణ. ఇది కూడా నిరాధారమైన ఆరోపణ. నిజాం జమానాలో స్థాపించిన ఈ ల్యాబ్స్‌లో అన్ని వసతులు, పరికరాలు ఉన్నాయి. మూడు బ్యారేజీలపై 2D మోడల్ స్టడీస్ జరిపినామని, వాటి ఫలితాల ఆధారంగా బ్యారేజీల Vent Ways పెంచడం జరిగిందని బ్యారేజీల నిర్మాణాన్ని పర్యవేక్షించిన ఇంజనీర్లు చెప్పినారు.

ఇకపోతే ప్రాజెక్టుకు డిపిఆర్ లేకుండానే పనులు ప్రారంభించారని ఆరోపణ కూడా సత్య దూరం. కాళేశ్వరం ప్రాజెక్టులో తొలుత ప్రారంభం అయిన మేడిగడ్డ బ్యారేజికి వాప్కోస్ తొలుత డిపిఆర్ ను తయారు చేసి ఇచ్చింది. ఆ డిపిఆర్ ఆధారంగా ప్రభుత్వం పరిపాలనా అనుమతిని జారీ చేసింది. ఆ తర్వాత సుందిళ్ళ, అన్నారం బ్యారేజీల డిపిఆర్ లను కూడా తయారు చేశారు. ఈ డిపిఆర్ ఆ బ్యారేజీల పనులు ప్రారంభం కాక ముందే తయారు అయినాయి. బ్యారేజి నిర్మించే స్థలం పొడవునా బోర్ హోల్ డేటా తీసి రాష్ట్ర డిజైన్స్

విభాగానికి (CDO) పంపడం జరిగింది. అ తర్వాత సకారణాల వల్లనే .. ముఖ్యంగా పంట భూముల ముంపును తగ్గించడానికి, గ్రావిటి కాలువ, పైప్ లైన్ల పొడవును తగ్గించడానికి బ్యారేజీల స్థలాన్ని కిందకు మార్చడం జరిగింది. ఈ కారణాల రీత్యా అన్నారం బ్యారేజీని 2.20 కి.మీ. దిగువకు, సుందిళ్ల బ్యారేజీని 5.4 కి.మీ దిగువకు మార్చడం జరిగింది. అక్కడ కూడా బోర్ హోల్ డేటా తీసి సిడిఓ కి పంపితే వారు బ్యారేజి డిజైన్స్ ను పైన పేర్కొన్న కోడ్స్, సర్క్యులర్లు, మార్గదర్శకాలను ఉపయోగించి తయారు చేసినారు. ఆ ప్రకారమే బ్యారేజీల నిర్మాణం కొనసాగింది. 2017 ఫిబ్రవరి నాటికి వాప్కోస్ వారు ప్రాజెక్టు సమగ్ర నివేదికను (DPR) రాష్ట్ర ప్రభుత్వానికి అందజేసింది. అదే డిపిఆర్ ను కేంద్ర జల సంఘానికి, పర్యావరణ మంత్రిత్వ శాఖకు, కేంద్ర విద్యుత్ ప్రాధికార సంస్థకు (CEA) అనుమతుల కోసం పంపడం జరిగింది. 31.3.2017 లో మొదలైన అనుమతుల ప్రక్రియ 6.6.2018 నాటికి ప్రాజెక్టుకు అన్ని చట్టబద్ధ అనుమతులను పొందినట్లు అయ్యింది. ఇన్వెస్ట్మెంట్ క్లియరెన్స్ కోసం కూడా రాష్ట్ర ప్రభుత్వం కేంద్ర ఆర్థిక శాఖకు లేఖలు రాసింది. అయితే వారు కొర్రీలు పంపడంలోనే కాలాయాపన చేసినారు. ఇన్వెస్ట్మెంట్ క్లియరెన్స్ వస్తే ప్రాజెక్టుకు జాతీయ హోదా ఇవ్వాల్సి వస్తుందని కుట్ర పూరితంగానే ప్రాజెక్టుకు అనేక కొర్రీలు వేసినారు. రాష్ట్ర ప్రభుత్వం ఇక ఆ ప్రయత్నాలను ఆపివేసి తన స్వంత నిధుల నుండి, కాళేశ్వరం కార్పొరేషన్ ద్వారా జాతీయ బ్యాంకులు, పవర్ ఫైనాన్స్ కార్పొరేషన్, రూరల్ ఎలెక్ట్రిఫికేషన్ కార్పొరేషన్, నాబార్డ్ నుండి రుణాలు సేకరించి ప్రాజెక్టు నిర్మాణాన్ని మూడున్నర ఏండ్లలో పూర్తి చేసింది. సేకరించిన రుణాలు ప్రాజెక్టు నిర్మాణానికే ఖర్చు అయినాయని సంతృప్తి చెందిన రూరల్ ఎలెక్ట్రిఫికేషన్ కార్పొరేషన్ వారు కాళేశ్వరం కార్పొరేషన్ కు 'ఎ' గ్రేడ్ ను ఇచ్చింది. ఇవీ వాస్తవాలు. కేంద్ర ప్రభుత్వం నుంచి కాళేశ్వరం ప్రాజెక్టుకు లభించిన అనుమతులు వివరాలను ఈ కింది పట్టికలో చూడవచ్చు.

| **క్రసం** | **వివరాలు** | **తేదీ** |
|---|---|---|
| 1 | స్టేజ్ -1 పర్యావరణ అనుమతి | 31.03.2017 |
| 2 | మేడిగడ్డ వద్ద 75% డిపెండబిలిటీతో 284.3 టిఎంసిల నీటి లభ్యతతో హైడ్రాలజీ క్లియరెన్స్ | 30.10.2017 |
| 3 | అంతర్రాష్ట్ర అనుమతి | 03.11.2017 |
| 4 | కేంద్ర భూగర్భ జల శాఖ అనుమతి | 21.11.2017 |
| 5 | Construction Machinery అనుమతి | 21.11.2017 |
| 6 | తుది అటవీ అనుమతి | 24.11.2017 |
| 7 | తుది పర్యావరణ అనుమతి | 05.12.2017 |
| 8 | ఇరిగేషన్ ప్లానింగ్ అనుమతి | 13.04.2018 |
| 9 | రూ 80,190 కోట్లకు ప్రాజెక్టు అంచనా వ్యయానికి అనుమతి | 01.06.2018 |
| 10 | ప్రాజెక్టుకు టెక్నికల్ అడ్వయిజరీ కమిటి (TAC) అనుమతి | 06.06.2018 |

* * * * *

# 6

# రీ ఇంజనీరింగ్ తర్వాత కాళేశ్వరం ప్రాజెక్టు అంచనా వ్యయం ఎందుకు పెరిగింది ?

ప్రాణహిత చేవెళ్ళ సుజల స్రవంతి ప్రాజెక్టు రీ ఇంజనీరింగ్ తర్వాత జరిగిన కీలకమైన మార్పు ప్రాజెక్టును రెండు భాగాలుగా విభజించడం.

1) ఆదిలాబాద్ జిల్లాకే పరిమితమైన డా. బి ఆర్ అంబేద్కర్ ప్రాణహిత ప్రాజెక్టు (20 టిఎంసిల వినియోగంతో 2 లక్షల ఎకరాలకు సాగునీరు).

2) ఆదిలాబాద్ జిల్లా అవసరాలు పోనూ మిగతా జిల్లాల అవసరాలను తీర్చడానికి గోదావరిపై మేడిగడ్డ బ్యారేజీ వద్ద ప్రారంభయ్యే కాళేశ్వరం ప్రాజెక్టు (ప్రాజెక్టు వివరాలను చాప్టర్-3లో పొందుపర్చాను). (225 టిఎంసిల వినియోగంతో 18.25 లక్షల ఎకరాలకు సాగునీరు, 18.80 ఎకరాల శ్రీరాంసాగర్, నిజాంసాగర్, సింగూరు ఆయకట్టు స్థిరీకరణ. రోజుకు 2 టిఎంసిలను ఎత్తిపోసేందుకు వీలుగా పంపు హౌజ్ లు, సొరంగాలు, 141 టిఎంసిల నిల్వసామర్థ్యం కలిగిన జలాశయాలు కాళేశ్వరం ప్రాజెక్టులో ప్రతిపాదించడం జరిగింది. ఇందులో అత్యంత కీలకమైనది 50 టిఎంసి నిల్వ సామర్థ్యం కలిగిన మల్లన్న సాగర్ మాతృ జలాశయం.

**రీ-ఇంజనీరింగ్ తర్వాత ప్రాజెక్టు అంచనా విలువ పెరగడానికి ఇవీ కారణాలు :**

1. ఆయకట్టు 16.40 లక్షల ఎకరాల నుంచి 18.25 లక్షలకు పెరిగింది. రీ ఇంజనీరింగ్ ద్వారా కేవలం ప్రాణహిత ప్రతిపాదిత ఆయకట్టుకే కాదు శ్రీరాంసాగర్, నిజాంసాగర్, సింగూరు, వరదకాలువ, చెరువుల కింద 18.82 లక్షల ఎకరాల ఆయకట్టుని స్థిరీకరించడం.
2. సిడబ్ల్యుసి సూచనల మేరకు జలాశయాల సామర్థ్యాన్ని 16 టిఎంసిల నుంచి 141 టిఎంసిలకు పెంచడమైనది. మరికొన్ని కొత్త జలాశయాలను ప్రతిపాదించడం జరిగింది. జలాశయాల ఎత్తు పెంచడం కోసం, కొత్త జలాశయాల నిర్మాణం కోసం అదనపు ఖర్చు తప్పదు.
3. మేడిగడ్డ బ్యారేజీకి ఎగువన అన్నారం, సుందిళ్ళ బ్యారేజీలను, వాటికి నీటిని ఎత్తి పోయడానికి మూడు పంప్ హౌజ్ లను ప్రభుత్వం ప్రతిపాదించింది.
4. ఈ మూడు బ్యారేజీల ద్వారా నదీ మార్గంలో గోదావరి నీటిని రోజుకు 3 టిఎంసిలు ఎత్తిపోయడానికి పనులు జరిగినాయి. పంపులు, మోటార్లు మాత్రం రోజుకు 2 టిఎంసిలు ఎత్తిపోయడానికి అమర్చడం జరిగింది. గతంలో పంపింగ్ సామర్థ్యం రోజుకు 1.80 టిఎంసి లు మాత్రమే.
5. ఆన్ లైన్ జలాశయాల సామర్థ్యాన్ని పెంచినందున భూసేకరణ, పునరావాసం కోసం అదనంగా ఖర్చు పెరుగుతుంది.

6. గత ప్రభుత్వాల హయాంలో భూసేకరణ కోసం ప్రభుత్వం పెట్టిన ఖర్చు ఏకరాకు 2 లక్షలు మాత్రమే. భూసేకరణ కోసం 1071 కోట్లు మాత్రమే కేటాయించినారు. 2013 లో కేంద్రంలో యుపిఎ ప్రభుత్వం కొత్త భూసేకరణ చట్టం తెచ్చిన తర్వాత భూసేకరణపై తెలంగాణా ప్రభుత్వం ఏకరాకు 6 నుంచి 12 లక్షలు చెల్లించింది. భూసేకరణ కోసం 6085 కోట్లు కేటాయించింది.

7. గత ప్రభుత్వం కరెంటు సరఫరా కోసం సబ్ స్టేషన్ల నిర్మాణానికి, ట్రాన్స్మిషన్ లైన్ల నిర్మాణంకోసం కేవలం 1010 కోట్లు మాత్రమే నిధులు కేటాయించింది. ఇది ఎత్తిపోతల పథకాల్లో అతి ముఖ్యమైన కాంపొనెంట్. కెసిఆర్ ప్రభుత్వం వీటి కోసం తగినన్ని నిధులు 3000 కోట్లు కేటాయించింది.

8. 2007 నుంచి 2016 దాకా ధరల పెరుగుదలను అనుమతించవలసిన నిబంధనలు గత ప్రభుత్వం కుదుర్చుకున్న టెండరు ఒప్పందాల్లోనే ఉన్నాయి. ఈ నిబంధనల కారణంగా ధరల పెరుగుదల భారం 5163 కోట్లు ఖజానాపై పడింది.

9. వ్యాట్ 2.8 % నుంచి 3.5 % నికి పెరిగింది.

10. ఈపిసి ప్యాకేజీల్లో టెండర్లు అన్నీ 3.70 % నుంచి 4.9% వరకు అధికంగా వేసినారు. దీని వలన ప్రాజెక్టుపై 1600 కోట్ల భారం పడింది.

కాబట్టి రీ ఇంజనీరింగ్ వలన ప్రాజెక్టు అంచనా వ్యయం అనివార్యంగా పెరుగుతుంది. ప్రాజెక్టుల అంచనా వ్యయాలు పెరగడం సహజమైన అంశమే. తొలి అంచనా విలువతో పూర్తి అయిన ప్రాజెక్టు రాష్ట్రంలో గాని, దేశంలోగానీ, ప్రపంచంలో గాని ఎక్కడా ఉండవు. ఉమ్మడి రాష్ట్రంలో కట్టిన ప్రాజెక్టుల అంచనా విలులు ఎట్లా పెరిగినయో ఈ కింది పట్టికలో చూడండి.

**(అంచనా విలువ కోట్లల్లో )**

| **ప్రాజెక్టు** | **తొలి అంచనా / సం** | **మొదటి సవరణ/సం** | **రెండవ సవరణ/సం** | **మూడో సవరణ/సం** |
|---|---|---|---|---|
| నాగార్జునసాగర్ | 122/(1954) | 163.54/(1968) | 312.47/(1974) | 1183.94/(2000) |
| శ్రీరాంసాగర్ | 40.13/(1964) | 1519.15/(1992) | 4300/(1997) | – |
| జూరాల | 70/(1980) | 204.75/(1985) | 1240/(2008) | 1815/(2016) |
| పులిచింతల | 565.87/2003 | 681.604/2005 | 1281.00/2009 | 1816.17/2014 |
| సింగూర్ | 29.25/(1975) | 42.34/(1979) | 104.36/(1989) | 169.12/(1991) |
| ఎల్లంపల్లి | 900/2004 | 1366.92/2013 | 2048.28/2016 | – |
| దేవాదుల | 6016/2005 | 9427.73/2009 | 13445.44/2017 | 17500/2024 |

కాబట్టి రీ ఇంజనీరింగ్ వలన ప్రాజెక్టు అంచనా వ్యయం అనివార్యంగా పెరుగుతుంది. అంచనా వ్యయం పెరిగినా ప్రాజెక్టు ప్రయోజనాలు అంతే అన్న విమర్శలో అర్థంలేదు. ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టులో లేని స్థిరీకరణ అదనంగా కాళేశ్వరం ప్రాజెక్టులో చేరింది. ఆయకట్టు 16.40 లక్షల ఎకరాల నుంచి

18.25 లక్షల ఎకరాలకు పెరిగింది. నీటి వినియోగం 160 టిఎంసిల నుంచి 237 టిఎంసిలకు పెరిగింది. ప్రాణహిత – చేవెళ్ళ అంచనా విలువలు కూడా 17 వేల కోట్లతో మొదలై 38 వేల కోట్లకు పెరిగి కేంద్ర జల సంఘానికి నివేదించేనాటికి 40 వేల కోట్లకు పెరిగింది. తట్ట మట్టి ఎత్తకుండానే ప్రాజెక్టు అంచనా విలువ 17 వేల కోట్ల నుంచి 40 వేల కోట్లకు ఎందుకు పెరిగినట్టు ? కాళేశ్వరం విమర్శకులు ఈ విషయంలో మాత్రం మౌనం పాటిస్తారు.

**మేడిగడ్డ అంచనా వ్యయం ఎందుకు పెరిగింది ? :**

కాళేశ్వరం ప్రాజెక్టు డిపిఆర్ ను కేంద్ర జల సంఘం రూ 80,190 కోట్లకు ఆమోదించింది. ఇందులో మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ళ బ్యారేజిల వ్యయం, వాటి అనుబంధ పంప్ హౌజ్ ల వ్యయం కూడా కలిసి ఉంది. మేడిగడ్డ బ్యారేజీ అంచనా వ్యయాన్ని మార్చ్ 2016లో రూ. 2591 కోట్లకు ప్రభుత్వం పరిపాలనా అనుమతిని మంజూరు చేసింది. ఆ తర్వాత తుది అంచనా వ్యయాన్ని సెప్టెంబర్ 2021 లో రూ 4613 కోట్లకు సవరించింది. వాస్తవిక పని విలువ 4321.44 కోట్లు. ఇది తొలి అంచనా వ్యయంతో పోలిస్తే 133.67 శాతం అధికం. ఈ పెంపుపై ప్రాజెక్టు విమర్శకులు కమిషన్ల కోసం, కాంట్రాక్టర్ల మేలు కోసం బ్యారేజి అంచనా వ్యయాన్ని 133.67 శాతం పెంచారని ఆరోపించారు. ఈ ఆరోపణలు ఎట్లా ఉన్నా వాస్తవంగా బ్యారేజి అంచనా వ్యయం పెరగడానికి సకారణాలే ఉన్నాయి. వాస్తవ పని విలువతో పోలిస్తే 133.67 శాతం అధికంగా కనిపిస్తున్నది. మొత్తం అంచనా విలువతో పోలిస్తే అది 78 శాతమే. నిర్మాణ సమయంలో అనేక కారణాల వలన మార్పులు చేర్పులు జరుగుతాయి. వాటి కారణంగా ప్రాజెక్టు అంచనా వ్యయం పెరుగుతుంది. ఇది అసహజమైన విషయం కానే కాదు.

**మేడిగడ్డ బ్యారేజి అంచనా వ్యయం పెరగడానికి కారణాలు :**

- తొలుత బ్యారేజి కట్ ఆఫ్ (Cut Off) లుగా షీట్ పైల్స్ వేయాలని అనుకున్నారు. అయితే నదీ గర్భంలో రాళ్ళతో కూడిన దొడ్డు ఇసుక (Coarse Sand with Pebbles) ఉండడంతో షీట్ పైల్స్ పునాదుల్లోకి దించడం కష్టంగా మారినందున షీట్ పైల్స్ కు బదులుగా సీకెంట్ పైల్స్ వేయాలని ఇంజనీర్లు నిర్ణయించారు. షీట్ పైల్స్ కంటే సీకెంట్ పైల్స్ వేయడంలో ఖర్చు ఎక్కువ.

- సీడీఓ డిజైన్స్‌లో బ్యారేజి రాఫ్ట్ మందము తొలుత అనుకున్న దాని కంటే పరిగింది. బ్యారేజి నిర్మాణానికి వినియోగించే కాంక్రీట్ గ్రేడ్ కూడా పెరిగింది. సిమెంట్ కాంక్రీట్ లో వినియోగించే స్టీల్ పరిమాణం పెరిగింది.

- బ్యారేజి గేట్ల సామర్థ్యం 200 టన్నుల నుంచి 230 టన్నులకు పెరిగింది. బ్యారేజి నిర్మాణానికి వినియోగించే స్టీల్ గ్రేడ్ కూడా E250 నుంచి E350 కి పెంచడం జరిగింది.

- బ్యారేజి కుడి ఎడమల వాగుల నుంచి వచ్చే నీళ్ళను బ్యారేజి కిందకు మళ్లించడానికి కాలువలు తవ్వడం, వాటిపై రెండు లేన్ల బ్రిడ్జి ల నిర్మాణం, నీటి ప్రవాహపు అఫ్లక్స్ ను భరించడానికి వీలుగా తగినంత ఎత్తుతో మట్టి కట్టల నిర్మాణం

- కుదురుపల్లి గ్రామం నుంచి మేడిగడ్డ బ్యారేజి వరకు 16.5 కిలోమీటర్ల బిటి రోడ్డు వేసినారు. ఇది ప్రాజెక్టు అధికారులకు, చుట్టు పక్కల ఉన్న గ్రామాల ప్రజల రాకపోకలకు ఉపయోగకరంగా మారింది.

- బ్యారేజి నిర్మాణ సమయంలో ఎఫ్ఆర్ఎల్ 100 మీటర్ల వరకు తాత్కాలిక మట్టికట్ట (Coffer Dam) నిర్మాణం జరిగింది.

- గోదావరిలో నిరంతరం వచ్చే నీటిని పని జరిగే స్థలం నుంచి బయటకు పంప్ చేయాలి. డి వాటరింగ్ తొలుత ఊహించిన దాని కంటే చాలా ఎక్కువగా చేయాల్సి వచ్చింది.

- వానా కాలంలో బ్యారేజి స్థలానికి కంకరను, రాళ్ళను, ఇతర సామాగ్రిని మహారాష్ట్రా వైపుకు తరలించడానికి నదిలో నిర్మించిన కాఫర్ డ్యాంపై నుంచి తరలించడం వీలు కాలేదు. అందుకు ప్రత్యామ్నాయంగా కాళేశ్వరం వద్ద నిర్మించిన ఆర్ & బి బ్రిడ్జ్ ద్వారా చేరవేయడం వలన అదనపు లీడ్ ను ఇవ్వాల్సి వచ్చింది.

- బ్యారేజి నిర్మాణం తర్వాత మట్టిని, రాళ్ళను ఇతర అనవసరపు సామాగ్రిని తొలగించడానికి పెరిగిన అదనపు ఖర్చు.

- సిమెంట్, స్టీల్, ఇంధనాలపై 18 శాతానికి పెరిగిన GST, ఏటా పెరిగిన సీనరేజ్ పన్నులు

## కాళేశ్వరం ప్రాజెక్టు సర్వే, డిపిఆర్ తయారికి రూ. 677 కోట్లా?

కాళేశ్వరం ప్రాజెక్టు సర్వే, డిపిఆర్ తయారీకి ప్రభుత్వం రూ. 677 కోట్లు ఖర్చు పెట్టిందని కొన్ని పత్రికలు తాటికాయంత అక్షరాలలో వార్తలు ప్రచురించాయి. ఇది కూడా బట్ట కాల్చి మీద పడేయడం లాంటిదే. వాస్తవాలను చెక్ చేసుకోకుండా వార్తలను ఇట్లా వండి వార్చడం కాళేశ్వరం వ్యతిరేకులకు మొదటి నుంచి అలవాటే. నిజానికి కాళేశ్వరం ప్రాజెక్టు డిపిఆర్ తయారి పనిని కేంద్ర ప్రభుత్వ సంస్థ వాప్కోస్ వారికి అప్పగిస్తూ ప్రభుత్వం రెండు జోవోలు జారీ చేసింది.

- G.O. Rt No. 40 dt 18.01.2016: ఇందులో మేడిగడ్డ బ్యారేజి, లిఫ్ట్ స్కీం యొక్క డిపిఆర్ తయారికి రూ. 677.67 లక్షలకు పరిపాలన అనుమతిని జారీ చేసింది. బహుశా రూ. 677.67 లక్షలను 677 కోట్లుగా భ్రమించి వార్తను ప్రజల్లోకి పంపించారని అనుకోవాల్సి వస్తున్నది.

- G.O. Rt No. 323 dt 18.03.2016: ఇందులో మేడిగడ్డ – ఎల్లంపల్లి మధ్యలో ఉన్న రెండు బ్యారేజీలు, ఇతర జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని పెంచడానికి సర్వే, డిపిఆర్ తయారీకి ప్రభుత్వం రూ. 12.96 కోట్లకు పరిపాలనా అనుమతి జారీ చేసింది.

రెండు జీవోల మొత్తం రూ. 19.73 కోట్లు మాత్రమే. మరి ప్రతికలు పెద్దగా ప్రచారం చేసిన 677 కోట్లు ఎక్కడ నుంచి వచ్చినట్లు? పైన పేర్కొన్న రెండు జీవోలు ఇప్పటికి ప్రభుత్వ వెబ్‌సైట్లో అందుబాటులో ఉన్నాయి. పబ్లిక్ డొమైన్‌లో ఉన్న జీవోలపై ఇంత పెద్ద అబద్దాన్ని ఎట్లా ప్రచారం చేయగలిగినారో మరి!

* * * * *

7

# మల్లన్నసాగర్ జలాశయంలో 50 టిఎంసిల నిల్వ అవసరమా?

ఇక మల్లన్నసాగర్ జలాశయంలో 50 టిఎంసిల స్టోరేజి అవసరం ఏమిటి అన్నది పూర్తిగా సాంకేతిక పరమైన అంశం మాత్రమే. దానికి తోడు భౌగోళికంగా ఆ ప్రదేశానికి ప్రాధాన్యత ఉన్నది. కాళేశ్వరం ప్రాజెక్టులో ప్రతిపాదించిన ఆయకట్టులో 66 శాతం మల్లన్నసాగర్ పైననే ఆధారపడి ఉన్నాయి. సింగూరు, నిజాంసాగర్ ఆయకట్టు స్థిరీకరణ, హైదరాబాద్ నగరానికి తాగునీటి సరఫరా కూడా మల్లన్నసాగర్ నుంచే చేయాలి. మల్లన్నసాగర్ (i) నైసర్గికంగా ఎత్తైన ప్రదేశంలో గోదావరి, కృష్ణా బేసిన్ల రిడ్జ్ పై ఉండడం (ii) గోదావరి, కృష్ణా నది బేసిన్ల పరీవాహక ప్రాంతాల మధ్యగల ప్రదేశం (watershed) కావడం ప్రాధాన్యత సంతరించుకున్నది. ఇక్కడ 557 మీటర్ల ఎఫ్ఆర్ఎల్ వద్ద నీటిని నిలువ చేస్తే అక్కడి నుండి స్వంత ఆయకట్టు 1.25 లక్షల ఎకరాలతో పాటుగా, కాళేశ్వరం ప్రాజెక్టులో కీలకమైన బ్యాలెన్సింగ్ రిజర్వాయర్ గా ఎగువకు నీటి సరఫరా చేయడంతో పాటుగా, చుట్టూ అన్నీ వైపులనున్న స్కీంలకు గ్రావిటీ ద్వారా నీటిని అందించి ఆదుకోవచ్చు. నల్లగొండ జిల్లా బస్వాపూర్ (11.39 టిఎంసి), గంధమల్ల (9.87 టిఎంసి) రిజర్వాయర్ల కింది ఆయకట్టు, మెదక్ జిల్లా కొండపోచమ్మసాగర్ రిజర్వాయరు (15 టిఎంసి) కింద అయకట్టు, ఉస్మాన్ సాగర్, హిమాయత్ సాగర్ త్రాగునీటి జంట జలాశయాలకు, ప్రస్తుత ప్రభుత్వం ప్రతిపాదిస్తున్న మూసీ ప్రక్షాళనకు, హల్దివాగు, తద్వారా మంజీరా నది ద్వారా నిజాంసాగర్ జలాశయానికి, ప్రత్యేక లింక్ ద్వారా సింగూర్ జలాశయానికి నీటి సరఫరా మల్లన్నసాగర్ నుండే జరగనున్నది. ఇవన్నీ ఒకసారి మల్లన్నసాగర్ కు లిఫ్ట్ చేసినాక గ్రావిటి ద్వారానే ఇవ్వవచ్చు. మల్లన్నసాగర్ వద్ద నిల్వ చేసుకుంటే వీటన్నింటికి అవసరాన్ని బట్టి సరఫరా చేయడానికి వెసులుబాటు ఉంటుంది. కాళేశ్వరం ప్రాజెక్టులో మల్లన్నసాగర్ మాతృ జలాశయం (Mother Reservoir). అందుకు 50 టిఎంసిల నీటి సామర్థ్యం అత్యంత అవసరం. ఇది సాంకేతికంగా హేతుబద్ధమైన నిర్ణయమే అని నిపుణులు భావిస్తున్నారు. కృష్ణా గోదావరి నదుల వాటర్ షెడ్ వద్ద మల్లన్న సాగర్ ఉన్నందున కృష్ణా పరీవాహక ప్రాంతాలకు కూడా గ్రావిటీ ద్వారా నీటిని అందించడం జరుగుతుంది. ఈ కీలకమైన అంశాన్ని మేధావులు, బుద్ధిజీవులు, సామాన్య ప్రజలు, రైతాంగం గమనించవలసిన అవసరం ఉన్నది.

**మల్లన్నసాగర్ ముంపుపై విమర్శ సబబేనా ?** :

50 టిఎంసిల మల్లన్నసాగర్ రిజర్వాయర్ ముంపు గురించి కూడా చాలా చర్చ జరుగుతున్నది. ముంపు లేకుండా ప్రాజెక్టులను ఈ భూమ్మీద నిర్మించడం ఎట్లానో వారు తెలియజేస్తే మంచిది. గతంలో ఉమ్మడి రాష్ట్రంలో ప్రభుత్వాలు నిర్మించిన ప్రాజెక్టుల ముంపుని మల్లన్నసాగర్ ముంపుని పోల్చి చూసినప్పుడు మల్లన్నసాగర్ ఎంత జాగ్రత్తగా డిజైన్ చేసిందో మనకు అర్థమవుతది. నిల్వ సామర్థ్యంలో మల్లన్నసాగర్ కంటే అవి చాలా చిన్నవే అయినా ముంపు గ్రామాలు, నిర్వాసితుల జనాభాలో మల్లన్నసాగర్ కంటె చాలా ఎక్కువే. ఈ కింది పట్టికలో ఉమ్మడి రాష్ట్రంలో నిర్మించిన ప్రాజెక్టుల ముంపు, మల్లన్నసాగర్ ముంపు వివరాలను పొందు పరచడం జరిగింది.

| రిజర్వాయర్ | టిఎంసిలు | ఆయకట్టు | ముంపు గ్రామాలు | కుటుంబాలు | ఎకరాలు |
|---|---|---|---|---|---|
| పులిచింతల | 45 | 0 | 28 పూర్తి<br>4 పాక్షికం | 12,000 | 13,936 |
| ఎల్లంపల్లి | 20 | 1.78 లక్షలు | 19 పూర్తి<br>2 పాక్షికం | 14,779 | 13,403 |
| మిడ్ మానేరు | 25.8 | 2 లక్షలు | 11 పూర్తి<br>7 పాక్షికం | 25,903 | 16,000 |
| పాలమూరు–రంగారెడ్డి (జూరాల) | 115<br>3 రిజర్వాయర్లు | 10 లక్షలు | 32 గ్రామాలు<br>14 తండాలు | – | 47,236 |
| పాలమూరు–రంగారెడ్డి (శ్రీశైలం) | 92.5<br>8 రిజర్వాయర్లు | 12.30 లక్షలు | 6 గ్రామాలు<br>33 తండాలు | 2,756 | 30,913 |
| డిండి | 23<br>(5 రిజర్వాయర్లు) | 3.5లక్షలు | 8 హాబిటేషన్స్ | 510 | 15,000 |
| మల్లన్న సాగర్ | 50 | 10.50 లక్షలు | 8 గ్రామాలు<br>5 హామ్లెట్స్ | 5,434 | 19,963 |

పై పట్టికను పరిశీలించినప్పుడు మల్లన్నసాగర్ రిజర్వాయర్ ముంపు గురించి చేస్తున్న ఆందోళనకు విశ్వసనీయత లేదని స్పష్టమవుతున్నది. పై పట్టికలోని చివరి మూడు ప్రాజెక్టులు తెలంగాణ ఏర్పడిన తర్వాత రీ డిజైన్ చేసినవి. ఆ పైన ప్రాజెక్టులు ఉమ్మడి రాష్ట్రంలో చేసినవి. ప్రాజెక్టుల ముంపుపై కెసిఆర్ ప్రభుత్వం ఎంత జాగరూకతతో వ్యవహరించిందో తెలిసిపోతున్నది.

ప్రపంచంలో నిర్మించే ఏ ప్రాజెక్టులోనైనా ముంపు బాధితులు ఉంటారు. కన్న ఊరిని వదిలిపెట్టి పోవడం నిర్వాసితులకు కడుపుకోతనే. కాదనలేము. అయితే మెదక్, నల్లగొండ లాంటి కరువు పీడిత ప్రాంతాలకు రెండు పంటలకు సాగునీరు, ఏడాది పొడుగునా తాగునీరు సరఫరా చేయడానికి పెద్ద జలాశయం అవసరం. శర వేగంగా విస్తరిస్తున్న, తెలంగాణ రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు వెన్నెముకగా ఉన్న రాజధాని నగరం హైదరాబాద్. జాతీయ, అంతర్జాతీయ పెట్టుబడులు హైదరాబాద్ నగరానికి వస్తున్నాయి. విస్తరిస్తున్న హైదరాబాద్ నగరానికి, పరిశ్రమలకు రాబోయే వందేళ్ల వరకు నీటి సరఫరాకు ఇబ్బంది రాకుండా ఉండడానికి కాళేశ్వరంలో 30 టిఎంసిలు, పరిశ్రమలకు 16 టిఎంసిలు మొత్తం 46 టిఎంసిల నీటిని కేటాయించడం జరిగింది. తెలంగాణ రాష్ట్ర విస్తృత ప్రయోజనాల రీత్యా మల్లన్నసాగర్ 50 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో నిర్మించడం జరిగింది. మల్లన్నసాగర్ నిర్వాసితులకు కాళేశ్వరం ప్రాజెక్టులోనే అత్యధిక నష్ట పరిహారం ఎకరానికి 6 నుంచి 13 లక్షలు చెల్లించడం జరిగింది. గజ్వేల్ పట్టణానికి సమీపంలో అన్ని సౌకర్యాలతో నిర్మించిన పునరావాస కాలనీలో అర్హులు అందరికీ అన్ని హక్కులు కల్పిస్తూ 250 గజాల ప్లాట్‌లో డబుల్ బెడ్‌రూం ఇల్లు ఇవ్వడం జరిగింది.

## మల్లన్నసాగర్ లో 50 టిఎంసిల నీటి నిల్వ వలన భూకంపాలు వస్తాయా ?

టిజెఎసి వారు గతంలో "Kaleshwaram Lift Irrigation Project -- Will It Benefit Telangana?" పేరుతో విడుదల చేసిన నివేదికలో మల్లన్నసాగర్ జలాశయం ప్రాంతంలో పగుళ్ళ గురించి ప్రస్తావించి ఉన్నారు. పగుళ్ళు ఉన్న ప్రాంతంలో 50 టిఎంసి జలాశయాన్ని ఎట్లా నిర్మిస్తారని ప్రశ్నించారు. 50 టిఎంసిల నీటిని నిలిపినందున ఆ బరువుకు భూకంపాలు రావచ్చునని సిద్ధాంతాలు వండి వార్చినారు. అందుకు మహారాష్ట్రలో నిర్మించిన కోయ్నా డ్యాంని ఉదాహరణగా చూపినారు. పగుళ్ళపై సమగ్ర అధ్యయనం జరపాలని, అంత వరదాక ప్రాజెక్టు నిర్మాణానికి టెండర్లు పిలవద్దని, భూసేకరణ చెయ్యవద్దని అన్నారు. మల్లన్నసాగర్ విమర్శకులు చేసే వాదన ఏమిటంటే ... సాధారణంగా డ్యాంలని నదీ ప్రవాహానికి అడ్డంగా నిర్మిస్తారు. కానీ ఇక్కడ మాత్రం కూడెల్లివాగుకు సమాంతరంగా నిర్మిస్తున్నారు. దీని వలన మట్టి కట్ట నుంచి ఎక్కువ నీరు బయటకు వచ్చి చుట్టుపక్కల ప్రాంతాల్లో భూమి బురద భూమిగా (water logging) మారుతుంది. మల్లన్నసాగర్ డ్యాం నిర్మిస్తున్న ప్రాంతంలో భూగర్భంలో డ్యాంకు సమాంతరంగా పగుళ్ళు (Lineaments) కనిపిస్తున్నాయి. డ్యాంలో 40 నుంచి 60 మీ ఎత్తులో నీరు నిలచి ఉంటుంది కనుక ఈ నీటి బరువుకి భూగర్భంలో ఉన్న పగుళ్ళు మరింత వెడల్పు అయి ఎక్కువ నీరు బయటకు పోతుంది. ఇది క్రమంగా మట్టికట్ట కొట్టుకుపోవడానికి దారితీస్తుంది. భూకంపాలు కూడా రావచ్చునని, డ్యాం బ్రేక్ జరిగి దాంతో లక్షలాది మంది ప్రజలు ఆస్తి, ప్రాణ నష్టానికి గురి అవుతారు. అందుకని డ్యాం నిర్మాణ స్థలంపై మరింత పరిశోధన అవసరం.. ఇవీ వారి వాదనలు.

వారు ఈ రకమైన నిర్ధారణకు ఏ భూభౌతిక పరిశోదనల ఆధారంగా వచ్చినారో ఎక్కడ పేర్కొనలేదు. ఇది కూడా వారి ఊహాగానమే తప్ప శాస్త్రీయ పరిశోధనపై ఆధారపడి చేసిన నిర్ధారణ కాదు. వారు చెప్పినట్లు కూడెల్లివాగు మల్లన్నసాగర్ డ్యాంకు బయట నుంచి సాగి పోతున్నది. డ్యాంలైన్ కి అతి దగ్గరగా ఉన్నప్పుడు దూరం 300 మీటర్లు ఉంటుంది. అది కూడా 34 కి మీ పొడవున ప్రవహించే కూడెల్లివాగుకు ఈ స్థితి 5 కిమీ మాత్రమే ఉంటుంది. దీని వలన మల్లన్నసాగర్ డ్యాంకు ఏ ప్రమాదమూ లేదు. డ్యాంని డిజైన్ చేసేటప్పుడు నీటి ఒత్తిడితో పాటు భూకంపాల నుండి విడుదల అయ్యే శక్తిని కూడా పరిగణనలోకి తీసుకుంటారు. డ్యాం నిర్మించేటప్పుడు పునాది (COT -- Cut Off Trench) తవ్వుతారు. సమగ్రమైన భూభౌతిక పరిశోధనల అనంతరం సిఒటి ఎంత లోతుకు తవ్వాలో నిర్ధారిస్తారు. తవ్విన పునాదిలో నీటిని అతి తక్కువగా పీల్చుకునే గుణం కలిగిన మట్టినే నింపుతారు. ఆ తర్వాత అటువంటి మట్టితోనే hearting / core zoneని నిర్మిస్తారు. 98% సాంద్రత (Proctor Density) వచ్చేవరకు రోలర్స్ తో తొక్కిస్తారు. ఆ తర్వాత పైన గ్రావెల్ మట్టితో మిగతా మట్టికట్టను నిర్మించడం జరుగుతుంది. నీరుండే వైపున గ్రానైట్ రాళ్ళతో తాపడం (Revetment) ఏర్పాటు చేస్తారు. సాగునీటి శాఖ ఇంజనీర్లు మట్టి పరీక్షలు నిర్వహించి మట్టికట్ట నిర్మాణానికి పనికి వచ్చే క్వారీలను నిర్ధారిస్తారు. క్వారీ మట్టిని పరీక్షలు నిర్వహించి మట్టి కట్ట నిర్మాణానికి పనికి వస్తుందో లేదో నిర్ధారిస్తారు. డ్యాం లైన్‌లో బోర్ హొల్ డాటాను సేకరించారు. ఈ డాటా ఆధారంగా సిఒటి ఎంత లోతుకు తవ్వాలో నిర్ధారించారు. మట్టికట్ట డిజైన్ ని నిర్ధారించారు. సిఒటి తవ్వకం మొదలైన తర్వాత బోర్ హొల్ డాటాతో సరిపోల్చుకుంటారు. ఎవైనా తేడాలు వస్తే డెజైన్లో మార్పులు జరుగుతాయి. ఇవన్నీ జియలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా వారి అనుభవజ్ఞులైన జియాలజిస్టుల పర్యవేక్షణలోనే జరుగుతాయి. మల్లన్నసాగరే కాదు అన్ని డ్యాంలు, బ్యారేజీలు, చిన్న చెరువుల నిర్మాణం కూడా ఇదే పద్ధతిలో జరుగుతుంది.

మల్లన్నసాగర్ మట్టికట్ట ఎత్తు 50 మీ పైనే ఉంటుంది కనుక ఇంజనీర్లు మరిన్ని జాగ్రత్తలు తీసుకున్నారు. దేశంలో ఇటువంటి ఎత్తైన మట్టికట్టల నిర్మాణం జరిగిన ప్రాజెక్టులకు వెళ్ళి అధ్యయనం చేసినారు. గతంలో

రాయలసీమలో నిర్మించిన బ్రహ్మంగారి మఠం జలాశయాన్ని సందర్శించి వచ్చినారు. ఈశాన్య భారత జల విద్యుత్ కార్పోరేషన్ వారు మిజోరంలో తురియల్ నదిపై నిర్మిస్తున్న తురియల్ డ్యాంను సందర్శించి వచ్చినారు. ఎత్తైన మట్టికట్ట వలన ఉత్పన్నం కాబోయే సాంకేతిక సమస్యలను అధ్యయనం చేసి వాటిని అధిగమించడానికి ఇంజనీర్లు అన్ని జాగ్రత్తలు తీసుకున్నారు.

ఇక డ్యాంకు సమాంతరంగా పగుళ్ళు కనిపిస్తున్నాయని నివేదికను వండి వార్చిన రచయితలు ఏ ఆధారంతో చెబుతున్నారో ప్రస్తావించలేదు. మల్లన్నసాగర్ ముంపు ప్రాంతం మధ్యలో ఉన్న వేములఘాట్ గ్రామంలో ఉన్న కోమటి చెరువు, దాని కింద ఉన్న నల్ల చెరువులో ఈ పగుళ్ళ కారణంగా పెద్ద ఎత్తున నీరు బయటకు పోయి చెరువుల్లో నీటి నిల్వ వేగంగా తగ్గిపోయిన అనుభవాలు గతంలో ఎప్పుడూ లేవు. కాబట్టి ఇది ఊహాగానమే, అనుమానమే తప్ప వాస్తవం కాదు. వారు ఏ శాస్త్రీయ ఆధారాలతో పగుళ్ళు ఉన్నాయని తేల్చినారో ప్రజలకు వివరించలేదు. సాగునీటి శాఖ ఇంజనీర్లు ఏ ప్రాజెక్టునైనా మొదట సర్వే ఆఫ్ ఇండియా వారి చిత్ర పటాల (Topo Sheets) పైననే నిర్ధారిస్తారు. డ్యాం ఎత్తు, డ్యాం నిల్వ సామర్థ్యం, ముంపు ప్రాంతం ఎంత, ఏ ప్రాంతాలు ఆయకట్టు పరిధిలోకి వస్తాయి, కాలువల మార్గం, డ్యాం లైన్ తదితర ప్రాథమిక సాంకేతిక అంశాలు అన్నీ కూడా ఈ టోపో షీట్ల పైననే నిర్ధారిస్తారు. ఇప్పుడు వాటికి తోడూ గూగుల్ ఎర్త్ సాఫ్ట్ వేర్‌ని కూడా వినియోగిస్తున్నారు. ఆ తర్వాత సమగ్ర సర్వే నిర్వహించి ఆ సాంకేతిక అంశాలని స్థిరపరుస్తారు. ఆ సమయంలో స్థానిక పరిస్థితులకు అనుగుణంగా ప్రాజెక్టు ప్రతిపాదనల్లో అవసరమైన మార్పులు, చేర్పులు జరుగుతాయి. మల్లన్నసాగర్ జలాశయం విషయంలో కూడా ఇదే పద్ధతిలో ఇంజనీర్లు ప్రాజెక్టు ప్రతిపాదనల్ని రూపొందించి అధ్యయనం చేసినారు. కేంద్ర ప్రభుత్వ సంస్థ వాప్కోస్ చేత నడక సర్వే (Reconnaisance), LIDAR సర్వే నిర్వహించింది ప్రభుత్వం. వారి సర్వేలో ఎక్కడా జలాశయం ప్రాంతంలో గాని, కూడెల్లివాగు పరివాహక ప్రాంతంలో గానీ పగుళ్ళు ఉన్నట్టు తేలలేదు. Reconnaisance సర్వేలో భూమి లోపల ఉన్న పగుళ్ళు కనబడవు అని విమర్శకులు పేర్కొన్నారు. మరి మల్లన్నసాగర్ విమర్శకులకు ఎక్స్ రే కళ్ళు ఉన్నాయా? ఏ భూభౌతిక పరీక్షలు నిర్వహించి వారు ఈ పగుళ్ళను కనుగొన్నారో వారు ప్రజలకు తెలపలేదు.

డ్యాం ముంపు ప్రాంతంలో పగుళ్ళు ఉన్నదీ లేనిదీ పరిశీలించడానికి ప్రభుత్వానికి ఎవరు చెప్పినా చెప్పక పోయినా డ్యాం నిర్మిస్తున్న స్థలాలలో భూభౌతిక పరీక్షలు నిర్వహించడం ఒక తప్పనిసరి ప్రక్రియ. భూమి లోపల పగుళ్ళని రూల్ అవుట్ చేయడానికి మల్లన్నసాగర్ జలాశయం ప్రాంతంలో పూణేలో ఉన్న సెంట్రల్ వాటర్ & పవర్ రీసర్చ్ స్టేషన్ (CWPRS) వారిచే సాగునీటి శాఖ సమగ్ర సర్వే జరిపించింది. వారి పరిశోధనల్లో ఎటువంటి పగుళ్ళు లేవని తేలింది. డ్యాం నిర్మిస్తున్న స్థలంలో భూమి లోపలి పొరలు డ్యాం నిర్మాణానికి అనువుగా ఉన్నాయని వారు తెల్చినారు. ఇక దేశంలో భూకంపాల చరిత్రను పరిశీలిస్తే తెలంగాణలో భూకంపాలు వచ్చిన దాఖలాలు లేవు. హిమాలయ పర్వత ప్రాంతం, వింధ్య పర్వత శ్రేణులు, ఈశాన్య రాష్ట్రాలు, తూర్పు, పశ్చిమ కనుమలు దేశంలో భూకంపాలకు నిలయంగా ఉన్నాయి. వింధ్య పర్వతాలకు దక్షిణాన ఉన్న దక్కన్ పీఠభూమి లోపల గట్టి రాతి పొరలతో నిర్మితమైన సబ్ స్ట్రాటా ఉన్నదని భూభౌతిక శాస్త్రవేత్తలు నిర్ధారించినారు. కాళేశ్వరం ప్రాజెక్టులో భాగంగా తవ్వుతున్న పంపు హౌజ్ లు, సొరంగాల నుంచి బయటపడుతున్న గట్టి సాంద్రత కలిగిన గ్రానైట్ రాళ్ళు ఇదే విషయాన్ని నిర్ధారించాయి.

భూకంపాలని అధ్యయనం చేసే శాస్త్రవేత్తలు దేశాన్ని మొత్తం 5 జోన్లుగా వర్గీకరించినారు. దక్కన్ ప్రాంతంలో భూకంపాలు వచ్చే అవకాశాలు లేనందున ఈ ప్రాంతాన్ని భూకంప ప్రాంతాల వర్గీకరణ చేసినప్పుడు అతి

తక్కువ అవకాశాలు ఉన్న జోన్ 1,2,3 లో చేర్చినారు. అందులో 80% తెలంగాణా జోన్ 1,2 లో ఉంటే 20 % జోన్ 3 లో ఉన్నది. అత్యధిక భూకంపాలు సంభవించే అవకాశాలు జోన్ 4, 5 లోనే ఉన్నాయి. దేశంలో భూకంపాల చరిత్ర కూడా అదే నిరూపిస్తున్నది. ఇక మల్లన్నసాగర్ నిర్మించబోతున్న సిద్ధిపేటజిల్లా జోన్ 2 లో ఉన్నదన్న సంగతి ప్రజలు గమనించాలి. (పటాన్ని చూడగలరు)

ఇకపోతే మహారాష్ట్రాలో సతారా జిల్లాలో నిర్మించిన కోయ్నా డ్యాం పగుళ్ళు ఉన్న ప్రాంతంలో నిర్మించినందున నీటి బరువుకు అక్కడ భూకంపం వచ్చిందని నివేదిక రచయితలూ, ఇతర మల్లన్నసాగర్ వ్యతిరేకులు పేర్కొన్నారు. అక్కడ భూమి పొరల్లో స్వల్ప కదలికలు ఏర్పడిన మాట వాస్తవమే కాని ఆ కదలికలు నీటి నిల్వ కారణంగానే ఏర్పడిందని స్పష్టమైన నిర్ధారణకు శాస్త్రవేత్తలు రాలేదు. కోయ్నా డ్యాం పశ్చిమ కనుమల్లో ఉన్నది. కోయ్నా డ్యాం ఉన్న ప్రాంతం జోన్ 4 లో ఉన్నందున భూమి లోపల పొరల్లో కదలికల కారణంగా భూకంపాలు వచ్చే అవకాశం ఎక్కువే. అయితే ఆ ప్రాంతంలో 1967 వచ్చిన భూ కదలికల కారణంగా కోయ్నా డ్యాం బ్రేక్ కాలేదు. చిన్నపాటి పగుళ్ళు మాత్రమే వచ్చినాయి. ఆ పగుళ్ళను సిమెంట్ గ్రౌటింగ్ ద్వారా మూసివేసినారు. ఏ విపత్తు సంభవించలేదు. కోయ్నా డ్యాం నిశ్చలంగా 50 ఏండ్లుగా నిలబడి ఉన్నది. 1964 లో నిర్మాణం పూర్తి చేసుకున్న కోయ్నా డ్యాం 93 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగి ఉన్నది. మహారాష్టాకు 1960 మెగావాట్ల జల విద్యుత్‌ను సరఫరా చేస్తున్నది. కోయ్నా డ్యాం ఉన్న పరిస్థితిని మల్లన్నసాగర్ ఉన్న భూభౌతిక పరిస్థితులకు పోల్చి ఇది ప్రమాదకరమైనదని తేల్చి ప్రజలని అయోమయంలోనికి నెట్టివేయడం అసంబద్ధం.

* * * * *

# 8

## నది లేని చోట జలాశయాలు లేవా ?

డ్యాంలని నదికి అడ్డంగా నిర్మించాలే తప్ప ఈ రకంగా నది లేనిచోట నిర్మించిన దాఖలాలు దేశంలో ఎక్కడా లేవు అంటున్నారు మల్లన్నసాగర్ విమర్శకులు. ఇందులో కొంత మంది ఇంజనీర్లు ఉన్నారు, ఇంజనీర్లు కానివారు కూడా ఉన్నారు. ఎక్కడో ఎందుకు ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోనే నది లేని చోట, లేదా చిన్నవాగులపై అవి సమకూర్చే నీటి పరిమాణం (Yeild) కంటే ఎన్నో రేట్లు ఎక్కువ నిల్వ సామర్థ్యంతో నిర్మించిన జలాశయాలు రాయలసీమలో ఉన్నాయి. ఇంతకు ముందు పేర్కొన్న బ్రహ్మంగారి మఠం జలాశయం ఆ కోవలోనిదే. వాటి వివరాలు కింద పేర్కొంటున్నాను.

కండలేరు – 68 టిఎంసిలు,

గోరకల్లు – 10 టిఎంసిలు,

వెలిగొండ – 41 టిఎంసిలు,

వెలుగోడు –17 టిఎంసిలు,

బ్రహ్మంగారి మఠం – 17 టిఎంసిలు,

అవుకు – 7 టిఎంసిలు,

అలుగునూరు – 3 టిఎంసిలు.

ఇవన్నీ నదులు లేని చోట నిర్మించినవి కావా? అవసరమైతే కృత్రిమ జలాశయాలు నిర్మించుకోవాలంటూ సిడబ్ల్యుసి రాష్ట్ర ప్రభుత్వానికి సూచన చేసింది. ఎత్తిపోతల పథకాలలో పెద్ద జలాశయాల నిర్మాణం అత్యంత అవసరం. సిడబ్ల్యుసి సూచనల మేరకే కాళేశ్వరం ప్రాజెక్టులో ఆన్ లైన్ జలాశయాల నిల్వ సామర్థ్యాన్ని 16 టిఎంసిల నుండి 141 టిఎంసిలకు పెంచుకోవడం జరిగింది. అందులో భాగంగానే మల్లన్నసాగర్ నిల్వ సామర్థ్యాన్ని 50 టిఎంసిలతో రీడిజైన్ చేయడం ప్రాజెక్టు అవసరాల రీత్యా తప్పనిసరి అయ్యింది. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాలు తెలంగాణ ఎత్తిపోతల పథకాల్లో తగినంత నిల్వ సామర్థ్యం ఏర్పాటు చేయాలన్న అంశంపై ద ృష్టి పెట్టలేదు. ఉమ్మడి రాష్ట్రం ప్రతిపాదించిన ప్రాణహిత చేవెళ్ళలో నిల్వ సామర్థ్యం 16 టిఎంసిలు, కల్వకుర్తిలో 4 టిఎంసిలు, నెట్టెంపాడులో 11 టిఎంసిలు, భీమాలో 8.50 టిఎంసిలు, దేవాదులలో 8 టిఎంసిలు, ఎ ఎం ఆర్ పి లో 13 టిఎంసిలు మాత్రమే ఉన్నాయి. నీటి నిల్వ పెంచుకోవలసిన ఆవశ్యకతను గుర్తించిన ఆనాటి ముఖ్యమంత్రి కెసిఆర్ తెలంగాణా ఏర్పాటు తర్వాత ప్రాజెక్టుల రీ ఇంజనీరింగ్ లో భాగంగా కాళేశ్వరం ప్రాజెక్టులో 141 టిఎంసిలు, పాలమూరు రంగారెడ్డి లో 68 టిఎంసిలు, డిండీలో 25.56 టిఎంసిలు, సీతమ్మసాగర్ బ్యారేజిలో 36 టిఎంసిల, కడెం నదిపై కుప్టి ప్రాజెక్టులో 5.36 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాలను ముఖ్యమంత్రి ప్రతిపాదించడం జరిగింది.

కాళేశ్వరం ప్రాజెక్టులో ప్రతిపాదించిన ఆయకట్టులో 66 % ఆయకట్టు అవసరాలు, హైదరాబాద్

నగర తాగునీటి అవసరాలు, నిజాంసాగర్, సింగూరు జలాశయాల స్థిరీకరణ మల్లన్నసాగర్ జలాశయమే తీర్చాలి. నది లేని చోట డ్యాం నిర్మిస్తున్నారని విమర్శిస్తున్న ఇంజనీర్లు, ఇంజనీర్లు కాని వారు రాయలసీమలో పైన పేర్కొన్న జలాశయాలను జలయజ్ఞంలో నిర్మిస్తున్నప్పుడు కిక్కురుమనలేదెందుకు? ఇప్పుడు అటువంటిదే మల్లన్నసాగర్ జలాశయం నిర్మిస్తుంటే తెలంగాణ ప్రభుత్వం ఎదో నేరం చేస్తున్నట్లు ప్రచారం చేస్తున్నారు. తెలంగాణాకు జీవధారగా మారనున్న కాళేశ్వరం ప్రాజెక్టుని వరుస కుట్రలతో అడ్డుకునే ప్రయత్నాలను వమ్ము చేసి ప్రాజెక్టు లక్ష్యాలను సాధించే కృషిలో తెలంగాణా ఇంజనీర్లు ఇంజనీర్లు తమ మేధస్సును, చెమటను ధారపోసి ప్రాజెక్టు నిర్మాణాన్ని పూర్తి చేసినారు. కెసిఆర్ ప్రభుత్వం నిధులు సమకూర్చి ప్రాజెక్టు త్వరితగతిన పూర్తి కావడానికి దోహదం చేసింది.

**'ప్రపంచంలోప ప్రాజెక్టు కింద నీటి నిల్వ కోసం అధిక సామర్థ్యం కలిగిన రిజర్వాయర్లు లేవు. రెండో పంటకు నీరందించే అధికారిక పద్ధతి దేశంలో లేదు. ఆరుతడి పంటలకు మాత్రమే అధికారికంగా నీరందిచవచ్చు' అన్న వాదనలో నిజమెంత ?**

కాళేశ్వరం ప్రాజెక్టులో మల్లన్నసాగర్ నిల్వ సామర్థ్యాన్ని 50 టిఎంసిలు నిర్ధారించినప్పుడు కొంత మంది ఈ రకమైన వాదనలు లేవనెత్తారు. ఇది ఒక సాంప్రదాయిక తప్పుడు అవగాహన. ప్రపంచంలో ఎక్కడా లేనిది తెలంగాణలో ఉండకూడదా? ఇది విచిత్రమైన వితండ వాదన. ప్రపంచ దేశాలు సాహసించని మహా నిర్మాణాలు చైనాలో ఉన్నాయి. మరి తెలంగాణలో ఉంటె అభ్యంతరం దేనికి? నీరు వచ్చినప్పుడే నిల్వ చేసుకోవడానికి రాయలసీమలో పెద్ద రిజర్వాయర్లు నిర్మించారని పైన చెప్పాను. అనేక దేశాలు అటువంటి మహా జలాశయాలను నిర్మించారు. నైలు నదిపై ఈజిప్ట్ ప్రభుత్వం 75% విశ్వసతనీయతతో లభ్యమయ్యే నీటి కంటే ఐదింతల ఎక్కువ నిల్వ సామర్థ్యం (4660 టి.ఎం.సి.) కలిగిన హై ఆస్వాన్ డ్యాంను నిర్మించింది. నైలు నదికి వస్తే అత్యధిక వరద, రాకపోతే వరుస కరువులు. ఆస్వాన్ డ్యాం నిర్మాణం తర్వాత వరదలు, కరువులు నివారించబడినాయి. నాలుగేళ్ళు వానలు లేకపోయినా ఆస్వాన్ డ్యాంలో నిల్వ ఉండే నీరు ఈజిప్ట్ వ్యవసాయ అవసరాలను, విద్యుత్ అవసరాలను తీర్చగలుగుతుంది. ఆస్వాన్ డ్యాం నిర్మాణం తర్వాత ఈజిప్ట్ ఆర్థిక ముఖచిత్రమే మారిపోయింది.

తెలంగాణలో కాళేశ్వరం ప్రాజెక్టులో కూడా 141 టిఎంసిల నిల్వ సామర్థ్యం కలిగిన జలాశయాలను నిర్మించడం జరుగుతున్నది. భారత దేశం రుతుపవనాల మీద ఆధారపడిన దేశం. 4 నెలలు మాత్రమే నదుల్లో వేల టిఎంసిల నీరు ప్రవహిస్తుంది. ఆ తర్వాత నదులు ఎండిపోతాయి. ఈ నీటిని నిల్వ చేసుకోకపోతే మిగతా 8 నెలలకు వ్యవసాయానికి, తాగునీటికి, పారిశ్రామిక అవసరాలకు నీటిని ఎక్కడ నుంచి తెస్తాము? తెలంగాణా భౌగోళికతను చూసినప్పుడు గోదావరి 70 నుంచి 150 మీటర్ల తక్కువ ఎత్తులో ప్రవహిస్తుంది. వ్యవసాయ యోగ్యమైన భూములు 200 నుంచి 620 మీటర్ల ఎత్తున ఉంటాయి. ఈ భూములకు నీరు అందించాలంటే ఎత్తిపోతలు తప్ప మరో మార్గం లేదు. ఇది అందరూ అంగీకరించేదే. అయితే ఎత్తిపోతల పథకాలను ఖర్చు ఎక్కువని వ్యతిరేకిస్తారు. ఖర్చు ఎక్కువైనా ఎత్తిపోతలు తప్పవు. గుండె జబ్బుకు చికిత్స ఖర్చుతో కూడుకున్నదే. ఖర్చు ఎక్కువ అని ఆపరేషన్ చేసుకోకుండా ఉంటామా? అది ఖర్చుతో నిమిత్తం లేని అవసరం. అట్లే ఖర్చు ఎక్కువ అని ప్రాజెక్టులు కట్టకుండా తెలంగాణా ప్రాంతాన్ని కరువు పీడిత, ఫ్లోరైడ్ పీడిత ప్రాంతంగా, రైతు ఆత్మహత్యల ప్రాంతంగా, వలసల ప్రాంతంగా ఉండిపోనివ్వాలా?

తెలంగాణా రైతులకు రెండు పంటలకు నీరు పొందే అర్హత లేదా? ప్రపంచంలో ఎక్కడా ఇంతటి భారీ ఎత్తిపోతల పథకాలు లేకపోయి ఉండవచ్చు. తెలంగాణాకు ఉన్న ప్రత్యేక భౌగోళిక పరిస్థితుల దృష్ట్యా ఇక్క భారీ ఎత్తిపోతల పథకాలు ఉంటాయి. ఎత్తిపోతల పథకాల నిర్మాణంలో తెలంగాణా దేశానికే కాదు ప్రపంచానికి కూడా మార్గనిర్దేశనం చేయగలిగే అనుభవాన్ని పొందింది. ఎలిమినేటి మాధవరెడ్డి, ఆలీసాగర్, గుత్పా, దేవాదుల, కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, కోయిల్ సాగర్, ఎల్లంపల్లి, గూడెం, సింగూరు, చౌటుపల్లి హనుమంత రెడ్డి లాంటి భారీ ఎత్తిపోతల పథకాలు ఎటువంటి సమస్యలు లేకుండా పని చేస్తున్నాయి. నిర్మాణంలో ఉన్న కాళేశ్వరం, పాలమూరు రంగారెడ్డి, డిండి, ఉదయ సముద్రం, చనాకా కొరాట, శ్రీరాంసాగర్ పునరుజ్జీవన పథకం, తుమ్మిళ్ళ ప్రాజెక్టులు కూడా ఎత్తిపోతల పథకాల నిర్మాణంలో మనకున్న అనుభవాన్ని వినియోగించుకొని స్వదేశీ డిజైన్లతో శర వేగంగా పురోగతిలో ఉన్నాయి. ఇవి పూర్తి అయిన తర్వాత తెలంగాణా ముఖచిత్రమే మారిపోతుంది. ఈ ప్రాజెక్టులు సరఫరా చేసే నీరు విలువైనదే. వాటిని పొదుపుగా వాడుకోవలసిన భాద్యత మన రైతాంగానిది. ప్రభుత్వం ఒక టిఎంసి నీటితో 18 నుంచి 20 వేల ఎకరాలను సాగు చేయగలిగే piped irrigation పద్దతిని కాళేశ్వరం ప్రాజెక్టులో నిజామాబాద్ జిల్లా  ప్యాకేజి పనుల్లో పైలట్ ప్రాజెక్టుగా చేపట్టింది. ఈ పైలట్ ప్రాజెక్టు యొక్క ఫలితాలను అధ్యయనం చేసి మిగతా జిల్లాల్లో కూడా ప్రవేశ పెట్టె ఆలోచన కెసిఆర్ ప్రభుత్వం చేసింది.

* * * * *

9

## కాళేశ్వరం ప్రాజెక్టు పనికి రాని ప్రాజెక్టు ..ఇది తిప్పిపోతల పథకం.. ఎత్తి పోసిన నీళ్లను తిరిగి సముద్రం లోకి వదిలేసే ఈ ప్రాజెక్టుతో ప్రజా ధనం వృధా అన్న విమర్శలు సరి అయినవేనా ?

కాళేశ్వరం ప్రాజెక్టులో గోదావరి జలాల ఎత్తిపోతల ప్రక్రియ ఎట్లా ఉంటుందో తెలియని వారు చేసే విమర్శ అది. కాళేశ్వరం ప్రాజెక్టులో 18.25 లక్షల కొత్త ఆయకట్టుతో పాటు, శ్రీరాంసాగర్, నిజాంసాగర్, సింగూరు, వరద కాలువ ప్రాజెక్టుల కింద, చెరువుల కింద ఉన్న 18.80 లక్షల ఎకరాల ఆయకట్టు స్థిరీకరణ కూడా ఉన్నదన్న సంగతి వారికి ఎరుక ఉన్నదో లేదో తెలియదు. కాళేశ్వరం ప్రాజెక్టు ఎత్తిపోతల ప్రక్రియలో మూడు మార్గాల ద్వారా నీటిని తరలించడం జరుగుతుంది. శ్రీరాంసాగర్ కు ప్రతీ మూడేండ్లకు ఒక్కసారి అన్నా వరద వస్తుందని 40 ఏండ్ల వరద చరిత్ర తెలుపుతున్నది. శ్రీరాంసాగర్ డ్యాం నిండితే వరద కాలువ ద్వారా మిడ్ మానేరుకు, కాకతీయ కాలువ ద్వారా దిగువ మానేరుకు, నదీ మార్గం ద్వారా ఎల్లంపల్లికి గ్రావిటీ ద్వారానే నీరు చేరుతుంది. 25 టిఎంసిల నీటిని నిల్వ చేయడానికి మిడ్ మానేరు జలాశయం 2019 నాటికి సిద్దం అయ్యింది. 20 టిఎంసిల ఎల్లంపల్లి, 24 టిఎంసిల దిగువ మానేరు జలాశయాలు ఇది వరకే పూర్తి అయి సిద్దంగా ఉన్నాయి. ఇప్పుడు మిడ్ మానేరు జలాశయంలో నీరు కాళేశ్వరం ఎత్తిపోతల ద్వారా నింపడం జరిగింది. అక్కడి నుండి మానేరు నది ద్వారా దిగువ మానేరు జలాశయానికి, అక్కడి నుండి కాకతీయ కాలువ ద్వారా కరీంనగర్, వరంగల్, మహబూబాబాద్ జిల్లాలో ఉన్న మొదటి దశ ఆయకట్టుకు, జనగామ, మహబూబాబాద్, సూర్యాపేట జిల్లాల్లో ఉన్న రెండో దశ ఆయకట్టుకు, చెరువులను నింపడానికి నీటిని తరలించడం జరుగుతున్నది.

శ్రీరాంసాగర్ కు వరద వచ్చినప్పుడు కాళేశ్వరం లింక్ 1 & 2 లో ఉన్న పంపులను తిప్పవలసిన అవసరం ఉండదు. శ్రీరాంసాగర్ కు వరద రాని సందర్భంలో, ఒక వేళ ఎల్లంపల్లికి నీరు వస్తే అప్పుడు లింక్ 1 (మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లికి) పంపులు తిప్పే అవసరం రాదు. లింక్ 2 లో(ఎల్లంపల్లి నుంచి మిడ్ మానేరు వరకు) ఉన్న రెండు భూగర్భ పంపుల ద్వారా మిడ్ మానేరుకు నీరు చేరుతుంది. మిడ్ మానేరు నుంచి పైన చెప్పినట్టు శ్రీరాంసాగర్ మొదటి దశ, రెండో దశ ఆయకట్టుకు నీరు సరఫరా అవుతుంది. అదే సమయంలో శ్రీరాంసాగర్ పునరుజ్జీవన పథకం ద్వారా వరద కాలువ రివర్స్ పంపింగ్ ద్వారా ఒక టిఎంసి నీరు శ్రీరాంసాగర్ జలాశయానికి చేరుతుంది. శ్రీరాంసాగర్‌లో ఏర్పడిన కొరత ఈ రివర్స్ పంపింగ్ ద్వారా తీరుతుంది. శ్రీరాంసాగర్ జలాశయంపై నిజామాబాద్, జగిత్యాల, పెద్దపల్లి జిల్లాల్లో ఆధారపడిన కాకతీయ కాలువ ఆయకట్టు (దిగువ మానేరు వరకు), నిజామాబాద్ జిల్లాలో ఉన్న లక్ష్మి కాలువ కింద ఉన్న ఆయకట్టు, నిర్మల్ జిల్లాలో ఉన్న సరస్వతి కాలువ ఆయకట్టు, అలిసాగర్, గుత్ప ఎత్తిపోతల పథకాల కింద నిజాంసాగర్ ఆయకట్టు, అటు నిర్మల్ జిల్లాలో ఉన్న కాళేశ్వరం ఆయకట్టుకు, నిర్మల్, నిజామాబాద్ జిల్లాల్లో ఉన్న చిన్న ఎత్తిపోతల పథకాల ఆయకట్టు, మిషన్ భగీరథ అవసరాలు ఈ రివర్స్ పంపింగ్ స్కీమ్ ద్వారా తీరుతాయి. రివర్స్ పంపింగ్ స్కీమ్ పనులు కూడా వేగంగా పూర్తి అయి వినియోగం లోనికి వచ్చాయి.

శ్రీరాంసాగర్, ఎల్లంపల్లి జలాశయాల్లో నీరు లేనప్పుడు, వరద రానప్పుడు మాత్రమే కాళేశ్వరం లింక్ 1 & 2 ఉన్న మొత్తం 5 పంప్ హౌజుల్లో ఉన్న పంపులను తిప్పడం జరుగుతుంది. అంటే లింక్ 1 లో మేడిగడ్డ నుంచి ఎల్లంపల్లికి, లింక్ 2 లో ఎల్లంపల్లి నుంచి మిడ్ మానేరుకు నీరు చేరుతుంది. అక్కడి నుంచి పైన చెప్పినట్టు దిగువమానేరు, కాకతీయ కాలువ ద్వారా శ్రీరాంసాగర్ ఆయకట్టుకు నీరు చేరుతుంది. గతంలో శ్రీరాంసాగర్ జలాశయంపై 13.66 లక్షల ఎకరాల మొదటి రెండో దశ ఆయకట్టు ఆధారపడేది. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. శ్రీరాంసాగర్ జలాశయంపై దిగువ మానేరు వరకు ఉన్న ఆయకట్టు మాత్రమే ఆధాపడుతుంది. దిగువ మానేరు కింద ఆయకట్టుకు కాళేశ్వరం నీరు మిడ్ మానేరు, దిగువ మానేరు ద్వారా అందుతుంది. ఇప్పుడు కాళేశ్వరం వచ్చినందున మొదటి దశకు, రెండో దశ ఆయకట్టుకు రెండు పంటలకు నికరంగా నీరు అందే పరిస్తితి ఏర్పడింది. ఎత్తిపోసిన నీళ్ళను ఎప్పటికప్పుడు పైన జలాశయాల్లోకి, కింద శ్రీరాంసాగర్ ఆయకట్టుకు, చెరువులను నింపడానికి పంపించడం జరిగింది. వరద వచ్చినప్పుడు పంపులు బందు పెట్టి వరద నీటినే నదిలోకి వదిలివేయడం జరిగింది. వరద నీటిని వదిలి పెట్టకుండా నిలుపుకోవడం సాధ్యం అవుతుందా ?

**ఇప్పటి వరకు కాళేశ్వరం ద్వారా ఎత్తి పోసిన టిఎంసిలు ఎన్ని? ఆ నీళ్ల ద్వారా తెలంగాణ కు జరిగిన లబ్ది ఎంత ?**

2022-23 వరకు కాళేశ్వరం ప్రాజెక్టులో ఎత్తిపోసిన గోదావరి జలాల వివరాలు :

మేడిగడ్డ నుంచి - 162.41 టిఎంసి

అన్నారం నుంచి - 172.86 టిఎంసి

సుందిళ్ళ నుంచి - 172.12 టిఎంసి

నంది పంప్ హౌజ్ నుంచి : 181. 70 టిఎంసి

గాయత్రి పంప్ హౌజ్ నుంచి - 179.41 టిఎంసి

కాళేశ్వరం కింద 18.25 లక్షల కొత్త ఆయకట్టుతో పాటు 18.82 లక్షల స్థిరీకరణ కూడా ఉందని విమర్శకులు మరచిపోతున్నారు. ఎత్తిపోసిన ఈ నీటితో కాళేశ్వరం ద్వారా సాధించిన ఆయకట్టు, స్థిరీకరణ వివరాలు ఇవి :

- అన్నపూర్ణ, రంగనాయకసాగర్, కొండపోచమ్మసాగర్ జలాశయాల కింద సిద్దిపేట, దుబ్బాక, గజ్వేల్, సిరిసిల్లా, హుస్నాబాద్ నియోజకవర్గాల్లో 817 చెరువులు, 66 చెక్ డ్యాంలను నింపడం జరిగింది. ఈ చెరువులు, చెక్ డ్యాంలు, కాళేశ్వరం కాలువల కింద సుమారు 2,48,375 ఎకరాలు కొత్తగా సాగులోకి వచ్చాయి.
- కాళేశ్వరం ప్రాజెక్టు ద్వారా 2022-23 నాటికి సుమారు 2200 చెరువులను నింపడం జరిగింది. వీటి కింద సుమారు 2 లక్షల ఎకరాలు స్థిరీకరణ చెందినాయి.
- ఇక శ్రీరాంసాగర్, నిజాంసాగర్ ప్రాజెక్టుల కింద స్థిరీకరణ చెందిన ఆయకట్టు 2022-23 నాటికి రెండు పంటలకు కలిపి 16,99,356 ఎకరాలకు చేరింది.

- గతంలో శ్రీరాంసాగర్ జలాశయంపై 13.66 లక్షల ఎకరాల మొదటి, రెండో దశ ఆయకట్టు ఆధారపడేది. రెండో దశ ఆయకట్టుకు కాలువలు తవ్వి 15 ఏండ్లు అయినా ఉమ్మడి రాష్ట్రంలో నీరు ఇవ్వలేని పరిస్థితి ఉండేది. ఇప్పుడు ఆ పరిస్థితి లేదు. కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం తర్వాత శ్రీరాంసాగర్ జలాశయంపై దిగువ మానేరు వరకు ఉన్న ఆయకట్టు మాత్రమే ఆధాపడుతుంది.
- దిగువ మానేరు కింద ఆయకట్టుకు కాళేశ్వరం నీరు మిడ్ మానేరు, దిగువ మానేరు ద్వారా అందుతున్నది. శ్రీరాంసాగర్ మొదటి దశకు, రెండో దశ ఆయకట్టుకు రెండు పంటలకు నికరంగా నీరు అందే పరిస్థితి ఏర్పడింది. శ్రీరాంసాగర్ కాలువల ఆధునీకరణ కోసం ప్రభుత్వం 2000 కోట్లు మంజూరు చేసి పనులని పూర్తి చేసింది. కాళేశ్వరం నీరు వచ్చేనాటికి ఈ కాలువల పనులు పూర్తి చేయాలని ప్రభుత్వం ఇంజనీర్లను ఆదేశించి పనులు పూర్తి చేయించింది.
- దిగువ మానేరు కింద కరీంనగర్, వరంగల్ అర్బన్, వరంగల్ రూరల్, మహబూబాబాద్, జనగామ, మహబూబాబాద్, సూర్యాపేట జిల్లాల్లో ఆయకట్టుకు రెండు పంటలకు నీరు అందుతున్నది. చెరువులు, చెక్ డ్యాంలు నిండుతున్నవి. ఇది గతంలో ఎన్నడూ జరగనిది. ఇది కాళేశ్వరం ఫలితమే.
- ఇదే పరిస్థితి నిజాంసాగర్ ఆయకట్టులో కూడా చూసాము. కొండపోచమ్మసాగర్ జలాశయం ద్వారా హల్దీ వాగులో నీళ్ళని వదిలి నిజాంసాగర్ కు నీటిని తరలించడం జరిగింది. నిజాంసాగర్ కింద 2 లక్షల ఎకరాలు స్థిరీకరణకు నోచుకున్నది. శ్రీరాంసాగర్, నిజాంసాగర్ ఆయకట్టు రైతాంగం గత నాలుగేళ్లుగా కాళేశ్వరం ప్రాజెక్టు ప్రయోజనాలను అనుభవిస్తున్నారు.
- మొత్తం మీద కొత్త ఆయకట్టు, స్థిరీకరణ కలుపుకొని కాళేశ్వరం ప్రాజెక్టు ద్వారా 20.33 లక్షల ఎకరాలకు సాగునీరు రెండు పంటలకు అందింది. కానీ కాళేశ్వరం ప్రాజెక్టులో ఒక భాగమైన స్థిరీకరణను ప్రస్తావించకుండా, లేదా దాచిపెట్టి 93 లక్షల కోట్లు ఖర్చు పెట్టి సాధించిన ఆయకట్టు కేవలం 98 వేల ఎకరాలు మాత్రమే అని తప్పుడు ప్రచారం చేస్తున్నారు. కమిషన్ ను కూడా తప్పుదోవ పట్టించే ప్రయత్నం చేసినారు. ప్రభుత్వమే ఈ వివరాలను రాష్ట్ర అసెంబ్లీలో ప్రదర్శించింది

ఏ ప్రాజెక్టులోనైనా కొత్త ఆయకట్టు ఒకేసారి అందుబాటులోకి రాదు. కాలువల వ్యవస్థ నిర్మాణం అవుతున్న కొద్ది కొత్త ఆయకట్టు అభివృద్ధిలోకి వస్తుంది. మనకున్న గతానుభవాన్ని చూస్తే 1963 లో శ్రీరాంసాగర్ ప్రాజెక్టుకు శంఖు స్థాపన జరిగితే డ్యాం నిర్మాణం పూర్తి అయిన తర్వాతనే 1975 లో అంటే 11 ఏండ్ల తర్వాత మొదటిసారి 25 వేల ఎకరాలకు నీటిని విడుదల చేయడం జరిగింది. దశల వారీగా ఆయకట్టు పెరుగుతూ పోయింది తప్ప ఒక్కసారే మొత్తం ఆయకట్టు సాగులోకి రాలేదు. 2008-09 నాటికి ఆయకట్టు 9 లక్షల ఎకరాలకు చేరుకున్నది. కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం అయిన తర్వాతనే శ్రీరాంసాగర్ రెండవ దశ 4 లక్షల ఎకరాల ఆయకట్టుకు సాగునీరు అందింది. కాళేశ్వరం ప్రాజెక్టులో కూడా ఇదే జరుగుతుంది.

**రీ-ఇంజనీరింగ్ తో గోదావరి సజీవ నదిగా మారింది :**

తెలంగాణ ప్రభుత్వం చేపట్టిన రీ ఇంజనీరింగ్ ప్రతిపాదనల వల్ల గోదావరి నదిపై కొత్త బ్యారేజిల నిర్మాణం జరిగింది. ఎల్లంపల్లి, శ్రీరాంసాగర్ జలాశయాలను కలుపుకుంటే నిజామాబాద్ జిల్లా కందకుర్తి నుంచి భద్రాద్రి జిల్లా దుమ్ముగూడెం దాకా మొత్తం 500 కిలోమీటర్ల పొడవున్న గోదావరి నది 312

కిలోమీటర్ల పొడవునా 365 రోజులు సజీవంగా ఉంటుంది. గోదావరి గర్భంలో 190.39 టిఎంసిల నీటి నిల్వ సాధ్యపడుతున్నది. ఈ సజీవ గోదావరి ఇక ఎండి పోయే ప్రసక్తే లేదు.

ఉమ్మడి రాష్ట్రంలో గోదావరి నదిపై తెలంగాణలో శ్రీరాంసాగర్ తప్ప మరో ప్రాజెక్టు లేదు. 20 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో ఎల్లంపల్లి డ్యాం నిర్మించినప్పటికి తెలంగాణ ఏర్పడే వరకు ఎఫ్ఆర్ఎల్ 148 మీటర్ల వరకు నింపలేకపోయారు. కెసిఆర్ ప్రభుత్వం నిర్వాసితులకు పునరావాస కాలనీలు నిర్మించి వారిని తరలించి, ఎగువన రాయపట్నం వద్ద హై లెవెల్ బ్రిడ్జ్ నిర్మించి 2016 లో తొలిసారి ఎల్లంపల్లి డ్యాంలో 148 మీటర్ల వరకు నీటిని నింపడం జరిగింది. ఈ కింది పట్టికను చూస్తే తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు తర్వాత గోదావరిపై శ్రీరాం సాగర్ కింద ఎల్లంపల్లి సహా 7 బ్యారేజీలు నిర్మాణం అయినాయని తెలుస్తుంది. ప్రముఖ ఇంజనీర్ దివంగత శ్రీ టి హనుమంత రావు గారు కలగన్న స్టెప్ ల్యాడర్ టెక్నాలజీని గోదావరి జలాల సమగ్ర వినియోగానికి కెసిఆర్ ప్రభుత్వం నిజమైన అర్థంలో అమలు చేసింది.

| **క్రసం** | **జలాశయం** | **స్టేటస్** | **నీటి నిల్వ (టిఎంసి )** | **బ్యాక్ వాటర్ (కి మీ)** |
|---|---|---|---|---|
| 1 | శ్రీరాంసాగర్ | పూర్తి అయింది | 90 | 74 |
| 2 | సదర్మాట్ బ్యారేజీ | పూర్తి అయింది | 1.58 | 17 |
| 3 | ఎల్లంపల్లి బ్యారేజీ | పూర్తి అయింది | 20 | 36 |
| 4 | అన్నారం బ్యారేజీ | పూర్తి అయింది | 10.87 | 32 |
| 5 | సుందిళ్ళ బ్యారేజీ | పూర్తి అయింది | 8.83 | 31 |
| 6 | మేడిగడ్డ బ్యారేజీ | పూర్తి అయింది | 16.17 | 42 |
| 7 | సమ్మక్కసాగర్ బ్యారేజీ | పూర్తి అయింది | 6.94 | 30 |
| 8 | సీతమ్మసాగర్ బ్యారేజి | నిర్మాణంలో ఉంది | 36 | 50 |
| | మొత్తం | | 190.39 | 312 |

ఇప్పటికే ఎల్లంపల్లి – సమ్మక్క బ్యారేజీల మధ్యన 170 కిమీ పొడవున గోదావరి నది సజీవం అయ్యింది. గోదావరి నదీ గర్భంలోనే ఎటువంటి ముంపు లేకుండా, పునరావాసం లేకుండా 62.81 టిఎంసిల నిల్వ సాధ్యం అయ్యింది. ఇదొక అపూర్వమైన ప్రయోగం. 170 కిలోమీటర్ల పొడవున గోదావరి నది పునరుజ్జీవనం జరిగినందున గోదావరి పరివాహక ప్రాంతం రూపురేఖలు మారబోతున్నాయి.

గోదావరి పరివాహక ప్రాంతంలో వ్యవసాయం, మత్స్య పరిశ్రమ, టెంపుల్ & ఇకో టూరిజం, జలరవాణా, పరిశ్రమల స్థాపన వంటి రంగాలలో అనూహ్యమైన ఆర్థిక ప్రగతి జరగనుంది. జీవ వైవిధ్యం పెంపొందనున్నది. రాష్ట్ర రైతాంగానికి, సాధారణ ప్రజానీకానికి, రాష్ట్ర ఆర్థిక వ్యవస్థకు విస్తృత ప్రయోజనాలు అందించే కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం పూర్తి చేసుకొని జూన్ 2019 లో ప్రారంభోత్సవం జరుపుకున్నది. ప్రాజెక్టులో

కాలువల వ్యవస్థ నిర్మాణంలో ఉన్న సంగతి అందరికీ తెలిసిందే.

**కాళేశ్వరం ప్రాజెక్టు వల్ల కలిగిన అదనపు లాభాలు ఏమిటి ? :**

**అన్ని రకాల పంటల దిగుబడి...**

- 2013 -14లో ఒక కోటి 7 లక్షల 49 వేల టన్నులు
- 2022-23లో 4 కోట్ల 65 లక్షల 24వేల 336 టన్నులు (నాలుగు రెట్లు పెరుగుదల)

**వరి ధాన్యం ఉత్పత్తి :**

- 2014లో 68లక్షల టన్నులు
- 2023 నాటికి 2కోట్ల 70లక్షల టన్నులు

**సాగు విస్తీరం :**

- 2014లో కోటి 31లక్షల 34వేల ఎకరాలు
- 2023 నాటికి 2కోట్ల 20లక్షల ఎకరాలకు పెరిగింది.

**చేపల ఉత్పత్తి :**

- తెలంగాణ రాష్ట్రంలో మంచి నీటి చేపల ఉత్పత్తి అనూహ్యంగా పెరిగింది. మత్స్యశాఖ గణాంకాల ప్రకారం 2016-17 లో 1,93,732 మెట్రిక్ టన్నుల చేపల ఉత్పత్తి జరిగింది. వాటి విలువ రు. 1356.61 కోట్లు. అది 2020-21 నాటి 3,49,000 మెట్రిక్ టన్నులకు పెరిగింది. వాటి విలువ రు.3141 కోట్లు. నాలుగేండ్ల లోనే చేపల ఉత్పత్తి 1,55,268 మెట్రిక్ టన్నులు పెరిగింది. పెరిగిన ఉత్పత్తి విలువ  1784.39 కోట్లు.

- కాళేశ్వరం ప్రాజెక్టులో పెద్ద జలాశయాల నిర్మాణం జరిగినందున, చెరువులు, చెక్ డ్యాంలు సంవత్సరం పొడుగునా నీటితో నిండి ఉండటం వల్లనే ఇది సాధ్యం అయ్యింది.

**భూగర్భ జలాల వృద్ధి :**

- కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం తర్వాత భూగర్భ జలాల మట్టం ప్రాజెక్టు పరిధిలో సగటున 5.36 మీటర్లు పైకి లేచినట్టు భూగర్భ జల శాఖ నివేదికలు తెలియజేసినాయి.

- దీని వల్ల బోరు బావుల కింద వ్యవసాయం అనూహ్యంగా పుంజుకున్నది. తెలంగాణ రాష్ట్రంలో 30 లక్షలకు పైబడి బోరు బావులు ఉనికిలో ఉన్నట్లు అధికారిక లెక్కలు చెపుతున్నాయి. ఒక బోరు బావి కింద సగటున 1.50 ఎకరాలు సాగు అవుతుందని లెక్క వేసినా రాష్ట్రంలో బోరు బావుల కింద సుమారు 45 లక్షల ఎకరాలు సాగులోకి వచ్చింది. కాళేశ్వరం ప్రాజెక్టు నిర్మాణం బోరు బావుల కింద వ్యవసాయం పుంజుకోవడానికి దోహదం చేసిందని రైతాంగం బలంగా నమ్ముతున్నది.

**హైదరాబాద్ నగరంలో తాగునీరు, పారిశ్రామిక అభివృద్ధికి నీరు :**

- కాళేశ్వరం ప్రాజెక్టులో హైదరాబాద్ నగరానికి 30 టిఎంసిలు, పారిశ్రామిక అవసరాలకు 16 టిఎంసిల నీటి కేటాయింపులు ఉన్నాయి. రాబోయే 100 సంవత్సరాల వరకు హైదరాబాద్ నగరానికి

నీటి కొరత ఏర్పడే సమస్యే ఉత్పన్నం కాదు. ప్రాజెక్టు పరిధిలో పారిశ్రామికాభివృద్ధికి కాళేశ్వరం భరోసా ఇస్తున్నది. అందుకే ప్రపంచ దిగ్గజ కంపనీలు హైదరాబాద్‌లో పెట్టుబడులు పెట్టడానికి ముందుకు వస్తున్నాయి. మొత్తంగా చూస్తే కాళేశ్వరం తెలంగాణ ప్రగతి రథంగా (Telangana Growth Engine) మారింది.

**కాళేశ్వరం ప్రాజెక్టుకు ప్రశంసలు :**

1. ఇంతటి బహుళ ప్రయోజనకారిగా ఉన్నందునే అమెరికన్ సొసైటీ ఆఫ్ సివిల్ ఇంజనీర్స్ (ASCE) వారు 2023 లో కాళేశ్వరం ప్రాజెక్టుకు "Enduring Symbal of Engineering Progress and Partnership" అవార్డును ప్రధానం చేసినారు.

2. కాళేశ్వరం ప్రాజెక్టు పనులను పరిశీలించిన సందర్భంగా కేంద్ర జల సంఘం ప్రశంసలు కురిపించింది. దేశంలో ఎక్కడా లేని విధంగా అద్భుతంగా జరుగుతున్నాయని సిడబ్ల్యూసీ చైర్మన్ మసూద్ హుస్సేన్ అన్నారు. డిజైన్, ప్లానింగ్, ఎగ్జిక్యూషన్ అన్నీ సంతృప్తికరంగా ఉన్నాయన్నారు. తెలంగాణకు ఇదొక ల్యాండ్ మార్క్ ప్రాజెక్ట్ అని, సిఎం, ఇరిగేషన్ మంత్రి రెగ్యూలర్‌గా పురోగతిపై సమీక్షలు చేస్తూ సకాలంలో ప్రాజెక్టు పూర్తి చేసేందుకు కృషి చేస్తున్నారన్నారు.

3. ప్రాజెక్టు సందర్శనకు వచ్చిన కేంద్ర జల సంఘం చీఫ్ ఇంజనీర్ సి కె ఎల్ దాస్ గారు ప్రాజెక్టు పనులు జరిగిన తీరుపై ప్రశంశలు కురిపించారు.

4. కాళేశ్వరం ప్రాజెక్టుకు నిధులు సమకూర్చిన రూరల్ ఎలెక్ట్రిఫికేషన్ కార్పొరేషన్ (REC) తాము సమకూర్చిన నిధులను ప్రాజెక్టు పనుల కోసం సమర్థవంతంగా ఖర్చు చేసినందుకు గాను కాళేశ్వరం కార్పొరేషన్ కు A గ్రేడ్ సర్టిఫికెట్ ను అందించింది.

* * * * *

## 10

## కాళేశ్వరం నిర్వహణ వ్యయం చాలా ఎక్కువ..కరెంటు బిల్లుల భారం భరించలేని విధంగా ఉన్నాయన్న విమర్శలో వాస్తవం ఎంత ?

కాళేశ్వరం ప్రాజెక్టులో అవరమయ్యే మొత్తం విద్యుత్తు 13,558 మిలియన్ యూనిట్లు. అయితే ఇందులో 75% విద్యుత్తు మాత్రమే వాస్తవంగా వినియోగమవుతుంది. అంటే వాస్తవ వినియోగం 10,168.50 మిలియన్ యూనిట్లు. ఇప్పుడు ప్రపంచంలో తయారవుతున్న పంపులు 89 –91 % ఎఫిషియన్సీ కలిగినవి. వాటి పవర్ ఫ్యాక్టర్ 0.95 గా ఉంటుంది. కనుక 10% వరకు ప్రత్యక్షంగా విద్యుత్ వినియోగంలో సేవింగ్స్ ఉంటాయని విద్యుత్ రంగ నిపుణులు చెపుతున్నారు. గతంలో కొంత మంది విమర్శకులు దాన్ని తమ ఊహాగానాల లెక్కలతో ఎకరానికి అయ్యే విద్యుత్ వ్యయాన్ని ఒక లక్ష నుంచి వేలు అవుతుందని తప్పుడు లెక్క గట్టినారు. ప్రాజెక్టు దేశంలోనే అత్యంత ఖరీదైన నీటిని సరఫరా చేస్తుందని అన్యాయపు నిర్ధారణకు వచ్చినారు. మల్లన్నసాగర్, కొండ పోచమ్మసాగర్ కింద ఆయకట్టు రైతులు చేసేది ప్రపంచంలోనే అత్యంత ఖరీదైన వ్యవసాయం అని అన్యాయమైన వ్యాఖ్య చేసినారు.

ఈ రకమైన విమర్శలు లేవనెత్తిన సందర్భంలో ఒక టిఎంసి నీటిని ఎత్తిపోయడానికి, ఒక ఎకరం భూమి సాగు కోసం అయ్యే ఖర్చును ప్రాజెక్టు ఇంజనీర్లు, విద్యుత్ నిపుణులు వాస్తవికంగా అంచనా కట్టారు. అది ఈ విధంగా ఉంటుంది.

**మేడి గడ్డ - ఎల్లంపల్లి లింక్-1 లోకరెంట్ ఖర్చులు :** లింక్ 1 లో ఒక టిఎంసి నీటిని ఎత్తిపోయడానికి అయ్యే కరెంటు ఖర్చు (ఫిక్స్డ్ చార్జీలు కలుపుకొని) : 231.34(మేడిగడ్డ) +156.53(అన్నారం) +182.69(సుందిళ్ళ) = 570.56 లక్షలు (5.70 కోట్లు)

లింక్ 1 లో ఒక ఎకరం సాగుకు అయ్యే ఖర్చు(TMC కి 10 వేల ఎకరాల చొప్పున ): రూ5705.68

**ఎల్లంపల్లి - మిడ్ మానేరు లింక్-2 లోకరెంట్ ఖర్చులు :** లింక్ 2 లో ఒక టిఎంసి నీటిని ఎత్తిపోయడానికి అయ్యే కరెంటు ఖర్చు606.73(నంది మేడారం) +600.70(రామడుగు) = 1207.43 లక్షలు.

లింక్ 2 లో ఒక ఎకరం సాగుకు అయ్యే ఖర్చు రూ (TMCకి 10 వేల ఎకరాల చొప్పున) రూ 12,074.35 మాత్రమే.

**మిడ్ మానేరు - మల్లన్న సాగర్ లింక్-4 లోకరెంట్ ఖర్చులు :** లింక్ 4 లో ఒక టిఎంసి నీటిని ఎత్తిపోయడానికి అయ్యే కరెంటు ఖర్చు 518.58 (అనంతగిరి) + 614.98 (రంగనాయకసాగర్) +424.75 (మల్లన్నసాగర్) =1558.23 లక్షలు.

లింక్4 లో ఒక ఎకరం సాగుకు అయ్యే ఖర్చు రూ15582.38 మాత్రమే.

**మల్లన్న సాగర్ - కొండపోచమ్మ సాగర్ లింక్ లోకరెంట్ ఖర్చులు :** ఈ లింక్ లో ఒక tmc నీటిని ఎత్తిపోయడానికి అయ్యే కరెంటు ఖర్చు

200.02(పాములపర్తి స్టేజ్ 1) +251.88 (పాములపర్తి స్టేజ్ 2) =451.91లక్షలు.

ఈ లింక్ లో ఒక ఎకరం సాగుకు అయ్యే ఖర్చురూ 4519.14 మాత్రమే.

పై లింకులు అన్నీ కలిపితే మేడిగడ్డ నుంచి కొండ పోచమ్మ సాగర్ వరకు ఎత్తిపోతల ద్వారా ఒక ఎకరానికి అయ్యే ఖర్చు

5705.68+12,074.35+15,582.38+4519.14 = రూ. 37,881.55 మాత్రమే

| **లింక్** | **ఒక టిఎంసి ఎత్తిపోయడానికి ఖర్చు (ఫిక్స్డ్ చార్జీలతో లక్షల్లో)** | **ఎకరం సాగుకు ఖర్చు (టిఎంసికి 10 వేల ఎకరాల చొప్పున రూపాయల్లో)** |
|---|---|---|
| మేడి గడ్డ – ఎల్లంపల్లి లింక్–1 | 570.56 | 5705.68 |
| ఎల్లంపల్లి – మిడ్ మానేరు లింక్–2 | 1207.43 | 12,074.35 |
| మిడ్ మానేరు–మల్లన్నసాగర్ లింక్ 4 | 1558.23 | 15582.38 |
| మల్లన్నసాగర్ –కొండపోచమ్మ లింకు 4 | 451.91 | 4519.14 |
| మొత్తం | 3788.13 | 37,881.55 |

ఇది కూడా అన్ని పంపులు ఏకకాలంలో తిప్పితే అయ్యే ఖర్చు. విద్యుత్ నిపుణులు చెపుతున్న దాని ప్రకారం వాస్తవ వినియోగం 50 % మాత్రమే ఉంటుంది. కాళేశ్వరం ప్రాజెక్టులో ఉన్న 22 పంప్ హౌజుల్లో వివిధ రేటింగ్ (139, 135, 125, 106, 44, 40 మెగావాట్లు) కలిగిన మొత్తం 85 పంపులు ఉంటాయి. ఇవన్నీ నడిచినప్పుడు 4600 మెగావాట్ల కరెంటు అవసరం అవుతుందని ఒక అంచనా. వాస్తవ వినియోగం 80 % అనుకుంటే 3680 మెగావాట్లు. అయితే అన్ని పంపులు ఒకేసారి నడిచే సందర్భం అసలు ఏర్పడకపోవచ్చు. కాళేశ్వరం ప్రాజెక్టులో ఈ స్థితి ఎన్నడూ ఉత్పన్నం కాదు. ఎగువన నీరు లేనప్పుడు దిగువ గోదావరిలో లభ్యమయ్యే నీటిని ఎగువ గోదావరిలోకి ఎట్లా ఎదురెక్కించ వచ్చునో 2019 లోనే మన అనుభవం లోనికి వచ్చింది. మొత్తం కాళేశ్వరం ప్రాజెక్టులో మేడిగడ్డ – ఎల్లంపల్లి లింక్ ఎంత ముఖ్యమైనదో, ఎంతటి ప్రాధాన్యత కలిగినదో ప్రజలకు అర్థం అయ్యింది. కాబట్టి కాళేశ్వరం ఎత్తిపోతల కరెంటు ఖర్చులు ఎకరానికి 1.50 నుంచి 2.00 లక్షలు ఉంటుందని ప్రాజెక్టు వ్యతిరేకులు చేసే విమర్శలు నిరాధారం. ఊహాగానాలు తప్ప వాస్తవాలు కావు.

ఇక్కడ మరొక విషయం కూడా చర్చించాలి. కాళేశ్వరం డిపిఆర్ తయారు అయ్యేనాటికి (2017) TSERC ఎత్తిపోతల పథకాలకు యూనిట్ విద్యుత్ చార్జి ఫిక్స్డ్ చార్జిలను కలుపుకొని రు 5.80 నిర్ధారించినారు. (ఆ తర్వాత ఇ.ఆర్.సి. యూనిట్ చార్జిని రు. 6.40 కి పెంచింది). అయితే ప్రభుత్వం యూనిట్ చార్జిని 3.00 లుగా పరిగణించి ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని లెక్క గట్టారు అని విమర్శకులు పాయింట్ అఫ్ ఆర్డర్ లేవనెత్తారు. ఈ విమర్శకు ఆనాడే వివరణ ఇచ్చి ఉన్నాము. ఇ.ఆర్.సి.లు విద్యుత్ చార్జీలను నిర్ధారించేటప్పుడు విద్యుత్ ఉత్పత్తి ఖర్చులు, విద్యుత్ కొనుగోలు ఖర్చులు, విద్యుత్ ప్రసార ఖర్చులు, డిస్కాంల విద్యుత్ పంపిణీ

ఖర్చులు, ప్రభుత్వాలు వివిధ వర్గాలకు ఇచ్చే సబ్సిడీలు మొదలైన వాటిని పరిగణనలోకి తీసుకుంటాయి. తెలంగాణా ERC కూడా ఆనాడు ఇవే ప్రమాణాలతో వివిధ కేటగిరిలతో పాటు ఎత్తిపోతల పథకాలకు కూడా విద్యుత్ చార్జీలను నిర్ధారించింది. రాష్ట్రంలో 2018-19 సంవత్సరంలో లభ్యమయ్యే విద్యుత్ 65595.49 మిలియన్ యూనిట్లు. ఈ విద్యుత్ కొనుగోలు కోసం అయ్యే ఖర్చు 25,243.97 కోట్లు. TSERC వారి రిటేయిల్ పవర్ టారిఫ్ బుక్ ప్రకారం యూనిట్ విద్యుత్ కొనుగోలు కోసం అయ్యే సగటు ఖర్చు రు. 3.85. ఇకపోతే 2018-19 సంవత్సరంలో భారీగా విద్యుత్ ని వినియోగించే వివిధ కేటగిరిల్లో మొత్తం విద్యుత్ వినియోగం 46444.87 మిలియన్ యూనిట్లు. మిగతావి ట్రాన్స్మిషన్ నష్టాలు, చిన్న వినియోగదారుల కేటగిరీల ఖాతాలోకి వెళతాయి. సాంప్రదాయేతర ఇంధన వనరుల ద్వారా వచ్చే విద్యుత్తులో 90 శాతం భాగం సౌర విద్యుత్తుదే. ప్రస్తుతం సోలార్ ప్లాంట్ల ద్వారా సరఫరా అవుతున్న విద్యుత్తు 4615.91 మిలియన్ యూనిట్లు. ఇది భవిష్యత్తులో మూడింతలు పెరిగే అవకాశం ఉన్నది. దీనితో విద్యుత్ కొనుగోలు ఖర్చు సగటున యూనిట్ కు రు. 3.46 కు పడిపోతుంది. ఎత్తిపోతల పంపులు ప్రధానంగా వానా కాలంలోనే నడుస్తాయి. ఈ కాలంలో వ్యవసాయం, గ ృహా వినియోగం, ఇతర వ్యాపార పరమైన వినియోగాలు గణనీయంగా పడిపోతాయి. విద్యుత్ వినియోగం 16 వేల మెగావాట్ల నుండి 8 – 9 వేల మెగావాట్లకు పడిపోతుంది. వానా కాలంలో చౌకైన జల విద్యుత్ విస్తారంగా అందుబాటులో ఉంటుంది కనుక విద్యుత్ కొనుగోలు ఖర్చు తగ్గుతుంది. జల విద్యుత్ కోసం స్వల్ప కాలిక ఒప్పందాల ద్వారా చౌకైన విద్యుత్‌ను ఎత్తిపోతల పథకాలకు అందుబాటులోకి తీసుకొచ్చే అవకాశం ఉన్నది. దీనికి తోడు రాష్ట్రంలో, దేశంలో సౌర విద్యుత్ ఉత్పత్తి రోజురోజుకు పెరిగిపోతున్నది. సౌర విద్యుత్ ఉత్పత్తి ఖర్చులు తగ్గుతున్నవి. కాళేశ్వరం, పాలమూరు, సీతారామ తదితర ఎత్తిపోతల పథకాలు పూర్తి అయ్యే నాటికి సౌర విద్యుత్ ఉత్పత్తి 300 శాతం పెరిగే అవకాశం ఉన్నది. భవిష్యత్‌లో సోలార్ ప్లాంట్ల ద్వారా లభ్యమయ్యే సౌర విద్యుత్తు సుమారు 13847.73 మిలియన్ యూనిట్లు. పగలు పంపులు నడపడానికి సౌర విద్యుత్తుని వినియోగించవచ్చు. ఇక రాత్రి వేళల్లో, వర్షాలు పడుతున్న రోజుల్లో విద్యుత్ గ్రిడ్‌లో నుంచి విద్యుత్ సరఫరా చేయడానికి పెద్దగా ఇబ్బంది ఉండే అవకాశం లేదు. ఎందుకంటే వ్యవసాయం, గృహావసరాలు ఇతర వ్యాపార వర్గాల వినియోగం డిమాండ్ గణనీయంగా తగ్గిపోతుంది. ఈ రంగాలలో తగ్గిన విద్యుత్ డిమాండ్‌ను ఎత్తిపోతల పథకాలకు మళ్లించవచ్చు. సౌర విద్యుత్తు యూనిట్ రూ 2.31 లకే లభిస్తుంది.

కాళేశ్వరం సహా పాలమూరు రంగారెడ్డి, దేవాదుల, సీతారామ, డిండీ తదితర ఎత్తిపోతల పథకాలు పూర్తి అయ్యేనాటికి రాష్ట్రంలోని మొత్తం విద్యుత్ వినియోగంలో 35 శాతం వినియోగం ఈ పంపింగ్ కేంద్రాల నుండే ఉంటుంది. ఆదే సమయంలో వ్యవసాయంలో వినియోగం 50 శాతానికి పడిపోతుందని అంచనా. ఎందుకంటే ఈ పథకాల ద్వారా రైతాంగానికి సాగు నీరు సరఫరా అవుతుంది కనుక వారు బోరు బావులపై ఆధారపడే అవసరం రాదు. ఇది అనుభవ పూర్వకంగా ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్టులో రుజువయ్యింది. ప్రాజెక్టు ద్వారా సాగునీరు సరఫరా అవుతున్నప్పుడు 50% బోరుబావులు బందు అయినాయి. ప్రాజెక్టుల ద్వారా సాగునీరు సరఫరా అవుతున్నప్పుడు రైతులు బోరు బావులను వినియోగించరు. భవిష్యత్తులో కాళేశ్వరం, ఇతర ఎత్తిపోతల ప్రాజెక్టుల ఆయకట్టు ప్రాంతంలో వ్యవసాయ విద్యుత్ వినియోగం 50 శాతానికి పడిపోతుందని ఒక అంచనా. వ్యవసాయ విద్యుత్తుకు ప్రస్తుతం ప్రభుత్వం ఇస్తున్న క్రాస్ సబ్సిడీలో మిగులు ఏర్పడుతుంది. అవసరమైతే ప్రభుత్వం ఈ మిగులును ఎత్తిపోతల పథకాలకు మళ్ళించవచ్చు. ఇది మరో విధంగా రైతాంగానికి అందుతున్న సబ్సిడిగా భావించాలి. భవిష్యత్తులో సాంప్రదాయేతర ఇంధన వనరుల నుంచి సరఫరా గణనీయంగా పెరుగనున్నందున యూనిట్ విద్యుత్ కొనుగోలు ఖర్చు రూ 3.46 కు పడిపోతుంది. TSERC బుక్ ప్రకారం అదనపు విద్యుత్తుని రూ 3.10 లకు అమ్మవచ్చు. కాబట్టి డిస్కాం

లు రూ 3.10 లకు యూనిట్ విద్యుత్ ను కొనుగోలు చేసి ఎత్తిపోతల పథకాలకు సరఫరా చేసే అవకాశం ఉన్నది. భవిష్యత్తులో రూ 3.10 కే యూనిట్ విద్యుత్ అందుబాటులోకి రానున్నది కాబట్టి ప్రాజెక్టు వ్యయాన్ని అంచనా వేసేటప్పుడు యూనిట్ విద్యుత్ చార్జీని 3 రూపాయలుగా పరిగణించడం సరి అయినదే అని విద్యుత్ రంగ నిపుణులు భావిస్తున్నారు. అయితే మూడవ టిఎంసి నీటి ఎత్తిపోతల ఖర్చును కలిపి 1,27,000 కోట్లకు సవరించిన కాళేశ్వరం డిపిఆర్ లో యూనిట్ విద్యుత్ ఛార్జీని రూ. 6.40 నే తీసుకోవడం జరిగింది. జిల్లా వ్యవసాధికారులు అందించిన 2022-23 పంటల ధరలను పరిగణనలోకి తీసుకొని ప్రయోజనాలు, ఖర్చుల (BCR) నిష్పత్తిని 1.789 గా లెక్కించడం జరిగింది.

రాష్ట్రంలో రైతాంగానికి సాగునీరు, ప్రజలకు తాగునీరు, పారిశ్రామిక అవసరాలకు నీరు అందించాలంటే ఎత్తిపోతలు తప్ప మార్గం లేదని అందరూ అంగీకరిస్తున్నదే. అదే సమయంలో ఎత్తిపోతలకు కరెంటు ఖర్చు గురించి గగ్గోలు పెడతారు. అభూత కల్పనలతో ప్రజలను, తప్పుదోవ పట్టించే ప్రయత్నం చేస్తారు. ఎత్తిపోతలు లేకుండా రాష్ట్ర రైతాంగానికి సాగు నీరు ఇవ్వలేము. పంపులు నడిస్తే కరెంటు కాలుతుంది. రాష్ట్రంలో ఎలిమినేటి మాధవరెడ్డి ప్రాజెక్టు, నాగార్జునసాగర్ దిగువ కాలువ (నల్లగొండ), కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, కోయిల్ సాగర్, తుమ్మిళ్ళ (మహబూబ్ నగర్), భక్త రామదాసు (ఖమ్మం), అలీసాగర్, గుత్ప, చౌటుపల్లి హనుమంత రెడ్డి (నిజామాబాద్), గూడెం (మంచిర్యాల్), ఎల్లంపల్లి (కరీంనగర్) పథకాలు విజయవంతంగా రైతాంగానికి సేవలు అందిస్తున్నాయి. 2019 నుంచి కాళేశ్వరం ప్రాజెక్టు ద్వారా సాగునీరు అందుతున్నది. మరో రెండు మూడేండ్లలో పాలమూరు రంగారెడ్డి, సీతారామ, డిండీ, చిన్న కాళేశ్వరం, వార్ధా, చనాకా కొరాటా, సంగమేశ్వర, బసవేశ్వర, చెన్నూరు ఎత్తిపోతల పథకాలు సాగునీరు అందించడానికి సిద్ధం అవుతాయి. వీటన్నింటికి సుమారు 9 వేల మెగావాట్ల కరెంటు అవసరం పడుతుందని ఇంజనీర్లు అంచనా వేసారు. వీటికి ప్రతీ ఏటా 10 నుంచి 15 వేల కోట్ల కరెంటు బిల్లులు రాష్ట్ర ప్రభుత్వం చెల్లించవలసి ఉంటుంది. భవిష్యత్తులో ఇది ఏ ప్రభుత్వానికైనా తప్పదు. ఈ ఖర్చు ఉంటుందని రాష్ట్ర ప్రభుత్వానికి తెలుసు. ఇందులో ఆశ్చర్యపోవాల్సిన అంశమే లేదు.

తెలంగాణలో ఎత్తిపోతలు లేకుండా రైతాంగానికే కాదు ఏ రంగానికైనా కూడా నీరు సరఫరా చేయలేము. ఈ సంగతి కాళేశ్వరం విమర్శకులకు తెలుసు. కరెంటు ఖర్చుల బూచి చూపి ప్రాజెక్టు విమర్శకులు ప్రజలను తప్పుదోవ పట్టించడానికే ఇంజనీర్లు కూడా ఈ ప్రచారం చేశారు. ఉమ్మడి ప్రభుత్వం చేపట్టిన ప్రాణహిత చేవెళ్ల పథకానికి అయినా ఈ కరెంటు ఖర్చు ఉండేదే. తుమ్మిడిహట్టి కట్టి ఉంటే కరెంటు ఖర్చు లేకుండా గ్రావిటీ ద్వారా నీళ్ళు ఎల్లంపల్లికి చేరి ఉండేవి అనే వారి వాదన తప్పు. అక్కడ కూడా 40 మీటర్ల లిఫ్ట్ ఉన్న సంగతిని మరుగున పెడుతున్నారు. ఎల్లంపల్లి నుంచి కొండ పోచమ్మ వరకు లిఫ్ట్ మార్గంలో మార్పు లేదు. తెలంగాణ సాగునీటి, తాగునీటి అవసరాలకు అనుగుణంగా జలాశయాల సామర్థ్యం, పంపుల లిఫ్ట్ సామర్థ్యం రోజుకు 2 టిఎంసిలకు మాత్రం పెంచడం జరిగింది. ప్రాణహిత-చేవెళ్ళ, కాళేశ్వరం రెండూ కూడా బహుళ అంచెల ఎత్తిపోతల పథకాలే (Multi Stage Lift Schemes).

* * * * *

## 11

# కాళేశ్వరం సహా తెలంగాణ ఎత్తిపోతలు తెల్ల ఏనుగులా? సామాజిక అవసరమా?

కాళేశ్వరం ప్రాజెక్టును తెల్ల ఏనుగు అని విమర్శిస్తున్న మేధావులు గమనించవలసిన అంశం ఏమిటంటే.. దేశాలు, రాష్ట్రాలు తమ ప్రాంత ప్రత్యేక పరిస్థితులు, అవసరాలకు అనుగుణంగానే పథకాలను రూపకల్పన చేస్తాయి. గల్ఫ్ దేశాల్లో తాగునీటి కోసం సముద్రపు ఉప్పు నీటిని శుద్ధి పరచడానికి బిలియన్ల డాలర్లను ఖర్చు చేస్తున్నాయి. ఇజ్రాయిల్‌లో సగటు వార్షిక వర్షపాతం 100 మిల్లీ మీటర్లు. ఆ విలువైన నీటిని సమర్థవంతంగా వినియోగించడానికి ఇజ్రాయిల్ ప్రభుత్వం వ్యవసాయ యాంత్రీకరణకు బిలియన్ల డాలర్లు ఖర్చు చేస్తున్నది. అది వారి సామాజిక అవసరం. అవి తెల్ల ఏనుగులు అని తీసి పారేయడానికి వీలు లేదు. తెలంగాణ కూడా అంతే. 90 నుంచి 100 మీటర్ల తక్కువ ఎత్తులో నదులు ప్రవహిస్తున్నాయి. సాగు భూములు 200 నుంచి 650 మీటర్ల ఎత్తులో ఉన్నాయి. వాటికి సాగునీరు, అక్కడి ప్రజలకు తాగునీరు, పరిశ్రమలకు నీరు అందించాలంటే ఎత్తిపోతల పథకాలు తప్ప వేరే మార్గం లేదు. అందుకు ఎంత ఖర్చు అయినా ప్రభుత్వాలు భరించక తప్పదు. అది తెలంగాణ సామాజిక అవసరం. ప్రయోజనాలు – ఖర్చుల నిష్పత్తి (BC Ratio) దృష్టి కోణంతో తెలంగాణ ఎత్తిపోతల పథకాలను విశ్లేషించి ఇవి తెల్ల ఏనుగులు అని తిరస్కరిస్తే తెలంగాణ రైతాంగానికి, ప్రజలకు సాగునీరు, తాగునీరు అందించడం సాధ్యం కాదు. ఉమ్మడి రాష్ట్రంలో 'నీరు పల్లమెరుగు, మీరు ఎత్తుగడ్డ మీద ఉన్నారు' అని మభ్యపుచ్చి నీటిని దోచుకు పోయిన వారికి, ఇప్పుడు తెల్ల ఏనుగులు అని ఎత్తిపోతల ప్రాజెక్టులను తిరస్కరిస్తున్న వారికి తేడా లేదు.

మిషన్ భగీరథ తాగునీటి పథకం కోసం కె సిఆర్ ప్రభుత్వం సుమారు 33 వేల కోట్లు ఖర్చు చేసింది. ఇది ఒకసారి చేసే ఖర్చు. ఈ వ్యవస్థ ద్వారా జలాశయాల నుంచి 42 టిఎంసిల నీటిని రాష్ట్రంలో ప్రతీ ఇంటికి రక్షిత తాగు నీటిని ఉచితంగా సరఫరా చేస్తున్నది తెలంగాణ ప్రభుత్వం. కోకాకోలా, పెప్సీ, బిస్లెరీ, టాటా తదితర కంపనీలు ఒక టిఎంసి (2831 కోట్ల లీటర్లు) భూగర్భ జలాలను సీసాల్లో నింపి ప్రజల నుంచి పిండుకుంటున్న సొమ్ము సుమారు రూ. 56,620 కోట్లు (లీటర్ నీళ్ళ సీసా 20 రూపాయలు లెక్కన). తాగునీటి కోసం ఈ ప్రైవేటు తెల్ల ఏనుగులను ప్రజలు భరిస్తూనే ఉన్నారు. కొందరు ప్రపంచ మేధావులు ఈ ప్రైవేటు తెల్ల ఏనుగులను ఏనాడూ ప్రశ్నించరు. ఉచితంగా సాగునీరు, తాగునీరు ఇస్తున్న ప్రభుత్వ పథకాలను మాత్రం తెల్ల ఏనుగులని విమర్శిస్తారు.

**కాళేశ్వరం ప్రాజెక్టులో 169 టిఎంసిల నీటిని 18 లక్షలకు పైగా ఎకరాల సాగుకు వినియోగిస్తామని చెబుతున్నా వాస్తవంలో అంత తక్కువ నీటితో సాధ్యమా? అన్నది మరొక విమర్శ.**

ప్రాజెక్టులో నీటి లభ్యత ఎంత, నీటి వినియోగం ఎంత అన్న లెక్కలు తెలువకుండా వేసిన ప్రశ్న ఇది. కేంద్ర జల సంఘం కూడా ఇర్రిగేషన్ ప్లానింగ్ పై సంతృప్తి వ్యక్తం చేస్తూ రాష్ట్ర ప్రభుత్వానికి లేఖ రాసింది. మేడిగడ్డ వద్ద నుంచి ఎత్తిపోసే నీరు 195 టిఎంసిలు, ఎల్లంపల్లి వద్ద లభ్యమయ్యే నీరు 20 టిఎంసిలు, ప్రాజెక్టు

ఆయకట్టు ప్రాంతంలో 25 టిఎంసిల భూగర్భ జలాల వాడకం కలుపుకొని ప్రాజెక్టుకు లభ్యమయ్యే నీరు 240 టిఎంసిలని సిడబ్ల్యుసి లెక్కగట్టింది. ఇందులో169 టిఎంసిలు సాగు కోసం, 30 టిఎంసిలు హైదరాబాద్ తాగునీటి కోసం, 16 టిఎంసిలు పారిశ్రామిక అవసరాల కోసం, 10 టిఎంసిలు దారి పొడుగునా గ్రామాలకు తాగునీటి కోసం, మొత్తం 237 టిఎంసిలు కేటాయించడం జరిగింది. సాగుకోసం కేటాయించిన 169 టిఎంసిలలో 134.50 టిఎంసిలు కొత్త ఆయకట్టుకు, 34.50 టిఎంసిలు 25 % స్థిరీకరణ ఆయకట్టు కోసం వినియోగించడం జరుగుతుంది. అంటే ఒక టిఎంసికి 13 వేల ఎకరాలు సాగు చేయగలమనే అంచనాతో చేసిన ఈ ఇర్రిగేషన్ ప్లానింగ్‌ని సిడబ్ల్యుసి కూడా అంగీకరించింది.

ఉపరితల నీటి ప్రవాహంలో గ్రావిటి ద్వారా ప్రవహించే నీటి వాడకానికి, ఎత్తిపోతల పథకాల్లో నీటి వాడకానికి తేడా ఉంటుంది. కాళేశ్వరం భారీ లిఫ్ట్ పథకం కాబట్టి నీటి వినియోగంలో పొదుపు తప్పని సరి. 120 రోజుల వర్షా కాలంలో వర్షాలు కురిసేది సుమారు 40, 50 రోజులు. ఆ సమయంలో పంటలకు ప్రాజెక్టు ద్వారా నీటి సరఫరా అవసరం ఉండదు. కాబట్టి ప్రతిపాదించిన 13 వేల ఎకరాలు ఒక టిఎంసి నీటితో సాగు చేయవచ్చు. వరి సాగులో వరంగల్, జగిత్యాల, శ్రీవరి లాంటి వంగడాలని ప్రోత్సహించడం, ఆయకట్టులో మైక్రో ఇర్రిగేషన్ పద్ధతులను అవలంభించే విధంగా రైతులను చైతన్య పరచడం, ఆరుతడి పంటలను, కూరగాయల సాగును ప్రోత్సహించడం, పూలు, పండ్ల తోటలను పెంచేందుకు ప్రోత్సహించడం తదితర చర్యల ద్వారా ఒక టిఎంసికి 13 వేల ఎకరాలను సాగు చెయ్యడం అసాధ్యం ఏమీ కాదు. ప్రస్తుత సాంప్రదాయిక వరి వంగడాల పంట కాలం 120 రోజులు. కొత్తగా వచ్చే వంగడాల పంట కాలం 70–80 రోజులకు కుదించబడింది. అంటే 40, 50 రోజుల నీటి వినియోగం తగ్గిపోతుంది. తెలంగాణా ఏర్పడిన తర్వాత మూడు ప్రధాన ప్రాజెక్టులు శ్రీరాంసాగర్, నిజాంసాగర్, నాగార్జునసాగర్ కాలువల కింద వారాబంది పద్దతిని, టెయిల్ టు హెడ్ పద్దతిని సమర్థవంతంగా అమలు చేసినందున సాంప్రదాయిక వరి సాగులోనే ఒక టిఎంసికి 11 వేల ఎకరాలు సాగు సాధ్యంఅయింది, పంట దిగుబడి పెరిగింది. టెయిల్ టు హెడ్ పద్దతిన నీటి సరఫరా చేసినందువలన ఎన్నడూ నీరు పారని చిట్ట చివరి భూములకు నీరు పారించగలిగినారు. కాబట్టి పైన పేర్కొన్న నీటి పొదుపు చర్యల వలన, వినూత్న సాగునీటి యాజమాన్య పద్దతుల వలన ఒక టిఎంసికి 13 వేల ఎకరాలు సాగు చేయడం సాధ్యమే.

ఇక స్థిరీకరణ ఆయా ప్రాజెక్టుల్లో ఏర్పడే నీటి కొరతను బట్టే ఉంటుంది. ఉదాహరణకు శ్రీరాంసాగర్ జలాశయానికి నీరు చేరితే స్థిరీకరణకు నీరిచ్చే అవసరమే ఉండదు. ప్రతి ఏటా శ్రీరాంసాగర్ కు కనిష్టంగా 40, 50 టిఎంసిలన్న చేరుతాయి. కాబట్టి స్థిరీకరణకు ఇచ్చే నీటిని 25 % గానే లెక్కగట్టడం జరిగింది. స్థిరీకరణకు నీరు అవసరం లేని పక్షంలో ఆ నీటిని కూడా ప్రాజెక్టు అవసరాలకే వాడుకోవడం జరుగుతుంది. ఇది ప్రతి ఏటా అప్పటి అవసరాలను, నీటి లభ్యతలను బేరీజు వేసుకొని ఇర్రిగేషన్ ప్లానింగ్ చేయడం జరుగుతుంది.169 టిఎంసిలతో 18.25 లక్షల ఎకరాల కొత్త ఆయకట్టు సాగు, 18.82 లక్షల ఎకరాల స్థిరీకరణ సాధ్యమే అని సిడబ్ల్యుసి కూడా సంతృప్తి చెంది తన అంగీకారం తెలియజేసింది.

### భారీ ప్రాజెక్టులకు చిన్ననీటి పథకాలే ప్రత్యామ్నాయమా ?

చాలా కాలంగా భారీ ప్రాజెక్టుల విమర్శకులు చిన్ననీటి వనరులు, వాటర్ షెడ్ పథకాలు పెద్ద ప్రాజెక్టులకు ప్రత్యామ్నాయంగా ముందుకు తెస్తున్నారు. అందులో ప్రముఖ ఇంజనీరింగ్ నిపుణుడు దివంగత శ్రీ. టి హనుమంత రావు గారు రూపొందించిన చతుర్విధ జల ప్రక్రియ (Four Waters Concept) ని తెలంగాణా ప్రభుత్వం చేపట్టిన ప్రాజెక్టుల రీఇంజనీరింగ్‌కి ప్రత్యామ్నాయంగా ప్రతిపాదిస్తున్నారు. ఇవన్ని

స్థానిక అవసరాలని తీర్చేవే తప్ప ఋతుపవనాల మీద ఆధారపడిన భారత్ లాంటి దక్షిణ ఆసియా దేశాల వ్యవసాయానికి, ఆయా దేశాల ఆహార భద్రతకు పూచి పడలేవు. చిన్ననీటి వనరులకు, వాటర్ షెడ్ పథకాలకు ఉన్న పరిమితులు హనుమంతరావు గారికి బాగా తెలుసు. 1990 వ దశకంలో నర్మదా నదిపై నిర్మించిన సర్దార్ సరోవర్, ఇందిరాసాగర్ ప్రాజెక్టులకు, ఉత్తరాఖండ్ రాష్ట్రంలో భాగీరథి నదిపై నిర్మించిన తెహ్రీ జల విద్యుత్ ప్రాజెక్టుకు వ్యతిరేకంగా ఉద్యమాలు జరుగుతున్న కాలంలో హనుమంత రావు గారు ఆ చర్చలో పాల్గొని పెద్ద డ్యాంల నిర్మాణానికి అనుకూలంగా అనేక వ్యాసాలు రాసినారు. వేటి ప్రయోజనం వాటిదే అని ఆయన అభిప్రాయపడినారు. ఒకదానికి మరొకటి ప్రత్యామ్నాయం కాజాలవు అని వాదించారు. ఈ సందర్భంగా ఆయన రాసిన ఒక వ్యాసంలో 1987 లో దేశాన్ని చుట్టుముట్టిన కరువుని ప్రస్తావించి దేశంలో ఆనాటికే నిర్మించిన భారీ మధ్యతరహా ప్రాజెక్టుల కారణంగానే దేశం భయంకరమైన కరువుని ఎదుర్కోగలిగిందని పేర్కొన్నారు. జూన్ నుంచి సెప్టెంబర్ దాకా నాలుగు నెలల్లో నదుల్లో ప్రవహించే వేలాది టిఎంసిల నీటిని చిన్ననీటి పథకాలు, వాటర్ షెడ్ పథకాలు ఒడిసి పట్టలేవు. ఈ భారీ వరద నీటిలో కనీసం 20 నుంచి 25 % నీటిని ఒడిసి పట్టాలంటే పెద్ద జలాశయాల నిర్మాణం అత్యంత అవసరం. ఇది ఎళీళీతుపవనాల మీద ఆధారపడే భారత్, ఇతర దక్షిణాసియా దేశాలకు అత్యవసరం. ఈ అవసరాన్ని గుర్తించిన హనుమంతరావు గారు పెద్ద డ్యాంల నిర్మాణానికి అనుకూలంగా చర్చలో పాల్గొన్నారు. అదే సమయంలో చిన్ననీటి వనరుల అభివృద్ధిని మర్చిపోవద్దని ప్రభుత్వాలకు సూచించినారు. ఆ క్రమంలో రూపొందిందే చతుర్విధ జల ప్రక్రియ. అయితే ఇది పెద్ద ప్రాజెక్టులకు ప్రత్యామ్నాయమని ఆయన భావించినట్లు దాఖలాలు లేవు. అటువంటి ప్రతిపాదనల్ని ఆయన ఖచ్చితంగా వ్యతిరేకించేవారని గతంలో ఆయన వ్యాసాలు చదివిన నా లాంటివారికి తెలుసు.

తెలంగాణ ప్రభుత్వం చిన్ననీటి వనరుల అభివృద్ధి కోసం చేపట్టిన మిషన్ కాకతీయ కార్యక్రమానికి దేశ విదేశాల నుంచి ప్రశంసలు వెల్లువెత్తుతున్న సంగతి ఎరుకే. తెలంగాణ ప్రభుత్వం అక్కడితో ఆగలేదు. గోదావరి కృష్ణా నదుల్లో వర్షా కాలంలో లభ్యమయ్యే నీటిని ఒడిసి పట్టడానికి ప్రణాళికలు సిద్ధం చేసింది. ఈ రెండు నదుల్లో మన వాటాని సంపూర్ణంగా వినియోగించుకోవాలనే ఉద్దేశ్యంతో జలాశయాల నిర్మాణం చేపట్టింది. వీటి నిర్మాణాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అడ్డుకోవడానికి ఎన్ని ప్రయత్నాలు చెయ్యాలో అన్ని చేస్తున్నది. అదే సమయంలో పెద్దఎత్తున కృష్ణా, గోదావరి నీటిని తరలించుకుపోవడానికి ప్రణాఖిలకుల తయారు చేస్తున్నది. తాజా ఉదాహరణ 200 టిఎంసి గోదావరి నీటిని తరలించే గోదావరి – బనకచర్ల లింకు ప్రాజెక్టు. అందులో ఆశ్చర్యం కలిగించే అంశం ఏమీ లేదు. పర్యావరణం, ముంపు, నిర్వాసితత్వం పేరు మీద తెలంగాణ బిడ్డలే సాగునీటి ప్రాజెక్టులపై కుట్ర కేసులు వేసి, కుట్ర సిద్ధాంతాలు తయారు చేసి వీటిని అడ్డుకోవడానికి చేస్తున్న ప్రయత్నాలు మరింత శోచనీయమైనవి.

* * * * *

12

## కాళేశ్వరం ప్రాజెక్టు లోని బ్యారేజీల జీవిత కాలం ఎంత? వీటిని ఇసుకపై నిర్మించడం సబబేనా ?

కాళేశ్వరమే కాదు ఏ బ్యారేజి అయినా  డ్యాం అయినా 100 ఏండ్ల జీవిత కాలానికి నిర్మిస్తారు. అయితే బ్యారేజిల పునాదులకు, డ్యాంల పునాదులకు తేడా ఉంటుంది. డ్యాంలు పెద్ద ఎత్తున నీటిని నిల్వ చేస్తాయి కావున ఆ బరువును తట్టుకోవడానికి వీలుగా డ్యాం పునాదులను గట్టి రాతి మీద నుంచి వేస్తారు. బ్యారేజి నీటి నిలువ కోసం నిర్మించరు. ఇవి నీటి మళ్లింపు నిర్మాణాలు. డ్యాంలతో పోలిస్తే వీటి నిల్వ సామర్థ్యం చాలా తక్కువ. డ్యాంలో మూడింట రెండు వంతుల నీరు డ్యాం సిమెంట్ కాంక్రీట్ గోడ వెనుక నిలుస్తాయి. మిగతా ఒక వంతు నీరు డ్యాం గేట్ల వెనుక నిలబడతాయి. బ్యారేజీలో అయితే మొత్తం నీరు బ్యారేజి గేట్ల వెనుకనే నిలుస్తాయి. నిల్వ తక్కువ కాబట్టి వీటిని ఇసుక పునాదులు మీద కూడా నిర్మిస్తారు. వీటిని ఫ్లోటింగ్ ఫౌండేషన్స్ (Floating Foundations) లేదా పర్మియేబుల్ ఫౌండేషన్స్ (Permeable Foundations) అని అంటారు. ఇటువంటివి నిర్మించడానికి కేంద్ర జలసంఘం (CWC), సెంట్రల్ బోర్డ్ ఆఫ్ ఇరిగేషన్ & పవర్ (CBIP), బ్యూరో ఆఫ్ ఇండియన్ స్టాండర్డ్స్(BSI) మొదలైన సంస్థలు మాన్యువల్స్, మార్గదర్శకాలు, కోడ్స్ జారీ చేసి ఉన్నాయి. దేశంలో ఎక్కడ బ్యారేజి నిర్మించినా వీటి ఆధారంగానే డిజైన్ చేయడం జరుగుతుంది. కాళేశ్వరం ప్రాజెక్టులో నిర్మించిన మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ళ బ్యారేజీలను, సమ్మక్కసాగర్ బ్యారేజీని, చనాకా కోరాట బ్యారేజీని, సదర్ మాట్ బ్యారేజీని, సీతమ్మ సాగర్ బ్యారేజిని వీటిని అనుసరించే డిజైన్ చేయడం జరిగింది.

అయితే ఈ తెలంగాణ బ్యారేజీల నుండి గ్రావిటీ ద్వారా నీటిని సరఫరా చేయలేము. ఇవి దిగువ నుంచి ఎగువకు నీటిని ఎత్తిపోసుకోవడానికి నిర్మించిన బ్యారేజీలు. కాబట్టి పంప్ హౌజ్ లోకి నీటి మళ్లించాలంటే తప్పని సరిగా నీటి నిల్వ ఉండక తప్పదు. ప్రకాశం, కాటన్ బ్యారేజీల్లో అయితే గ్రావిటీ ద్వారా నీటి సరఫరా జరుగుతుంది. అక్కడ నీటి నిల్వ తక్కువగా ఉన్నప్పటికీ నీటికి కాలువల్లోకి మళ్లించే అవకాశం ఉన్నది. తెలంగాణ బ్యారేజీల్లో పరిస్థితి భిన్నమైనది కాబట్టే కొంచెం ఎక్కువ నీటి నిల్వ సామర్థ్యంతో బ్యారేజీలను నిర్మించడం జరిగింది. బ్యారేజిలు మళ్లింపు పథకాలు అన్న మూస భావనను తెలంగాణ ప్రాంతంలో నిర్మించే బ్యారేజీలకు అన్వయించడం ఇంజనీరింగ్ పరిజ్ఞానం అనిపించుకోదు. పశ్చిమ బెంగాల్ రాష్ట్రంలో గంగా నదిపై నిర్మించిన ఫరక్కా బ్యారేజి నిల్వ సామర్థ్యం 30 టిఎంసిలు. డెడ్ స్టోరేజి 7 టిఎంసిలు ఉందని గమనించాలి. అయితే బ్యారేజీల పునాదుల రాఫ్టను డిజైన్ చేసేటప్పుడు ఈ నీటి బరువును పరిగణలోకి తీసుకోకుండా డిజైన్ చేస్తారా? ఈ స్టోరేజ్ వల్లనే మేడిగడ్డ పిల్లర్లు కుంగిపోయినాయని చెప్పడానికి శాస్త్రీయ ప్రమాణం ఏమీ లేదు. 2019 లో బ్యారేజీలు ప్రారంభం అయిన నాటి నుంచి గోదావరిలో వరుసగా భారీ వరదలు సంభవించాయి. 2019, 2020, 2021, 2022 సంవత్సరాలలో భారీ వరదలు సంభవించాయి. 2022 వరద అయితే 500 సంవత్సరాలకు ఒకసారి (500 year frequency flood) వరద అని కేంద్ర జల సంఘం నిర్ధారించింది. నాలుగు వరుస భారీ వరదలను తట్టుకొని మూడు బ్యారేజీలు నిలబడినాయి.

ఆయితే నది లోపల జరిగే మార్పుల కారణంగా రాఫ్ట్ కింద ఇసుక జరిపోయి ఇటువంటి ప్రమాదాలు జరిగే అవకాశం ఉంటుంది. గతంలో సర్ ఆర్థర్ కాటన్ బ్యారేజీలో, ప్రకాశం బ్యారేజీలో, ఫరక్కా బ్యారేజీలో కూడా ఇటువంటి సంఘటనలు జరిగిన ధాఖలాలు ఉన్నాయి. తిరిగి వాటిని పునరుద్దరించుకోవడం జరిగింది. మేడిగడ్డ బ్యారేజి బ్లాక్ 7లో జరిగిన ఈ దురదృష్టకర ఘటన ఎందువలన జరిగింది తెలియాలంటే భూభౌతిక పరిశోధనలు జగవలసి ఉంటుంది. అవేవీ జరపకుండా ఊహాగానాలతో డిజైన్ లోపమని, నిర్మాణ లోపమని, నాణ్యతా లోపమని, నిర్వాహణ లోపమని వ్యాఖ్యానించడం సమంజసం కాదు. ఇంజనీర్లు కారణాలు తెలుసుకునే పనిలో ఉన్నారు. నిర్మాణ లోపాలు, నాణ్యతా లోపాలు, డిజైన్ లోపాలు ఉంటే మొత్తం బ్యారేజీలో ఈ రకమైన కుంగుబాటు వచ్చి ఉండేది. లేదా కొట్టుకు పోయేది. కానీ అట్లా జరగలేదు. 8 బ్లాకులున్న మేడిగడ్డ బ్యారేజీలో 7 వ బ్లాకులో మాత్రమే మూడు పిల్లర్లు కుంగినాయి. మిగతా పిల్లర్లు సురక్షితంగానే ఉన్నాయి. 2024 లో వచ్చిన 15 లక్షల క్యూసెక్కుల వరదను మేడిగడ్డ బ్యారేజి మరే ప్రమాదానికి గురి కాకుండా కిందకు పంపించడం మనం చూసాము. ఇదే బ్యారేజి పటిష్టతకు నిదర్శనం. ప్రాజెక్టు విమర్శకులకు గోదావరి నదే తిరుగులేని సమాధానం చెప్పింది. 2020, 2021 లో కరోనా ప్రభావం వలన బ్యారేజీల పర్యవేక్షణ సరిగ్గా జరగలేదు. బ్యారేజి కింద ఏర్పడిన బుంగలను గుర్తించినప్పటికీ కరోనా కారణంగా ఇంజనీర్లు, టెక్నీషియన్లు, కార్మికులు ఎవరూ అందుబాటులో లేని కారణంగా రిపేర్లు జరగక పోవడం 2023 లో ఈ కుంగుబాటుకు ఒక ప్రధానమైన కారణంగా ఇంజనీర్లు భావిస్తున్నారు. అయితే బ్యారేజి పునరుద్దరణ సాధ్యమే అని బ్యారేజి నిర్మాణ సంస్థ ఎల్ & టి ఇటీవల స్వయంగా పి సి ఘోష్ కమిషన్ కు నివేదించినట్టు పత్రికలు రిపోర్ట్ చేసినాయి.

* * * * *

**13**

# బ్యారేజి కుంగుబాటుపై దిద్దుబాటు చర్యలకు జాతీయ డ్యాం సేఫ్టీ అథారిటీ (NDSA) చేసింది ఏమిటి ?

శంఖంలో పోస్తేనే తీర్థం అయినట్టు NDSA వారు సూచించినవే రక్షణ చర్యలు అవుతాయని ప్రభుత్వం భావిస్తున్నది. ఈ పునరుద్దరణ చర్యలు (Remedial Measures) మన ఇంజనీర్లకు తెలియనివి కావు. అయితే ప్రభుత్వానికి NDSA మీద ఉన్న భరోసా మన ఇంజనీర్ల మీద లేదు. NDSA వారు బ్యారేజి కుంగిపోయిన 2023 అక్టోబర్ నెలలో అసెంబ్లీ ఎన్నికలకు ముందు ఆఘమేఘాల మీద వచ్చిపోయిన తర్వాత ఎన్నికల్లో కేంద్ర పాలక వర్గాలకు మేలు చేకూర్చే విధంగా ఊహాగానాలతో కూడిన ఒక నివేదికను వండివార్చి మొదట ప్రెస్ వాళ్ళకు పంపి ఆ తర్వాత ప్రభుత్వానికి పంపినారు. ఆ రిపోర్ట్ ను ఆనాటి ప్రభుత్వం తిరస్కరిస్తూ వారికి సవివరమైన లేఖ కూడా రాసింది. ఆ తర్వాత 4 నెలల కాలాయాపన తర్వాత మేల్కొని రెండవసారి వచ్చింది 2024 మార్చ్ నెలలోనే. పోలీసు తరహా రహస్య విచారణ చేసి వెళ్లారు. వేల పేజీల సమాచారాన్ని సేకరించారు. ఆఖరుకు మన వాళ్ళు చెప్పిన దిద్దుబాటు చర్యలనే (Remedial Measures) రాసి మే నెలలో మన వాళ్ళ మొఖాన కొట్టినారు. అందులో వాళ్ళు పేర్కొన్న తేదీలు అన్ని కూడా మార్చ్‌లో వారి పర్యటన గురించి మాత్రమే ఉన్నాయి. మేము ఒకటిన్నర నెలలోనే మధ్యాంతర నివేదిక (Interim Report) ఇచ్చాము అని చెప్పుకోవడానికే. అది కూడా విచారణ కమిషన్ ఆదేశించిన తర్వాతనే ఈ నివేదిక ప్రభుత్వానికి అందింది. NDSA నివేదిక ఇచ్చిన నాటికి వీటిని అమలు చేయడానికి ఇంజనీర్లకు మిగిలింది 5 వారాలు మాత్రమే. ప్రభుత్వం జనవరిలోనే ఈ పనులకు అనుమతి ఇచ్చి ఉంటే ఈ పాటికి 90 శాతం పనులు అయిపోయి ఉండేవి. మే నెలలో జరిగిన ఒక క్యాబినెట్ సమావేశంలో తాత్కాలిక మరమ్మతులు చేపట్టాలని ఇంజనీర్లకు ఆదేశాలు ఇచ్చింది ప్రభుత్వం. బ్యారెజీని వరదల నుంచి రక్షించుకోవడం తక్షణ కర్తవ్యం. కాళేశ్వరం కమిషన్ ఛైర్మన్ శ్రీ పి సి ఘోష్ గారు ఆదేశించకపోయి ఉంటే ఇది కూడా ఇచ్చేవారు కాదు. ఆలస్యం అయితే అమృతం కూడా విషంగా మారుతుంది. ఈ ఆలస్యానికి పూర్తి బాధ్యత NDSA ది, రాష్ట్ర ప్రభుత్వానిది. అయితే అదృష్టవశాత్తు 2024 వరదల్లో మరే ప్రమాదం జరగలేదు

ఇంకా విచిత్రం ఏమిటంటే NDSA నివేదికలో దిద్దుబాటు (Remedial Measures) అయితే సూచించారు. అయితే ఇవి అమలు చేసినా బ్యారేజీకి ముప్పు తప్పకపోవచ్చు అని చెపుతూ తమని తాము సేఫ్ జోన్ లో పెట్టేసుకున్నారు. ఐటం 2.1 లో మూడవ పేరాలో ఈ విధంగా రైడర్ పెట్టినారు" however, it is pertinent to mention that the possibility of any further unexpected movement or behavior of structure in such a highly distressed condition cannot be ruled out, despite interim measures.

ఇకపోతే అందులో ప్రధానంగా ఉన్న సూచనలు : 1. మూడు బ్యారేజీలలో మొత్తం గేట్లను తెరచి ఉంచాలి 2. లేచిపోయిన సిమెంట్ బ్లాకులను తిరిగి వేయాలి. అవి తిరిగి లేచిపోకుండా ఉండడానికి ఒకదానితో మరొక బ్లాకును ఇనుప కడ్డీలతో టై చేయాలి 3. కుంగి పోయిన పిల్లర్ల కిందా మీదా షీట్ పైల్స్ డ్రైవ్ చేయాలి 4. బుంగలను సిమెంట్ గ్రౌటింగ్ చేసి మూసి వేయాలి 5. మూడు బ్యారేజీల వద్ద

పేరుకుపోయిన ఇసుక పూడికను తొలగించాలి 6. నదిలో బ్యారేజీల కిందా, మీదా నీటి ప్రవాహానికి ఉన్న ఆటంకాలను తొలగించాలి.

ఇవన్నీ చేయడానికి పర్మిషన్ ఇవ్వాలని ఎప్పటి నుంచో ఇంజనీర్లు NDSA ను, ప్రభుత్వాన్ని కోరుతూనే ఉన్నారు. అయితే విచారణ కమిషన్ ఆదేశాలు ఇచ్చే దాకా అటు NDSA, ఇటు ప్రభుత్వం ఇంజనీర్లకు పర్మిషన్ ఇవ్వలేదు. నివేదిక వచ్చేసరికి కాలం హరించుకుపోయింది. వీటిలో కొన్ని అమలు చేశారు. కొన్ని గోదావరిలోకి నీటి ప్రవాహాలు వచ్చేయడంతో అమలు చేయలేకపోయారు. సంఘటన జరిగి ఏడాదిన్నర గడచిపోయినా ఎన్ డి ఎస్ ఎ తుది నివేదికను సమర్పించలేదు. బ్యారేజి పునరుద్దరణకు సూచనలు చేయలేదు. పైగా బ్యారేజీలను వినియోగించరాదని ఆంక్షలు విధించి పోయారు. ప్రస్తుత తెలంగాణ ప్రభుత్వం కూడా వారి ఆంక్షలను పాటించి లింకు 1 ను పూర్తిగా వినియోగం నుంచి పక్కన పెట్టేసింది. గత మూడు సీజన్ల నుంచి రైతాంగం సాగునీటి కొరతను ఎదుర్కొంటున్నప్పటికీ ఎన్ డి ఎస్ ఏ నించి తుది నివేదిక జారీ చేయించడంలో విఫలం అయ్యింది. బ్యారేజి పునరుద్దరణ జరగక పోయినా గోదావరి ప్రవాహాలను పంప్ హౌజ్ లోకి మళ్లించే అవకాశాలు ఉన్నాయని సాగునీటి శాఖ ఇంజనీర్లు ప్రభుత్వానికి ప్రతిపాదిస్తున్నప్పటికీ అటువంటి ఆదేశాలు ఏవీ జారీ అయిన దాఖలాలు లేవు. ఇప్పటికీ లింకు 1 వినియోగంలోకి రాలేదు.

శ్రీరాంసాగర్, నిజాంసాగర్ ఆయకట్టులో లక్షలాది ఎకరాలకు నీరందక పంటలు ఎండిపోయే పరిస్థితి దాపురించింది. చెరువులు, చెక్ డ్యాంలు నింపకపోవడం వలన చెరువుల కింద పంటలు ఎండిపోతున్నాయి. బోర్లు ఎండిపోయి మోటార్లు నడువక బోర్ల కింద పంటలు ఎండిపోయినాయి. ఈ సాగునీటి సంక్షోభం వస్తుందని ప్రభుత్వానికి తెలియక కాదు. ఎన్.డి.ఎస్.ఎ నివేదిక వచ్చేవరకు లింక్-1 ని వినియోగంలో పెట్టకూడదన్న ప్రభుత్వ మొండి వైఖరే ఈ సంక్షోభానికి కారణం అని విశ్లేషించక తప్పడం లేదు. ఎండలకు పంటలు ఎండిపోతే ప్రభుత్వాన్ని విమర్శిస్తున్నరు  అనే నెపాన్ని ప్రకృతి మీదకు నెట్టివేసే ప్రయత్నంలో ప్రభుత్వ పెద్దలు ఉన్నారు. గడచిన ఐదారేళ్లుగా ఎండలు ఇట్లానే ఉన్నాయి. మరి అప్పుడు పంటలు ఎందుకు ఎండిపోలేదు అని రైతులు సరిగ్గానే ప్రశ్నిస్తున్నారు. కాళేశ్వరం ఫలితాలు వారి అనుభవంలో ఉన్నాయి కనుకనే వారు ఈ రకమైన ప్రశ్నలు అడగ గలుగుతున్నారు.

లింకు-1ని తక్షణమే వినియోగంలోకి తీసుకురావడానికి ప్రభుత్వం ప్రత్యామ్నాయ మార్గాలని అన్వేషించి కనసం 2025 వానాకాలం పంటలకైనా సాగునీరు అందించాలని రైతాంగం కోరుతున్నది.

* * * * *

14

## కాళేశ్వరం పంపు హౌజ్ ల మునకకు కారణం ప్రకృతి విపత్తా ? డిజైన్ లోపమా ?

2022 జూలై 12, 13,14 తేదీల్లో రాష్ట్రంలో కురిసిన అతి భారీ వర్షాలకు గోదావరి నదిలో వచ్చిన వరద నీరు కాళేశ్వరం ప్రాజెక్టులో భాగంగా నిర్మించిన అన్నారం, కన్నెపల్లి పంప్ హౌజ్‌లను పూర్తిగా ముంచేసిన సంగతి తెలిసిందే. ఈ మునకకు ప్రకృతి విపత్తే కారణం అని కళ్ళకు కనబడుతూనే ఉన్నది. 'ఈ విషయంలో ఏమీ ఆందోళన చెందే అవసరంలేదు. ఇటువంటి సంఘటనలు గతంలో ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో, దేశంలో ఇతర ప్రాంతాలలో కూడా సంభవించాయని' సాగునీటి శాఖ ఎత్తిపోతల సలహాదారు శ్రీ పెంటారెడ్డి గారు ఒక పత్రికా ప్రకటన జారీ చేశారు. అందులో 2009 లో కృష్ణా నదికి వచ్చిన వరదలకు శ్రీశైలం కుడి జల విద్యుత్ కేంద్రం, కల్వకుర్తి పంప్ హౌజ్ మునిగిపోయిందని పేర్కొంటూ వాటిని అతి స్వల్ప కాలంలోనే పునరుద్ధరించినామని పేర్కొన్నారు. ప్రకృతి విపత్తులు సంభవించినప్పుడు రాజకీయాలు పక్కన బెట్టి సమాజం అంతా ఏకతాటిపై నిలబడి ప్రజలను ఆదుకోవాలని విజ్ఞప్తి చేశారు. ఆ ప్రకటన చేసినందుకు ఆయనను కూడా ఆనాటి విపక్షం, ఈనాటి అధికార పక్షం తీవ్రంగా నిందించాయి. రాజకీయ పార్టీల వైఖరిని పక్కన బెడితే.. తెలంగాణ ఉద్యమ సంస్థ అయిన తెలంగాణ జాయింట్ యాక్షన్ కమిటీ కూడా తన సామాజిక బాధ్యతను మరచి కాళేశ్వరం పంప్‌హౌజ్‌ల మునకపై అసంబద్ధ విమర్శలు చేసింది. డిజైన్ లోపాలను, నాణ్యతా లోపాలను కప్పి పుచ్చడానికే ప్రక ృతి విపత్తు అంటున్నారని వారి ప్రధాన విమర్శ. ఈ అంశంపై ఒక పత్రాన్ని సోషల్ మీడియాలో ప్రచారంలో పెట్టారు. వారి విమర్శలకు ఆనాడు ఇచ్చిన వివరమైన సమాధానాలు ఇక్కడ పొందుపరుస్తున్నాను.

2022 సంవత్సరంలో సంభవించినది 500 సంవత్సరాలకు ఒకసారి (500 years frequency flood) వరద అన్న సంగతి మరచిపోయి చేసిన విమర్శ తప్ప మరొకటి కాదు. కేంద్ర జల సంఘం వారు 30.10.2017 న కాళేశ్వరం ప్రాజెక్టుకు హైడ్రాలజీ క్లియరెన్స్ ఇచ్చినప్పుడు వారు అంచనా కట్టిన 500 years frequency flood పరిమాణం 81,576 క్యూమెక్కులు. అనగా 28,80,829 క్యూసెక్కులు. కాళేశ్వరం బ్యారేజి ఈ వరదను తట్టుకునే విధంగానే డిజైన్ చేయడం జరిగింది. బ్యారేజి నిర్మాణం వలన వచ్చే afflux ను కూడా పరిగణనలోకి తీసుకొని 85 గేట్లు అమర్చడం జరిగింది. కేంద్ర జల సంఘం 1986 లో కాళేశ్వరం వద్ద నమోదు చేసిన అత్యున్నత వరద మట్టం (High Flood Level ) 107.05 మీటర్లు. ఈ మట్టాన్ని పరిగణలోకి తీసుకొని, బ్యారేజి యొక్క కంట్రోల్ లెవెల్స్(FRL,Gate hoisting level, Bridge level మొదలైనవి నిర్ధారించడం జరిగింది. కరకట్టల నిర్మాణం, పంప్ హౌజ్‌ల నిర్మాణం చేయడం జరిగింది. కేంద్ర జల సంఘం ప్రమాణాల ప్రకారం గోదావరి నదిలో కాళేశ్వరం వద్ద నది వరద మట్టం 103.5 మీటర్లు ఉంటే అది వార్నింగ్ లెవెల్‌గా పరిగణిస్తారు. నది 104.75 మీటర్ల మట్టం వద్ద ప్రవహిస్తుంటే అప్పుడు డేంజర్ లెవెల్ దాటిందని చెప్పవచ్చు.

కాళేశ్వరం వద్ద గోదావరి వరద మట్టం 1986 లో నమోదు అయిన అత్యధిక వరద మట్టం (HFL) కు మించి 108.19 మీటర్లు 14.7.22 న నమోదు అయ్యింది. జులై 13–14 తేదీల్లో నమోదు అయిన వరద పరిమాణం 28 నుంచి 29 లక్షల క్యూసెక్కులకు పైగా ఉందని అంచనా కట్టారు. ఇవి తెలంగాణ ఇంజనీర్లు నమోదు చేసినవి కావు. కేంద్ర జల సంఘం వారు నమోదు చేసినవని గమనించాలి. ఈ అసాధారణ వరద పరిస్థితి ఏర్పడిన కారణంగానే కన్నేపల్లి పంప్ హౌజ్ నీట మునిగిపోయింది తప్ప ఇందులో నాణ్యతా లోపం, డిజైన్ లోపం ఎక్కడ ఉన్నదో ఈ పత్రం రాసిన ఇంజనీరింగ్ నిపుణులకే తెలియాలి. ఇది పూర్తిగా ప్రకృతి విపత్తు అని స్పష్టంగా తెలిసి పోతున్నా సమస్యను ఒక రాజకీయ పార్టీ లాగా రాజకీయ కోణంలో విమర్శించడం టిజెఎసి చేయవలసిన పని కాదు.

డ్యాములకు, బ్యారేజిలకు తేడా తెలియని టిజెఎసి ఇంజనీరింగ్ నిపుణులు ఎవరో కాకి లెక్కలు కట్టి డిజైన్‌లో బ్యాక్ వాటర్ ఎఫెక్ట్‌ను పరిగణనలోకి తీసుకోలేదు అని చెప్పి ప్రజలను గందరగోళ పరిచే ప్రయత్నం చేసినారు. డ్యాంలను, బ్యారేజీలను డిజైన్ చేసేటప్పుడు తప్పనిసరిగా బ్యాక్ వాటర్ ఎఫెక్ట్ (afflux) లెక్క గట్టి ఆ ప్రభావాన్ని కూడా తగ్గించే విధంగానే గేట్ల సంఖ్యను నిర్ధారిస్తారు. డ్యాంల కైతే ఎగువన ఎంత దూరం, ఏ మట్టం వరకు నీరు చేరుతుందో లెక్కగట్టి రక్షణ చర్యలు తీసుకుంటారు. మేడిగడ్డ వద్ద నిజానికి 81,576 క్యూమెక్కుల వరదకు లెక్క గట్టిన గేట్ల సంఖ్య 77 మాత్రమే. కానీ అక్కడ అమర్చిన గేట్ల సంఖ్య 85. ఎందుకంటే afflux ను నివారించడానికే అన్న సంగతి గమనించాలి. డ్యాంలు నీటి నిల్వ కోసం నిర్మిస్తారు. డ్యాంలో ప్రధానంగా నీటి నిల్వ కాంక్రీట్ గోడ ద్వారా జరుగుతుంది. కొద్ది పరిమాణంలో గేట్లు కూడా నిల్వ చేస్తాయి. బ్యారేజీలలో నీటి నిల్వ మొత్తం గేట్ల ద్వారానే జరుగుతుంది. అయితే వరదల సందర్భంగా బ్యారేజి గేట్లు పూర్తిగా తెరచి free flow condition లోనే ఉంచుతారు. కాబట్టి బ్యారేజి లేనప్పుడు నది ఏ విధంగా ప్రవహిస్తుందో అదే విధంగా ప్రవహిస్తుంది. మేడిగడ్డ, అన్నారం, సుందిళ్ళ బ్యారేజిలని జూలై నెల ప్రారంభం నుంచే free flow condition లోనే ఉంచారు ఇంజనీర్లు. బ్యారేజిలు ఈ స్థితిలో ఉన్నప్పుడు బ్యాక్ వాటర్ ఎఫెక్ట్ ఉండే ఆస్కారమే లేదు. అయితే నదిలో నీటి మట్టం ఎందుకు పెరుగుతుంది అన్నది ప్రశ్న. 1986 లో గోదావరిపై ఏ బ్యారేజి లేదు. అయినా వరద మట్టం 107.05 మీటర్లకు చేరింది కదా. దానికి కారణం ఏమిటంటే.. నదికి ఉండే సహజ ప్రవాహ సామర్థ్యంకు మించి నీరు నదిలోకి వస్తే నదిలో నీటి మట్టం పెరుగుతుంది. ఒడ్డును దాటి ప్రవహిస్తుంది. 100 క్యూసెక్కుల ప్రవాహ సామర్థ్యం ఉన్న కాలువలో 200 క్యూసెక్కులు వదిలితే ఏమవుతుంది? నీరు కాలువ గట్లను దాటుకొని ప్రవహిస్తుంది. ఇదీ అటువంటిదే. ఈ స్థితి కొన్ని గంటలు ఉండవచ్చు, కొన్ని రోజులు ఉండవచ్చు. ఇది ఎగువన కురుస్తున్న వర్షపాతంపై ఆధారపడి ఉంటుంది. జూలై 13,14 తేదీల్లో కాళేశ్వరం సంగమం వద్ద గోదావరి నుంచి ప్రాణహిత నుంచి వస్తున్న వరద 29 లక్షలకు పైబడి ఉన్నది. ఇంత వరద సామర్థ్యాన్నితరలించే విస్తీర్ణం గోదావరి నది గర్భంలో లేదు కాబట్టే నది మట్టం 108 మీటర్ల పైన చేరింది. అప్పుడు కూడా మేడిగడ్డ బ్యారేజి free flow condition లోనే ఉంది. కాబట్టి బ్యాక్ వాటర్ ఎఫెక్ట్ ను పరిగణనలోకి తీసుకోలేదు అన్నది పస లేని, river hydraulics పై అవగాహన లేకుండా చేసిన వాదన. వారు ప్రస్తావించిన బ్యాక్ వాటర్ ఎఫెక్ట్ అనేది storage reservoirs కి వర్తిస్తుంది కానీ వరద కాలంలో free flow conditionలో ఉండే బ్యారేజిలకు వర్తించదు.

ఇకపోతే గోదావరి నది వరదతో ఉధృతంగా ప్రవహిస్తున్న సమయంలో చిన్న చిన్న వాగులను

తనలో కలువనివ్వదు. దాని వల్ల వాగు ఎగువకు నీరు ఎగదన్నుతుంది. అన్నారం బ్యారేజి మునిగిపోవడానికి ఇదే కారణం. గోదావరికి కుడి వైపు నుంచి వచ్చే చందనాపూర్ వాగు ఉధృతంగా ప్రవహిస్తున్న గోదావరిలో కలువక పైకి ఎగదన్ని అన్నారం పంప్ హౌజ్ రక్షణ కోసం నిర్మించిన మట్టికట్ట పైనుంచి ప్రవహించి అన్నారం పంప్ హౌజ్ మునకకు కారణం అయ్యింది. చందనాపూర్ వాగులో ఈ స్థాయిలో afflux రావడం గతంలో ఎప్పుడూ లేదు. 0.5 మీటర్లకు మించని afflux 2022 లో 1.5 నుంచి 2 మీటర్లకు దాకా పెరిగింది. అదే విధంగా బొక్కలవాగు పైకి ఎగదన్ని మంథని పట్టణాన్ని ముంచేసింది. ఈ సంగతులు river hydraulics పై అవగాహన ఉన్న ఇంజనీర్లు మాత్రమే కాదు ఏ మాత్రం విజ్ఞత ఉన్న వారైనా అర్థం చేసుకోగలరు. టిజేఏసీ తరపున ఈ పత్రం రాసిన పెద్ద మనిషికి మాత్రం అర్థం అయినట్టు లేదు.

ఏ నిర్మాణం అయినా దాన్ని డిజైన్ చేసినప్పుడు తీసుకున్న ఒత్తిడికి మించి ఒత్తిడి పెరిగితే విరిగిపోయే అవకాశం ఉంది. 20 మంది కూర్చోవడానికి కట్టిన వేదికల మీద 100 మంది ఎక్కితే వేదికలు కూలిపోయిన ఘటనలు ఎన్ని చూడలేదు! మేడిగడ్డ బ్యారేజీకి 20 కిమీ ఎగువన కన్నెపల్లి వద్ద పంప్ హౌజ్ నిర్మాణం అయ్యింది. పంప్ హౌజ్ ఫోర్ బే లోకి కూడా అత్యధిక వరద మట్టం (HFL) ను దాటి నీరు చేరినందున రెగ్యులేటర్ గెట్, పంప్ హౌజ్ రక్షణ గోడ విరిగి పంప్ హౌజ్ మునిగిపోయింది. ఇది కూడా అసాధారణ వరద ఒత్తిడికి సంభవించిన సంఘటన తప్ప డిజైన్ వైఫల్యం అనడానికి వీలు లేదు. ఫోర్‌బే నుంచి పంప్‌హౌజ్‌లోకి వస్తున్న వరదనీటిని తోడెయ్యడానికి వీలులేకుండా కరెంటు కూడా పోయింది. 40 మెగావాట్ల పంపులను జనరేటర్ల ద్వారా పనిచేయించడం సాధ్యం కాదు. హైటెన్షన్ కరెంటు అందుబాటులో ఉన్నట్లైతే పంప్‌హౌజ్‌ను రక్షించే అవకాశం ఉండేది.

2009 లో కృష్ణా నదికి అసాధారణమైన వరదలు వచ్చినప్పుడు శ్రీశైలం కుడి జల విద్యుత్ కేంద్రం, ఎస్ ఎల్ బి సి సొరంగం, కర్నూలు పట్టణం మునిగిపోయిన వాస్తవం మన ముందు ఉన్నది. శ్రీశైలం డ్యాం డిశ్చార్జ్ కెపాసిటీ ఎఫ్ఆర్ఎల్ 885 అడుగుల వద్ద 12 లక్షల క్యూసెక్కులు, గరిష్ట నీటి మట్టం (MWL) 892 అడుగుల వద్ద 13 లక్షల క్యూసెక్కులు. అయితే ఆ ఏడు 25 లక్షల క్యూసెక్కులు శ్రీశైలం డ్యాంకు చేరినాయి. డ్యాం ఎండబ్ల్యూఎల్ ను దాటి 896 అడుగులకు చేరింది. ఆ అసాధారణమైన పరిస్థితిలో శ్రీశైలం విద్యుత్ కేంద్రం మునకకు డిజైన్ వైఫల్యమే కారణమని ఎవరైనా అంటే నవ్విపోతారు. ఎస్ ఎల్ బి సి సొరంగంలో తవ్వకాలు జరుపుతున్న టన్నెల్ బోరింగ్ మెషీన్ కూడా ధ్వంసం అయ్యింది. దాన్ని బయటకు తీసి మరమ్మతులు చేసి తిరిగి సొరంగంలో ప్రవేశ పెట్టడానికి రెండు సంవత్సరాలు పట్టింది.

2009 లో శ్రీశైలం ప్రాజెక్టుకు వచ్చిన విపత్తు లాంటిదే 2022 సంవత్సరంలో కడం ప్రాజెక్ట్ కూడా ఎదుర్కొన్నది. ప్రాజెక్టులో ఏర్పాటు చేసిన మొత్తం 18 గేట్లు తెరిస్తే నదిలోకి పోయే నీరు సుమారు 3 లక్షల క్యూసెక్కులు. జూలై 12,13 తేదీల్లో కడం ప్రాజెక్టు పరీవాహక ప్రాంతంలో కురిసిన అతి భారీ వర్షపాతానికి (40 సెంటీ మీటర్లు) కడం డ్యాం వద్దకు 5 నుంచి 6 లక్షల క్యూసెక్కుల వరద వచ్చి చేరింది. ఈ వరదను నదిలోకి పంపించడానికి ప్రాజెక్టు ఇంజనీర్లు విశ్వ ప్రయత్నం చేసినారు. ప్రాజెక్టు పూర్తి స్థాయి నీటి మట్టం (FRL) 700 అడుగులు ఉంటే డ్యాం డిశ్చార్జ్ సామర్థ్యానికి మించి వరద చేరిన కారణంగా డ్యాంలో నీటి మట్టం ఒక దశలో 705 అడుగుల వరకు పోయింది. ఈ స్థితి మరికొన్ని గంటలు కొనసాగి ఉంటే డ్యాం తెగి పోయే ప్రమాదం సంభవించేది. అదే జరిగి ఉంటే సముద్రం దాకా గోదావరి తీర

ప్రాంతాలలో విపరీతమైన ఆస్తి నష్టం, ప్రాణ నష్టం సంభవించి ఉండేది. అదృష్టవశాత్తు ప్రకృతి సహకరించింది. ఎగువన వర్షపాతం తగ్గినందున వరద ఉధృతి కూడా తగ్గి డ్యాంలో నీటి మట్టం తగ్గుతూ వచ్చింది. డ్యాం ప్రమాదం నుంచి బయటపడిపోయింది. ఇది కూడా పూర్తిగా ప్రకృతి విపత్తుగానే పరిగణించాలి.

ప్రకృతి విపత్తును అంగీకరించే సౌజన్యం లేని టిజెఎసి గతంలో కాళేశ్వరం ప్రాజెక్టుపై విషం గక్కినట్టే ప్రకృతి విపత్తు సంభవించినప్పుడు అదే పని చేసింది. ప్రకృతి విపత్తులు సంభవించి నప్పుడు సమాజం అంతా రాజకీయ విభేధాలను పక్కనబెట్టి ఏకతాటి మీద ప్రజలను ఆదుకునే పనిలో నిమగ్నం కావాలి. కానీ టిజెఎసి ఈ కనీస విజ్ఞతను, సామాజిక బాధ్యతను ప్రదర్శించలేకపోయింది. 2025 ఫిబ్రవరి 21న ఎస్ఎల్‌బిసి టన్నెల్ పై కప్పు కూలిపోయి 8 మంది టెక్నీషియన్లు బురదనీటిలో చిక్కుకుపోయి ప్రాణాలు కోల్పోతే కాళేశ్వరం పంప్‌హౌజ్‌ల మునకపై, మేడిగడ్డ బ్యారేజి పిల్లర్ల కుంగుబాటుపై నానా యాగీ చేసిన ఈ మేధావి వర్గం నోరెత్తడం లేదు. ఎస్.ఎల్.బి.సి. టన్నెల్ ఘటన ప్రకృతి విపత్తా? ప్రభుత్వ వైఫల్యమా? వారు ఈ విషయంలో పాటిస్తున్న వ్యూహాత్మక మౌనం విస్మయం కలిగిస్తున్నది. ప్రకృతి విపత్తును రాజకీయం చేయవద్దని ప్రభుత్వ వర్గాలు అంటున్నాయి. ఈ సోయి మేడిగడ్డ బ్యారేజి పిల్లర్ల కుంగుబాటుపై ఎందుకు లేకుండింది? అన్న ప్రశ్న ప్రభుత్వ వర్గాలను నిలదీస్తున్నది. ఈ అంశాన్ని ఎన్నికల్లో రాజకీయ లబ్ది కోసం ప్రతిపక్షాలు ఎట్లా వాడుకున్నాయో రాష్ట్ర ప్రజలు మరచిపోలేదు.

* * * * *

# 15

# రెండు టిఎంసిలే ఎత్తిపోసుకోలేనప్పుడు మూడో టిఎంసి ఎందుకు ?

**గోదావరిలో నీటి హక్కుల స్థిరీకరణ కోసమే 3 వ టిఎంసి ఎత్తిపోతల పనులు :**

కాళేశ్వరం ప్రాజెక్టులో మూడో టిఎంసి పనులు చేపట్టడంపై కొందరు మేధావులకు అపోహాలు ఉన్నాయని తెలుస్తున్నది. కేసీఆర్ ఈ పనులను చేపట్టడంలో చాలా ముందు చూపు ఉన్నదన్న సంగతి మేధావులు అర్థం చేసుకోలేకపోతున్నారు. 2020 అక్టోబర్ లో జరిగిన రెండవ అపెక్స్ కౌన్సిల్ సమావేశంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గోదావరి ట్రిబ్యునల్‌ను వేయమని కేంద్ర జల్ శక్తి మంత్రి శ్రీ గజేంద్రసింగ్ షెఖావత్ ను కోరినారు. గోదావరి ట్రిబ్యునల్ వేయమని ఆంధ్రప్రదేశ్ కేంద్ర ప్రభుత్వాన్ని రాత పూర్వకంగా కోరితే పరిశీలిస్తామని అన్నారు. ఆంధ్రప్రదేశ్ గోదావరి ట్రిబ్యునల్ వేయమని కోరే అవకాశం ఉందని గ్రహించిన కెసిఆర్ ట్రిబ్యునల్ ఏర్పాటు కాక మునుపే గోదావరి బేసిన్లో నీటి హక్కులను స్థిరీకరించుకోవడానికి తీసుకున్న చర్యల్లో భాగంగా కొన్ని నిర్ణయాలు తీసుకున్నారు. అవి ..

1. కాళేశ్వరంలో మూడవ టిఎంసి నీటిని ఎత్తిపోసుకోవడానికి పంపులు మోటార్లు బిగించడం

2. ఎల్లపల్లి – మిడ్‌మానేరు, మిడ్‌మానేరు – మల్లన్నసాగర్ ల మధ్య అదనపు టిఎంసి నీటిని ఎత్తిపోయడానికి పంప్‌హౌజ్, కాలువలు, పైప్‌లైన్లు నిర్మించడం.

2. 36 టిఎంసిల నిల్వ సామర్థ్యంతో సీతమ్మసాగర్ బ్యారేజి నిర్మాణం

3. గోదావరి బేసిన్లో పూర్తి అయినప్పటికీ కేంద్ర జల సంఘం అనుమతులు లేని ప్రాజెక్టుల డిపిఆర్ లను తయారు చేయించి కేంద్ర అనుమతుల కోసం పంపించడం.

ఈ నిర్ణయాలను కెసిఆర్ ప్రభుత్వం అమలు చేసింది. కాళేశ్వరం 3 వ టిఎంసి పనులు, సీతమ్మసాగర్ బ్యారేజి పనులు మొదలు పెట్టించారు. కాళేశ్వరం 3 వ టిఎంసి ఖర్చులను జత చేసి సవరించిన కాళేశ్వరం డిపిఆర్, సీతమ్మసాగర్ మల్టీ పర్పస్ ప్రాజెక్టు, సమ్మక్కసాగర్, గూడెం లిఫ్ట్, చనాక కొరాట, చిన్న కాళేశ్వరం, చౌటుపల్లి హనుమంత రెడ్డి లిఫ్ట్, మోడికుంటవాగు, వార్ధా ప్రాజెక్టుల డిపిఆర్ లను కేంద్రానికి పంపడం జరిగింది. ఇందులో కాళేశ్వరం, సీతమ్మసాగర్, సమ్మక్కసాగర్, వార్ధా ప్రాజెక్టులకు తప్ప మిగతా వాటికి సాంకేతిక సలహా కమిటి అనుమతులు సాధించింది కెసిఆర్ ప్రభుత్వం. సీతమ్మసాగర్ ప్రాజెక్టుకు టి ఏ సి తప్ప సిడబ్ల్యూసి అన్ని విభాగాల అనుమతులు సాధించింది. 2025 జనవరి 11న జరిగిన టిఎంసి సమావేశంలో సీతమ్మసాగర్‌కు అనుమతి నిరాకరించినట్లు పత్రికల్లో వార్తలు వచ్చాయి. బ్యారేజి డిజైన్లను మరొకసారి పరిశీలించమని సి.డబ్ల్యు.సి.ని కోరినట్లు తెలిసింది. సమ్మక్కసాగర్ కు కూడా అంతర్రాష్ట్ర అనుమతి తప్ప అన్ని అనుమతులు సాధించిది. ఛత్తీస్‌ఘర్ రాష్ట్రం నో ఆబ్జెక్షన్ సర్టిఫికెట్ ఇవ్వకపోవడం వలన అంతర్రాష్ట్ర

అనుమతి పెండింగ్ లో ఉంది. సమ్మకసాగర్ ప్రాజెక్టు డిపిఆర్‌ను కూడా సి.డబ్ల్యు.సి. వెనక్కి పంపిందని తెల్సింది. దేవాదులతో కలిపి సమగ్ర డిపిఆర్‌ను సమర్పించాలని కోరినట్లు తెలుస్తున్నది. కాళేశ్వరం ప్రాజెక్టును కక్షపూరిత రాజకీయ కారణాల వలన 3 వ టిఎంసి ఎత్తిపోతలకు కేంద్రం అనుమతి నిరాకరిస్తున్నది. ప్రస్తుత తెలంగాణ ప్రభుత్వం తుమ్మిడిహట్టి వద్ద బ్యారేజిని నిర్మించదలుచుకున్నది కనుక వార్ధా ప్రాజెక్టు డిపిఆర్‌పై వారికి ఆసక్తి లేదు.

ఇట్లా గోదావరి జలాలపై తెలంగాణ హక్కులను గోదావరి ట్రిబ్యునల్ ఏర్పాటుకు ముందే స్థిరీకరించు కోవాలని కెసిఆర్ తలపోశారు. ఈ ముందు చూపును మేధావులు తప్పు పడుతున్నారు. ఒకవైపు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఒకే ప్రాంతానికి బనకచర్ల ద్వారా కృష్ణా నీటిని, గోదావరి నీటిని భారీగా తరలించుకుపోయేందుకు ప్రణాళికలు రూపొందిస్తుంటే ఈ మేధావులు ఒక్క మాట మాట్లాడరు. ఇక్కడ మాత్రం 3 వ టిఎంసి పనులను తప్పుపడతారు. కాళేశ్వరంలో 3 వ టిఎంసి నీటిని ఎత్తిపోసే పనులు పూర్తి అయితే మన వాటా జలాలపై ముందుగా రైపేరియన్ రైట్స్ తెలంగాణకు దక్కుతాయి. ఈ కారణంతోనే కేసీఆర్ కాళేశ్వరం నుంచి మల్లన్నసాగర్ వరకు 3 వ టిఎంసి నీటిని ఎత్తిపోయడానికి తన ప్రణాళికను అమలు చేశారు. వ్యాప్కోస్ ఇచ్చిన మేడిగడ్డ ఇతర బరాజ్‌ల నివేదికల్లోనే మూడవ టిఎంసి కోసం సివిల్ వర్క్స్, ఇతర పనులకు సంబంధించిన ప్రస్తావన ఉన్నది. కేంద్ర ప్రభుత్వానికి సమర్పించిన కాళేశ్వరం ప్రాజెక్టు డిపిఆర్‌లో కూడా 3 వ టిఎంసి గురించి ప్రస్తావించారు. 2016 ఆగస్టు లో ఏజెన్సీలతో ప్రభుత్వం చేసుకున్న అగ్రిమెంట్‌లో కూడా 3 వ టిఎంసి సివిల్ వర్క్స్ గురించి, పంపుల గురించి ఉన్నది.

మూడో టిఎంసి ఎందుకు అవసరమో మరో కారణం కూడా ఉన్నది. 2015 తరువాత మహారాష్ట్ర ముఖ్యమంత్రిగా బాధ్యతలు చేపట్టిన వెంటనే దేవేంద్ర ఫడ్నవీస్ వేన్‌గంగా, వార్ధా జలాలను తమ రాష్ట్రంలోని కరువు ప్రాంతాలకు (విదర్భ) మళ్లించే ఆలోచనలు చేశారు. అవి కార్యరూపం దాల్చితే ప్రాణహితలో వరద తగ్గుతుంది. వర్షకాలంలో భారీగా వరదనీరు వచ్చే రోజుల్లోనే రోజుకు 3 టిఎంసిలు ఎత్తిపోసుకోవాల్సి ఉంటుంది. ఆ నీటిని మల్లన్నసాగర్‌లో, ఇతర రిజర్వాయర్లలో నింపుకుని కాళేశ్వరం ద్వారా పూర్తిస్థాయిలో కొత్త ఆయకట్టుకు, స్థిరీకరించే ఆయకట్టుకు సుమారు 40 లక్షల ఎకరాలకు పైగా నీరందించే అవకాశముంటుంది.

అంతేకాదు గోదావరి బేసిన్లో తెలంగాణ వాటా 969 టిఎంసిలని ఒక పక్క ఏపీ అంగీకరించలేదు. మరోపక్క తన వాటా 775 టిఎంసిలని పేర్కొంటున్నది. గోదావరి జలాల్లో వాటాలు తేల్చడానికి ట్రిబ్యునల్ వేయమని ఇప్పటికే ఏపీ కేంద్రాన్ని కోరింది. గోదావరి ట్రిబ్యునల్ ఎప్పటికైనా ఏర్పడే అవకాశముందన్న సంగతి కేసీఆర్ గ్రహించారు. పైన తెలిపిన పరిస్థితుల నేపథ్యంలో గోదావరి జలాల్లో ఉమ్మడి రాష్ట్రం తెలంగాణ ప్రాజెక్టులకు కేటాయించిన 968 టిఎంసిల నికరజలాలపై, గోదావరిలో వానాకాలంలో లభ్యమయ్యే అపారమైన వరద జలాలపై తెలంగాణ హక్కులను ట్రిబ్యునల్ ఏర్పడక ముందే స్థిరపరిచే దిశగా ముందు చూపుతోనే మూడో టిఎంసి పనులను చేపట్టాలని కేసీఆర్ నిర్ణయించారు. కేసీఆర్ ప్రభుత్వం చొరవ వలన 969 టిఎంసి నికర జలాల్లో ఇప్పటికే 933 టిఎంసిలకు కేంద్ర జల సంఘం నుంచి హైడ్రాలజీ క్లియరెన్సులు పొందడం విశేషం.

ఈ ముందు చూపుకు కృష్ణా బేసిన్‌లో మనకున్న అనుభవాలే ఆధారం. ఆనాడు బచావత్ ట్రిబ్యునల్ ఏర్పాటుకు ముందే వినియోగంలో ఉన్న నీటికి రక్షణలు కల్పించిన కారణంగా బేసిన్ పేరామీటర్లలో ఆంధ్రప్రదేశ్ వెనుకబడి ఉన్నప్పటికీ పెద్ద వాటా సాధించుకోగలిగింది. బచావత్ ట్రిబ్యునల్ గడువు 2000 మార్చ్ లో ముగిసిపోతుందని అన్ని రాష్ట్రాలకు ముందే తెలుసు కాబట్టి కొత్త ట్రిబ్యునల్ ముందు తమ నీటి హక్కులను స్థిరపరచుకోవడానికి మహారాష్ట్ర, కర్ణాటక రాష్ట్రాలు సాగునీటి ప్రాజెక్టులకు అధిక ప్రాధాన్యత నిచ్చి, నిధులు కేటాయించి తమ రాష్ట్రంలో ప్రాజెక్టులను నిర్మించుకున్నారు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం కూడా వరద జలాలపై ఆధారపడిన రాయలసీమ ప్రాజెక్టులను ఆగమేఘాలమీద పూర్తి చేసింది. తెలంగాణలో కూడా వరద జలాలపై ఆధారపడిన ఎత్తిపోతలు.. ఎస్ ఏల్ బి సి, కల్వకుర్తి, నెట్టెంపాడు, కోయిల్‌సాగర్ ప్రారంభమైనా కూడా అవి పెండింగ్ ప్రాజెక్టులుగానే మిగిలిపోయాయి.

కృష్ణా ట్రిబ్యునల్ అనుభవాల నుంచే కేసీఆర్ ప్రభుత్వం కూడా గోదావరి బేసిన్‌లో నీటి హక్కులను స్థిరపరచుకునే ఆలోచనతోనే మూడో టిఎంసి పనులను చేపట్టింది. సమగ్ర డిపిఆర్‌ను కేంద్ర జల సంఘం ఆమోదానికి పంపించింది. రాజకీయ కారణాలతో ఆ డిపిఆర్‌ను పక్కన బెట్టిన సంగతి అందరికీ తెలిసిందే. చూసే దృష్టి కోణాన్ని బట్టి మూడో టీఎంసీ పనుల మంచి చెడ్డలు విశ్లేషించబడతాయి. కొందరు విశ్లేషకులకు అవి అనవసరమైన పనులుగా, నిధుల దుర్వినియోగంగా కనిపించాయి. నా లాంటి వారికి గోదావరిలో నీటి హక్కులు స్థిరపరిచే ముందు చూపు కనిపిస్తుంది.

* * * * *

# 16

## కాగ్ అభ్యంతరాలు సమంజసమైనవేనా ?

కాళేశ్వరం ప్రాజెక్టు విమర్శకులు కాగ్ (CAG) లేవనెత్తిన అభ్యంతరాలను చూపి కాళేశ్వరం ప్రాజెక్టులో భారీ అవినీతి జరిగిందని, ప్రభుత్వం కాంట్రాక్టర్లకు భారీగా ప్రయోజనాలు కలుగజేసిందని ఆరోపణలు చేసినారు. అయితే కాగ్ అభ్యంతరాలపై ప్రభుత్వం సమగ్రమైన వివరణలు ఇచ్చిందని, కానీ వాటిని పరిగణనలోకి తీసుకోకుండానే కాగ్ నివేదికను రూపొందించిందన్న సంగతి వీరికి తెలియదు. ప్రభుత్వం ఇచ్చిన వివరణలను పరిగణనలోకి తీసుకోవాలా వద్దా అన్నది కాగ్ అధికారుల విచక్షణపై ఆధారపడి ఉంటుంది. కేంద్ర ప్రభుత్వ పెద్దల ఒత్తిడి కూడా ఉండే అవకాశం లేకపోలేదు. మూడు సంవత్సరాల పాటు కాగ్ అధికారులు భూతద్దాలు పెట్టి కాళేశ్వరం ఫైళ్లను శోధించి శోధించి పట్టుకున్న అంశాలు కొండను తవ్వి ఎలుకను కూడా పట్టనట్టు ఉన్నాయి. కాగ్ తమ అపరాధ పరిశోధనలలో తేల్చిన కొన్ని ముఖ్యమైన అభ్యంతరాలను, వాటికి ప్రభుత్వం తరపున సమర్పించిన వివరణలను ప్రజల దృష్టికి తీసుకు రావాలన్నదే నా ఉద్దేశ్యం. ఎందుకంటే పత్రికల్లో, మీడియాలో కాగ్ లేవనెత్తిన అభ్యంతరాలనే చర్చిస్తారు కానీ ప్రభుత్వ వివరణలు ప్రచురించరు, చర్చకు రావు. ఇప్పుడు రెండింటిని ప్రజల ముందు పెడుతున్నాను. కాగ్ లేవనెత్తిన అభ్యంతరాలు తప్పో లేదా ప్రభుత్వ వివరణలు తప్పో పాఠకులను తేల్చుకోమని విజ్ఞప్తి చేస్తున్నాను.

**కాగ్ : కేంద్ర జల సంఘంకు పంపిన కాళేశ్వరం ప్రాజెక్టు డి పి ఆర్ లో ప్రాజెక్టు మొత్తం అంచనా వ్యయాన్ని రు. 81,911 కోట్లుగా లెక్క గట్టారు. అయితే ప్రాజెక్టు అంచనా వ్యయం రు. 1,47,427 కోట్లకు పెరిగే అవకాశం ఉన్నది.**

**వివరణ :** కాగ్ పేర్కొన్నట్టు కాళేశ్వరం తొలి డి పి ఆర్ లో లెక్క గట్టిన మొత్తం ప్రాజెక్టు అంచనా వ్యయం రు. 81,911 కోట్లు అన్నది వాస్తవమే. కేంద్ర జల సంఘం ఈ అంచనా వ్యయాన్ని కూలంకషంగా మధింపు చేసిన తర్వాత రు. 80,190 కోట్లకు సవరించి అనుమతిని 1.5.2018 న జారీ చేసింది. ఇది రోజుకు 2 టిఎంసిల నీటిని ఎత్తిపోసుకోవడానికి అయ్యే అంచనా వ్యయం. మూడవ టిఎంసి ఎత్తిపోతల ఖర్చును కూడా కలిపి కాళేశ్వరం ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని రూ. 1,27,000 కోట్లకు సవరించిన డి పి ఆర్ ను 2022 లో కేంద్ర జల సంఘానికి పంపడం. కేంద్ర జల సంఘంలో Cost Appraisal విభాగం వారు ఈ అంచనా వ్యయాన్ని కూడా మధింపు చేసి రు. 1,14,610 కోట్లకు స్థిరపరచింది. అయితే కారణాలు ఏమైతేనేమి రాష్ట్రంలో అధికార మార్పిడి తర్వాత కేంద్ర జల సంఘం కాళేశ్వరం సవరించిన డి పి ఆర్ పరిశీలన ఆపివేసి వెనక్కి పంపివేసింది. డి పి ఆర్ ను వెనక్కి పంపే నాటికే Cost Appraisal విభాగం వారు ఈ అంచనా వ్యయం మధింపు పూర్తి చేసింది కూడా. ఈ మధింపు జరిగే సమయంలో కాళేశ్వరం ఇంజనీర్ ఇన్ చీఫ్ తో పాటు నేను కూడా ప్రభుత్వ ప్రతినిధిగా ఆ చర్చల్లో పాల్గొన్నాను.

కేంద్ర జల సంఘం మూడవ టిఎంసి ఎత్తిపోతల ఖర్చును కలిపి కూడా రూ. 1,14,610 కోట్లకు స్థిరపరిస్తే కాగ్ మాత్రం రు. 1,47,427 కోట్లకు పెరిగే అవకాశం ఉన్నదని ఏ కారణాల వల్ల చెప్పింది ? సాగునీటి శాఖ ఈ లెక్కను మధింపు చేసిన తరువాత తేలిన విషయం ఏమిటంటే .. ప్రాజెక్టు నిర్మాణ సమయంలో చెల్లించే వడ్డీని (Interest During Construction) కూడా కాగ్ అంచనా వ్యయంలో కలిపింది.

అంచనా వ్యయాన్ని ఇట్లా లెక్క గట్టడం తప్పు అని ప్రభుత్వం వివరణ ఇచ్చింది. ప్రయోజనాలు, వ్యయాల నిష్పత్తిని (BCR) లెక్కగట్టడానికి కేంద్ర జల సంఘం జారీ చేసిన మార్గదర్శకాల ప్రకారం ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని, దీనిపై 10 శాతం వడ్డీని, ఎత్తిపోతలకు ఏటా అయ్యే కరెంటు ఛార్జీలు, 1 శాతం తరుగుదల (Depreciation), ప్రాజెక్టుకు ఏటా అయ్యే నిర్వాహణ వ్యయం, ధరల్లో హెచ్చు తగ్గులు, డి పి ఆర్ ను మధింపు చేసే నాటికి ఉన్న వ్యవసాయోత్పత్తుల ధరలను పరిగణన లోకి తీసుకోవడం జరుగుతుంది. కేంద్ర జల సంఘం ఈ మార్గదర్శకాల ప్రకారమే మూడో టిఎంసి ఎత్తిపోతల వ్యయాన్ని కలుపుకొని ప్రాజెక్టు అంచనా వ్యయాన్ని మొత్తం రు. 1,14,610 కోట్లకు స్థిరపరచింది. ఇక ప్రాజెక్టు అంచనా వ్యయం విషయంలో కాగ్ లెక్క తప్పిందా లేదా కేంద్ర జల సంఘం లెక్క తప్పిందా తేల్చేది ఎవరు ? రెండు కూడా కేంద్ర ప్రభుత్వ సంస్థలే.

**కాగ్ : ప్రభుత్వం కాళేశ్వరం ప్రాజెక్టుకు మొత్తానికి ఒకేసారి పరిపాలనా అనుమతి జారీ చేయకుండా 73 పనులకు విడివిడిగా పరిపాలనా అనుమతులను జారీ చేసింది. ఇవన్నీ కలిపితే రు. 1,10,248 కోట్లు అవుతుంది. ఈ ఖర్చులకు ఏ విధంగా నిధులు సమకూరుస్తుందో చెప్పే ప్రభుత్వ ఆదేశాలు ఏవీ లేవు.**

**వివరణ :** కాగ్ పేర్కొన్నట్టు ప్రభుత్వం 73 పనులకు విడివిడిగా పరిపాలనా అనుమతులు జారీ చేసినప్పటికీ డి పి ఆర్ ను రూపొందించినప్పుడు వీటన్నిటిని ప్రాజెక్టు మొత్తం అంచనా వ్యయంలో భాగం చేయడం జరిగింది. కేంద్ర జల సంఘంలో Cost Appraisal విభాగం వారు ఈ వివరాలన్నీ డిపిఆర్ లో చోటు చేసుకున్నాయా లేదా అన్న అంశాన్ని పరిశీలించడం జరిగింది. వారు సంతృప్తి చెందిన తర్వాతనే రు. 80,190 కోట్లకు అనుమతిని జారీ చేసినారు. ఆ తర్వాత సవరించిన అంచనా వ్యయాన్ని రూ. 1,14,610 కోట్లకు స్థిర పరచడం జరిగింది. పనులకు విడివిడిగా పరిపాలనా అనుమతులు ఇవ్వడం దానికదే నేరం కాదు. తప్పూ కాదు. ప్రాజెక్టు అవసరాలకు అనుగుణంగా పనులను అనుకున్న సమయానికి పూర్తి చేయడానికి ఒక వెసులుబాటుగా ప్రభుత్వం పరిగణించింది.

**కాగ్ : కాళేశ్వరం ప్రాజెక్టు ప్రయోజనాలు వ్యయాల నిష్పత్తిని చాలా ఎక్కువ లెక్క గట్టి చూపించారు. తొలి డి పి ఆర్ లో లెక్కగట్టిన అంచనా వ్యయం రు. 81,911 కోట్లను పరిగణించినా BCR 0.75 రావాలి. రు. 1,47,427 కోట్లకు పరిగణిస్తే అది 0.52 కు తగ్గుతుంది. అంటే ప్రాజెక్టుపై ఒక రూపాయి ఖర్చు పెడితే తిరిగి వచ్చేది 52 పైసలే. కాబట్టి ప్రాజెక్టు ఆర్థికంగా భారంగా మారే అవకాశం ఉన్నది.**

**వివరణ :** 2018 లో కేంద్ర జల సంఘం లో Cost Appraisal విభాగం వారు కాళేశ్వరం ప్రాజెక్టు అంచనా వ్యయాన్నిమధింపు చేసి BCR ను 1.511 గా లెక్క గట్టినారు. దానికి వారు ప్రమాణంగా తీసుకున్నది పైన పేర్కొన్న మార్గదర్శకాలు. 2023 లో సవరించిన డి పి ఆర్ ను మధింపు చేసినప్పుడు కూడా ఆ మార్గదర్శకాలనే ఆధారంగా తీసుకొని BCR ను 1.789 గా లెక్క గట్టినారు. 2023 లో 13 జిల్లాల వ్యవసాయాధికారులు అందించిన వ్యవసాయోత్పత్తుల ధరలు, హైదరాబాద్ మెట్రో వాటర్ బోర్డు వారు పరిశ్రమలకు సరఫరా చేస్తున్న నీటికి క్యూబిక్ మీటర్ కు రు. 180 ల వాటర్ సెస్ BCR పెరుగుదలకు ప్రధాన కారణంగా నిలిచినాయి. ఈ మధింపులో విద్యుత్ వ్యయాన్ని యూనిట్ కు రు. 6.40 నే కేంద్ర జల సంఘం పరిగణించింది. కాబట్టి కాగ్ లెక్కగట్టిన BCR 0.75 మరియు 0.52 రెండూ కూడా పూర్తిగా తప్పుడు లెక్కలే అని ప్రభుత్వం అభిప్రాయపడింది. తెలంగాణలో ఎత్తిపోతల ప్రాజెక్టులను ప్రయోజనాలు వ్యయాల నిష్పత్తి కోణంలో విశ్లేషించడమే తప్పు. ఈ అంశాన్ని చాప్టర్ 10 లో, ముగింపు లోనూ వివరంగా చర్చించాను. పాఠకులు గమనించగలరు.

**కాగ్ : కాళేశ్వరం ప్రాజెక్టులో అన్ని పంపులు నడిచినప్పుడు అవసరమయ్యే విద్యుత్ వినియోగం రాష్ట్రంలో పతిరోజు సగటున వినియోగం అయ్యే విద్యుత్ కంటే ఎక్కువ. ఎత్తిపోతల పథకాలకు విద్యుత్ సరఫరా చేయడం రాష్ట్ర ప్రభుత్వానికి ఒక సవాలుగా మారుతుంది.**

**వివరణ :** కాగ్ పేర్కొన్నట్టు కాళేశ్వరం ప్రాజెక్టులో అన్ని పంపులు ఒకేసారి నడిపే అవసరం రానే రాదు. కాగ్ ఊహాగానాలతో ఈ అభ్యంతరాన్ని లేవనెత్తిందే తప్ప వాస్తవాల మీద ఆధారపడి కాదు. భవిష్యత్తులో ఎత్తిపోతల పథకాలు అన్నీ వినియోగంలోకి వస్తే రాష్ట్రంలో ఉత్పత్తి అయ్యే విద్యుత్‌లో 35 శాతం వరకు ఎత్తిపోతలకే వినియోగించుకోవలసి ఉంటుందన్న అంచనా రాష్ట్ర ప్రభుత్వానికి ఉన్నది. అందుకే సమాంతరంగా కొత్త పవర్ ప్లాంట్లను నిర్మించి విద్యుత్ ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచుకునేందుకు రాష్ట్ర ప్రభుత్వం ప్రణాళికలు అమలు చేసింది. అవి ఇప్పుడిప్పుడే ఫలితాలను ఇవ్వడం ప్రారంభించాయి కూడా. ఈ అంశాన్ని కూడా చాప్టర్ 8 లో వివరంగా చర్చించాను. కాబట్టి కాగ్ లేవనెత్తిన ఈ అభ్యంతరం పూర్తిగా నిరాధారం.

**కాగ్ : కాళేశ్వరం ప్రాజెక్టులో ప్రతిపాదించిన 18.26 లక్షల ఎకరాల కొత్త ఆయకట్టులో మార్చ్ 2022 వరకు 14.83 లక్షల ఎకరాలకు సాగునీరు అందించే కాలువల వ్యవస్థకు పనులు ప్రారంభించారు. మార్చ్ 2022 వరకు సాధించిన కొత్త ఆయకట్టు 40,888 ఎకరాలు మాత్రమే.**

**వివరణ :** ఏ ప్రాజెక్టులోనైనా మొదట హెడ్ వర్క్స్ .. అనగా బ్యారేజీలు, జలాశయాలు, ఆనకట్టలు, ఎత్తిపోతల పథకాలైతే పంప్ హౌజ్ లు, సర్జ్ పూల్స్, వాటి అనుబంధ విద్యుత్ సబ్ స్టేషన్లు, విద్యుత్ సరఫరా లైన్లు తదితర పనుల పూర్తి చేసిన తర్వాతనే కాలువల వ్యవస్థ నిర్మాణంపై దృష్టి పెట్టడం జరుగుతుంది. కాళేశ్వరం ప్రాజెక్టులో అదే క్రమాన్ని పాటించి మేడిగడ్డ నుంచి కొండపోచమ్మసాగర్ దాకా హెడ్ వర్క్స్ పూర్తి చేయడం జరిగింది. కాళేశ్వరం ప్రాజెక్టులో 80 శాతం పనులు గత ప్రభుత్వం పూర్తి చేసింది. ఇంకా 20 శాతం పనులు ప్రస్తుత ప్రభుత్వం పూర్తి చేయాల్సి ఉన్నది.

రాష్ట్రంలో అధికార మార్పిడి జరిగే నాటికి(డిసెంబర్ 2023) సాధించిన కొత్త ఆయకట్టు 93 వేల ఎకరాలు. అయితే స్థిరీకరణ కూడా కాళేశ్వరం ప్రాజెక్టులో ఒక ప్రధానమైన అంశం. కొత్త ఆయకట్టు, స్థిరీకరణ కలుపుకొని సుమారు 20 లక్షల ఎకరాలకు(వివరాల కోసం చాప్టర్ 8 చూడండి) కాళేశ్వరం ద్వారా సాగునీరు సరఫరా అయినదన్న వాస్తవాన్ని కాగ్ విస్మరించడం విస్మయం కలిగించే అంశం. ప్రాజెక్టు విమర్శకులు ఇదే తప్పు చేసినారంటే వారికి ఏవో రాజకీయ ప్రయోజనాలు ఉండి ఉంటాయి. మరి నిష్పక్షపాతంగా ఉండవలసిన కాగ్ కూడా ఈ రకంగా విమర్శ చేయడం సమంజసమా ? పాఠకులు ఆలోచించాలి.

**కాగ్ : పంపులు, మోటార్ల సరఫరా మరియు కమీషన్ చేసే అంశంలో కనీసంగా రు. 2,684.73 కోట్లు కాంట్రాక్టర్లకు మేలు చేకూర్చే విధంగా ప్రభుత్వం వ్యవహరించిందని చెప్పడానికి అవకాశాలు ఉన్నాయి. టెండరు ఒప్పందం జరిగిన తర్వాత ధరల సవరణ క్లాజ్ ను ఒప్పందంలో భాగం చేసినందువలన కాంట్రాక్టర్లకు రు.1,342 కోట్ల ప్రయోజనం కలిగింది.**

**వివరణ :** కాగ్ ఈ రకమైన నిర్ధారణకు రావడం తప్పు. ఉమ్మడి రాష్ట్రంలోనే కాంగ్రెస్ ప్రభుత్వమే ఒక మెగావాట్ కు రు. 2.40 కోట్లు ఖర్చు అవుతుందని కేంద్ర ప్రభుత్వ సంస్థ BHEL 2005 లో సమర్పించిన కొటేషన్ ప్రకారమే ధరను ప్రాణహిత చేవెళ్ళ ప్రాజెక్టు అంచనా వ్యయంలో చేర్చింది. ఇందులో మెటీరియల్ సరఫరా, సైట్ వద్ద వాటి అసెంబ్లీ, వాటన్నిటిని కలిపి ఒక మెషీన్ గా తయారు చేసి అమర్చడం, టెస్టింగ్, కమిషనింగ్ మొదలైనవి కలిసి ఉన్నాయి. అయితే వీటికి అవసరమైన 31 వస్తువుల్లో BHEL ద్వారా సరఫరా

అయినవి 6 మాత్రమే. మిగతా 25 వస్తువులు కాంట్రాక్టర్లు బయటి నుంచి కొనుగోలు చేసి పైన పేర్కొన్న పనులు పూర్తి చేశారు. అయితే BHEL కు కాంట్రాక్టర్లు చెల్లించిన సొమ్ము వారు ఈ ఐటంకు ప్రభుత్వం నుంచి తీసుకున్న సొమ్ము కంటే తక్కువ అని కాగ్ అభిప్రాయపడింది. దీన్ని ఎత్తి చూపి కాంట్రాక్టర్లకు భారీ ప్రయోజనం కలిగింది అనే నిర్ణయానికి వచ్చింది. ఇది తప్పుడు విశ్లేషణ అని ప్రభుత్వం వివరమైన సమాధానాలు ఇచ్చినా కూడా కాగ్ సంతృప్తి చెందక పోవడం విచిత్రం. పైగా ఉమ్మడి రాష్ట్రంలో జలయజ్ఞంలో EPC పద్ధతిలో ప్రారంభించిన ఇతర ఎత్తిపోతల పథకాలలో ఒక మెగావాట్ ఖర్చు రు. 3.84 కోట్లు. తెలంగాణ ఏర్పాటు తర్వాత ప్రభుత్వం EPC కాంట్రాక్ట్ పద్ధతిని రద్దు చేసి ఎంత పని చేస్తే అంతా పనికే(LS) బిల్లు చెల్లించే విధానాన్ని అమలు చేసింది. EPC పద్ధతిలో ఒక మెగావాట్ ఖర్చు రు. 3.84 కోట్లు ఉంటే కాళేశ్వరం ప్రాజెక్టులో రు. 2.40 కోట్లే పరిగణనలోకి తీసుకున్నది ప్రభుత్వం. అయినా కూడా కాంట్రాక్టర్లకు ప్రయోజనం చేకూర్చిందని కాగ్ నిర్ధారణకు రావడం సమంజసమా ?

ఇకపోతే ధరల సవరణ క్లాజ్ గురించి కాగ్ లేవనెత్తిన అభ్యంతరానికి కూడా ప్రభుత్వం వివరణ ఇచ్చింది. ధరల సవరణ చేసుకోవచ్చని ఉమ్మడి రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వమే 7.11.2008 లో ఒక మెమో జారీ చేసింది. ఈ మెమో ద్వారా అన్ని ప్రాజెక్టుల్లో EPC కాంట్రాక్టులకు ధరల సవరణను వర్తింపజేసింది. ఆ మెమో ఆధారంగానే మార్కెట్లో ప్రస్తుత ధరలను పరిగణలోకి తీసుకొని సవరణ చేసినందు వలన కాంట్రాక్టర్లకు రు. 1,342 కోట్ల ప్రభుత్వం లబ్ది చేకూర్చిందని కాగ్ నిర్ధారణకు రావడం తప్పని ప్రభుత్వం వివరణ ఇచ్చింది. ఉమ్మడి రాష్ట్ర ప్రభుత్వం ఇ.పి.సి. కాంట్రాక్టర్లకు ధరల సవరణ సదుపాయాన్ని కల్పించిఃది. ఆ సదుపాయాన్ని కాళేశ్వరంలో ఇ.పి.సి. కాంట్రాక్టర్లకు కెసిఆర్ ప్రభుత్వం వర్తింపచేసింది. ఇది తప్పని కాగ్ నిర్ధారించి కాంట్రాక్టర్లకు భారీగా ఆర్థిక ప్రయోజనం కల్గిందని అభ్యంతరం వ్యక్తం చేయడం సబబేనా?

* * * * *

# 17

## ముగింపు :

తెలంగాణ ఏర్పాటైన తర్వాత విమర్శకులు ఈ రకంగా పేట్రేగిపోతారని ఆచార్య జయ శంకర్ గారు ముందే ఊహించారు. ఉద్యమ కాలంలో ఒక సందర్భంలో ఆచార్య జయశంకర్ గారు అన్న మాటలు ఇప్పుడు యాదికి వస్తున్నాయి. "తెలంగాణ ఏర్పాటు తర్వాత మన ప్రాంత మేధావుల Intellectual Emotions కు వ్యతిరేకంగా మనమే పోరాటం చేయవలసి వస్తుంది." మన మేధావులపై ఆచార్యుల వారు ఎంతో ముందు చూపుతో అన్న మాటలు కాళేశ్వరం విషయంలో అక్షరాల నిజమైనవి.

**ప్రత్యామ్నాయం సూచించలేని వారికి తప్పులు వెతికే హక్కు ఉంటుందా ?**

తెలంగాణ సాధనా ఉద్యమంలో నీళ్ళలో నిప్పులు రగిలించినవాడు, ఉమ్మడి రాష్ట్రంలో సాగునీటి రంగంలో జరిగిన అన్యాయాలను, వివక్షను ప్రజలకు పూసగుచ్చినట్టు తన ఉపన్యాసాలలో వివరించినవాడు. పత్రికల్లో వందాలాది వ్యాసాలను రాసి నీటి సంగతులు ప్రజలకు తెలియపరచినవాడు. ఆ వ్యాసాలను 'నీళ్ళు – నిజాలు' పేరుతో రెండు సంకలనాలను ప్రచురించి ప్రజలను చైతన్య పరచినవాడు ఆర్ విద్యాసాగర్ రావు గారు. తెలంగాణ రాష్ట్రంలో ఆయనను సాగునీటి సలహాదారులుగా నియమించారు కెసిఆర్. ప్రత్యామ్నాయాలను సూచించకుండా కాళేశ్వరం ప్రాజెక్టుపై తొలినాటి నుంచే నిరంతరం తప్పులు వెతికే, విమర్శలు గుప్పించే, ఎత్తిపోతల పథకాలను తెల్ల ఏనుగులని వర్ణించడం మేధావులపై ఆయన వ్యంగాత్మక చురకలు అంటించాడు. ప్రత్యామ్నాయాల్ని సూచించలేనివారికి, సూచించాలని అనుకోనివారికి తప్పులు ఎన్నే నైతిక హక్కు ఎక్కడిది ? అని ప్రశ్నించాడు.

కొన్నేళ్ళ క్రితం వాట్సాప్ గ్రూపుల్లో విస్తృతంగా తిరిగిన ఒక కథను ఈ సందర్భంగా పాఠకులతో పంచుకోవడం సమంజసం అనిపిస్తున్నది. ఒక ఆర్టిస్టు తన మొదటి పెయింటింగ్ పై విమర్శకుల అభిప్రాయాన్ని తెలుసుకుందామన్న ఆసక్తితో దాన్నిఉదయం ఒక బహిరంగ ప్రదేశంలో వేలాడదీసి దాని కింద "ఇది నా మొదటి పెయింటింగ్. ఈ బొమ్మలో మీకు ఎక్కడ తప్పులు కనిపిస్తే అక్కడ X మార్క్ పెట్టండి" అని ఒక నోట్ ని రాసినాడు. ఎర్ర రంగు, ఒక బ్రష్ ని కూడ పెట్టినాడు. సాయంత్రం వెళ్ళి చూసే సరికి అతనికి కండ్లు బైర్లు కమ్మినాయి. మొత్తం పెయింటింగ్ నిండా X మార్కులే ! అతను నిరాశతో తన గురువు గారి దగ్గరికి వెళ్ళి చూపించినాడు. గురువుగారు నిరాశ చెంద వద్దని, అదే బొమ్మని మరొకసారి వేసి అదే ప్రదేశంలో వేలాడదియ్యమని సూచించినాడు. అయితే ఈసారి నోట్ లో రాయవలసిన అభ్యర్ధనని మార్చమన్నాడు. గురువుగారి సూచన మేరకు అతను తన పెయింటింగ్ ని అదే ప్రదేశంలో వేలాడదీసి కింద ఈ రకంగా అభ్యర్థించినాడు. " ఇది నా మొదటి పెయింటింగ్. ఈ బొమ్మలో మీకు ఎక్కడ తప్పులు కనిపిస్తే అక్కడ సరి

చేయగలరు.” సాయంత్రం వెళ్ళి చూసే సరికి తన పెయింటింగ్ గీసింది గీసినట్లు అట్లనే ఉన్నది. సారాంశం ఏమిటంటే తప్పులు ఎన్నడం తేలికే. తప్పులు సరిదిద్దడం కష్టం. కాళేశ్వరం విమర్శకులు తేలికైన తప్పులు ఎన్నే పనిని ఎంచుకున్నారు. కష్టమైన తప్పులు సరిదిద్దే పనిని వదిలేశారు. పైగా అది మా పని కాదు అని దబాయించడం కూడా చేశారు.

**ఆదాయ వ్యయాల దృష్టి కోణం తెలంగాణకు మేలు చేస్తుందా? :**

దశాబ్దాలుగా తాగునీటికి, సాగునీటికి అల్లాడుతున్న తెలంగాణ ప్రజలకు తమకిచ్చిన కాలపరిమితిలోనే సాగునీరు, తాగునీరు అందించడం లక్ష్యంగా పని చేసింది కెసిఆర్ ప్రభుత్వం. ఆర్థిక సానుకూలత లేదన్న కారణంతో ఎత్తిపోతలను ప్రాజెక్టులను కట్టొద్దా? గతంలో ఆంధ్రా వలస పాలకుకు మీరు (తెలంగాణ) ఎత్తు గడ్డ మీద ఉన్నారు. నీరు పల్లమెరుగు. కాబట్టి మీకు నీళ్ళు రావు అనేవారు. “ నీరు కోస్తానెరుగు, నిజం దేవుడెరుగు, ఓ నీటిపారుదలా! నీ రాస్తా కోస్తాకే ” అని ఉద్యమ సమయంలో మన కవులు పాడినారు. “తలాపున పారుతుంది గోదారి – మన చేను మన చెలక ఏడారి” అని పాడారు కవి సదాశివుడు. “పల్లెపల్లెన పల్లేర్లు మొలిచే పాలమూరులోనా మన తెలంగాణలోనా” అని పాడారు కవి మిత్ర. ఎత్తిపోతల ద్వారా తప్ప గోదావరి నీరు ఎత్తుగడ్డ మీద ఉన్నతెలంగాణ భూములకు తరలించే మార్గం లేదని తెలిసీ కూడా ఆర్థిక సానుకూలత లేదన్న సాకుతో కాళేశ్వరం ఎత్తిపోతల పథకాన్ని వ్యతిరేకిస్తున్నారు. ఇద్దరి లక్ష్యం తెలంగాణ సాగునీరు అందకుండా చెయ్యడమే. అసలు తెలంగాణా ఎత్తిపోతల పథకాలను ఆదాయ వ్యయాల నిష్పత్తి దృష్టి కోణంతో విశ్లేషించడమే మూర్ఖపు పని. ఆదాయ వ్యయాల దృష్టి కోణంతో తెలంగాణ ప్రాజెక్టులను నిర్మించడం సాధ్యం కాదు. కాళేశ్వరం ప్రాజెక్టు వలన తెలంగాణా సమాజానికి కలిగే విస్తృత సామాజిక ఆర్థిక ప్రయోజనాలని పరిగణన లోనికి తీసుకోకుండా ఆదాయ వ్యయాల దృష్టి కోణంలో నుంచి చేస్తున్న విమర్శలు తెలంగాణకు మేలు చేయవు.

కళ్లముందు ఎ ఎం ఆర్ పి (నల్లగొండ), దేవాదుల (వరంగల్), అలీసాగర్, గుత్పా, చౌటుపల్లి హనుమంత్ రెడ్డి (నిజామాబాద్),కల్వకుర్తి, నెట్టింపాడు, బీమా, కోయిల్‌సాగర్, తుమ్మిళ్ళ (మహబూబ్ నగర్), ఎల్లంపల్లి (కరీంనగర్), నాగార్జునసాగర్ లో లెవల్ కాలువ(నల్లగొండ), గూడెం (మంచిర్యాల్), భక్తరామదాసు (ఖమ్మం), మంథని (భూపాలపల్లి) మొదలైన భారీ ఎత్తిపోతల పథకాలు విజయవంతం అయిన విషయం ఈ మేధావులకు కనిపించదా? తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత ప్రాజెక్టుల పనులు పరుగులు పెడుతున్నవి. కల్వకుర్తి, నెట్టెంపాడు, భీమా, కోయిల్ సాగర్, దేవాదుల, ఎల్లంపల్లి, ఎఎమ్ఆర్ పి లోలెవల్ ఎత్తిపోతల పథకాల ద్వారా సాగునీరు రైతులకు అందుతోంది. గత ప్రభుత్వాల కాలంలో ప్రారంభమైన అన్నిపెండింగ్ ఎత్తిపోతల పథకాలు ఇప్పుడు రన్నింగ్ ప్రాజెక్టులుగా మారినాయి. కాళేశ్వరం ఎత్తిపోతలు 2019 లో ప్రారంభం అయినాయి. సమ్మక్కసాగర్ బ్యారేజి పూర్తి అయ్యింది. దేవాదుల ప్రాజెక్టుకు ఏటా 200 రోజులు నీటిని ఎత్తిపోసుకునే వెసులుబాటు ఏర్పడింది. సీతమ్మసాగర్ బ్యారేజి, సీతారామ ఎత్తిపోతల పనులు చాయాలా మట్టుకు పూర్తి అయినాయి. పాలమూరు – రంగారెడ్డి ప్రాజెక్టులో తాగునీటి కాంపొనెంట్ లో భాగంగా జలాశయాలు, పంప్ హౌజ్ లు, సొరంగాలు, పైప్ లైన్లు 70 శాతం పూర్తి అయినాయి. కాలువలు తవ్వే పని మొదలు కావాల్సి ఉంది. కేంద్రం నుంచి పర్యావరణ అనుమతి వస్తే తప్ప కాలువల తవ్వకం సాధ్యం కాదు. చనాక కొరాట పెన్ గంగా బ్యారేజిని పూర్తి చేసింది. పంపు హైవుజ్ ట్రయల్ రన్

కూడా విజయవంతం అయ్యింది. యుద్ధ ప్రాతిపదికన మిగిలిపోయిన ప్రాజెక్టుల పనులని పూర్తి చెయ్యవలసిన బాధ్యత ప్రస్తుత ప్రభుత్వంపై ఉన్నది.

**తెలంగాణ సివిల్ సొసైటీ ఏమి చేయాలి ? :**

తెలంగాణ ప్రజలకు ఇచ్చిన వాగ్దానం మేరకు అన్నిఅడ్డంకులను అధిగమించి యుద్ధ ప్రాతిపదికన కాళేశ్వరం ప్రాజెక్టులో కీలక నిర్మాణాలు మూడేండ్లలోనే పూర్తి చేసి రైతాంగానికి సాగునీరు అందించింది కెసిఆర్ ప్రభుత్వం. ఈ వాస్తవాన్ని జీర్ణించుకోలేని మేధావులు ఇంకా కాళేశ్వరం ప్రాజెక్టుపై విమర్శలు గుప్పిస్తూనే ఉన్నారు. నిజానికి వీరంతా సామాజిక బాధ్యత కలిగిన సివిల్ సొసైటీ సభ్యులే అయితే మేడిగడ్డ బ్యారేజీని త్వరితగతిన పునరుద్దరించి కాళేశ్వరం ప్రాజెక్టులో లింకు 1 ని వినియోగంలో పెట్టాలని ప్రభుత్వాన్ని డిమాండ్ చేయాలి. గడచిన మూడు పంట కాలాలకు సాగునీరు అందించకపోవడంతో ప్రాజెక్టు ఆయకట్టు ప్రాంతంలో, శ్రీరాంసాగర్, నిజాంసాగర్ ఆయకట్టు ప్రాంతంలో మళ్ళీ సాగునీటి సంక్షోభం తలెత్తిన సంగతి వీరి దృష్టికి రాలేదా? వచ్చినా గుర్తించ నిరాకరిస్తున్నారా? రాష్ట్రంలో రైతుల ఆత్మహత్యలు పెరుగుతున్న సంగతిని ఈ సివిల్ సొసైటీ సభ్యులు గమనిస్తున్నారా?  చేయవలసిన పని చేయకుండా ఇంకా కక్ష పూరితంగా కాళేశ్వరం ప్రాజెక్టుపై విమర్శలు గుప్పిస్తూనే ఉన్నారు. ఈ విమర్శల విషయంలో అబద్ధపు గోడలను బద్దలుకొట్టి ప్రజలకు అసలు వాస్తవాలు తెలియపరచాలన్న భావనతో ఈ పుస్తకాన్ని వెలువరించడం జరిగింది. పుస్తకం చదివిన వాళ్ళలో ఒక్కరికైనా వాస్తవాలు అర్థం అయితే నా ప్రయత్నం సఫలం అయిందని భావిస్తాను. ఆ ఒక్క వ్యక్తి ద్వారా మరో పది మందికి, ఆ పది మంది ద్వారా మరో వంద మందికి, ఆ వంద మంది ద్వారా మరో పది వేల మందికి విషయాలు చేరుతాయి.

* * * * *

18

# సంప్రదించిన గ్రంథాలు


- Kaleshwaram Lift Irrigation Project -- Will it Benefit Telangana State ? by Dr. Biksham Gujja , Dr. Shiv Kumar , Mr. Raghu Kancharla
- Detailed Project Report of Kaleshwaram Project
- Detailed Project Report of Pranahitha Chevella Project
- CWC Gauge readings from 1970 -- 71 to 2012 -- 13
- KWDT-I Report, 1979
- GWDT Report, 1980
- KG Commission Report, 1962
- Projects For Prosperity : The Story of Hyderabads Bid For Self-sufficiency through Irrigation and Power Projects by Sadat Ali Khan, Published by Govt. of Hyderabad, 1951.
- Major Lift Irrigation Schemes in Telangana on Krishna River compiled by Sri K. Penta Reddy and published by Telangana Retired Engineers Forum.
- The Kaleshwaram Fiasco - A Tale of Greed and Negligence by Remilla Avadhani, 2024
- Replies to CAG paras submitted by Govt. of Telangana, 2023.
- నీళ్ళు – నిజాలు , 1,2 & 3 భాగాలు, రచయిత ఆర్ విద్యాసాగర్ రావు (2008, 2012 & 2018)
- తెలంగాణ జీవనాడి – కాళేశ్వరం ప్రాజెక్టు, ప్రచురణ: తెలంగాణ విశ్రాంత ఇంజనీర్ల సంఘం, 2018
- కాళేశ్వరం ప్రాజెక్టు : తెలంగాణ ప్రగతి రథం, రచయిత : శ్రీధర్ రావు దేశ్పాండే, 2019
- కాళేశ్వరం ప్రాజెక్టు – కళ్ళు తిరిగే వాస్తవాలు, తెలంగాణ జె ఏ సి , 2020

# రచయిత పరిచయం

## శ్రీధర్‌రావు దేశ్‌పాండే



| | | |
|---|---|---|
| పుట్టిన తేది | : | 5 ఏప్రిల్, 1963 |
| పుట్టిన ఊరు | : | బోథ్ ఆదిలాబాద్ జిల్లా |
| తల్లిదండ్రులు | : | శ్రీ అంబారావు దేశ్‌పాండే, శ్రీమతి సుశీలాబాయి |
| కుటుంబ సభ్యులు | : | భార్య – డా॥ భారతి (గీతాంజలి), కూతుళ్ళు : అంజలి, వెన్నెల. |
| మెట్రిక్యులేషన్ | : | జిల్లా పరిషత్ ఉన్నత పాఠశాల,<br>ప్రభుత్వ జూనియర్ కళాశాల, బోథ్ (1978) |
| ఇంటర్మీడియట్ | : | ప్రభుత్వ కళాశాల, ఆదిలాబాద్ (1980) |
| ఇంజనీరింగ్ | : | బి.ఇ. (సివిల్), ముఫఖంజా కాలేజ్ ఆఫ్ ఇంజనీరింగ్ & టెక్నాలజి, హైదరాబాద్ (ఉస్మానియా విశ్వవిద్యాలయానికి అనుబంధం) (1981–85) |
| ఉద్యోగం | : | 1987 లో అసిస్టెంట్ ఎగ్జిగ్యూటివ్ ఇంజనీరుగా ఆదిలాబాద్ జిల్లా ఉట్నూర్‌లో సాగునీటి శాఖలో చేరిక.<br>2003 లో డిప్యూటి ఎగ్జిగ్యూటివ్ ఇంజనీరుగా పదోన్నతి,<br>2013 లో ఎగ్జిగ్యూటివ్ ఇంజనీరుగా పదోన్నతి<br>2014 – 2018 వరకు సాగునీటి మంత్రి శ్రీ హరీష్‌రావు పేషిలో ఓఎస్‌డి<br>2020 లో సూపరింటెండింగ్ ఇంజనీర్ గా పదోన్నతి<br>2018 – 2023 వరకు ముఖ్యమంత్రి కార్యాలయంలో ఓఎస్‌డి<br>30 ఏప్రిల్ 2024న ఉద్యోగ విరమణ. |

**రచనలు :**

1) తెలంగాణ రాజకీయ, ఆర్థిక, సామాజిక వ్యాసాలు, 2007
2) ముల్కీ రూల్స్ పునరుద్ధరణ ఆవశ్యకత, 2008
3) తెలంగాణ ప్రజల పట్ల విశ్వాసఘాతుకం – శ్రీకృష్ణ కమిటీ, 2010
4) తెలంగాణ ప్రజల మహత్తర పోరాటం – సకల జనుల సమ్మె, 2012
5) Telangana state - A People Demand : History and Genesis of struggles, 2012.
6) భారత రాష్ట్రాల ఏర్పాటు పరిణామ చరిత్ర, 2013
7) బట్వారా – విభజన వ్యాసాలు, తెలంగాణ ప్రొగ్రెసివ్ ఫౌండేషన్ ప్రచురణ (2013)
8) తెలంగాణ సాగునీటిరంగ పితామహుడు నవాబ్ అలీ నవాబ్ జంగ్ బహదూర్, 2013
9) మిషన్ కాకతీయ అవగాహన పత్రం, 2014
10) తెలంగాణ ఉద్యమ సాఫల్యత, 2016
11) కాళేశ్వరం ప్రాజెక్టు : తెలంగాణ ప్రగతి రథం, 2019
12) మిషన్ కాకతీయ : చెరువుల పునరుద్దరణ – పురోగతి–ఫలితాలు–ప్రభావాలు, 2019
13) ఐదేండ్లలో సాగునీటి రంగంలో ప్రగతి : కోటి ఎకరాల మాగాణం దిశగా ప్రయాణం (ప్రొఫెసర్ బియ్యాల జనార్ధన రావు 18 వ స్మారకోపన్యాసం), 2020.

14) పోతిరెడ్డిపాడు : పుట్టుక – పరిణామక్రమం – పర్యవసానాలు (2020) (సల్లా విజయకుమార్‌తో కలిసి)
15) అమెరికా ముచ్చట్లు (అమెరికా పర్యటనానుభవాలు) – (2023)
16) నా వృత్తి జీవితం – అనుభవాలు, సర్ మోక్షగుండం విశ్వేశ్వరాయ స్వీయ చరిత్ర అనువాదం (2023)
17) బొంతల ముచ్చట్లు (2024)
17) వివిధ పత్రికల్లో సాహిత్య విమర్శ, సాంస్కృతిక, ఉద్యమ వ్యాసాలు

**కథలు:**

1) ఊసరవెల్లి, చెహూవ్ రష్యన్ కథకు అనుసరణ, నలుపు పక్ష పత్రిక, డిసెంబర్ 16 – 31, 1990.
2) అభిజాత్యం, ఆహ్వానం మాస పత్రిక, ఫిబ్రవరి 1995
3) అద్భుతాలు సృష్టించే మనిషి, హెచ్.జి.వెల్స్ ఇంగ్లీషు కథ అనువాదం, విపుల మాస పత్రిక, సెప్టెంబర్ 1996.
4) లవ్ ఎట్ ఫస్ట్ సైట్, రచన మాసపత్రిక, జూలై, 1997.
5) మడుగు, రస్కిన్ బాండ్ ఇంగ్లీషు కథ అనువాదం, ఆంధ్రజ్యోతి ఆదివారం అనుబంధం, 9 నవంబర్, 1997
6) మరే కిసాన్, వార్త ఆదివారం అనుబంధం, 20 మే, 2001.
7) బొక్కలు మోసే గాడ్డి, ప్రజా సాహితి మాస పత్రిక, నవంబర్ 2002
8) ముసురిడిసిన మొగులు, సోయి, తెలంగాణ సాహిత్య పత్రిక

**సంపాదకత్వం:**

1) 1969 ఉద్యమ చారిత్రక పత్రాలు (2 సంపుటాలు), (తెలంగాణ హిస్టరీ సొసైటీ సభ్యులతో కలిసి)
2) నీళ్ళు నిజాలు (2 సంపుటాలు), రచయిత – ఆర్. విద్యాసాగర్ రావు
3) ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు – విద్రోహ చరిత్ర (తెలంగాణ హిస్టరీ సొసైటీ సభ్యులతో కలిసి)
4) కమ్యూనిజమా? కోస్తావాదమా? సి.పి.యం. తెలంగాణ వ్యతిరేక వైఖరిపై వ్యాసాలు (సుంకిరెడ్డి నారాయణ రెడ్డి , సంగిశెట్టి శ్రీనివాస్, తదితరులతో కలిసి)
5) Memorandum of Appeal Submitted to Justice Sri Krishna Committee (with C. Vittal & J. Ramachandra Rao, Advocate) (2010) on behalf of Telangana Employees Association
6) తెలంగాణ టైమ్స్ పత్రిక (22 సంచికలు), తెలంగాణ విద్యావంతుల వేదిక తరపున ప్రచురణ
7) తెలంగాణ సోయి పత్రిక (9 సంచికలు), తెలంగాణ రచయితల వేదిక తరపున ప్రచురణ
8) తెలంగాణ సమాలోచన (2014), తెలంగాణ విద్యావంతుల వేదిక తరపున ప్రచురణ
9) Mission Kakatiya : Re-Inventing Telangana, Restoration of Minor Irrigation Sources and other Water Bodies with Shri S.K. Joshi I.A.S., Spl.Chief Secretary and Sri.G. Malsur, Commissioner CADA. (2016)
10) తెలంగాణ జల విజ్ఞాన నిధి – ఆర్. విద్యాసాగర్ రావు (జూలూరి గౌరీ శంకర్ తో కలిసి), 2018.
11) నీళ్లు – నిజాలు : 3, రచయిత–ఆర్. విద్యాసాగర్ రావు (సల్లా విజయ్ కుమార్ తో కలిసి), 2018.
12) యాది–మానాది, వేణు & సురేంద్రబాబు సంస్మరణ సంచిక (బి రమేష్ బాబుతో కలిసి), 2022
13) సాగునీటి రంగంలో ప్రగతి ప్రవాహం – తెలంగాణ దశాబ్ది ఉత్సవాల నివేదిక (కె. శ్రీనివాస్‌తో కలిసి), 2023.